సురవరం ప్రతాపరెడ్డి

# గోలకొండ పత్రిక సంపాదకీయాలు

మొదటి సంపుటం

**1926-1936**

సంపాదకులు :

దేవులపల్లి రామానుజరావు

డా॥ ఎల్లూరి శివారెడ్డి

ప్రచురణ :

సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్, హైదరాబాదు -500 001.

సురవరం ప్రతాపరెడ్డి

# గోలకొండ పత్రిక సంపాదకీయాలు

మొదటి సంపుటం

**1926–1936**


సంపాదకులు :

దేవులపల్లి రామానుజరావు

డా॥ ఎల్లూరి శివారెడ్డి



ప్రచురణ :

సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్‌రోడ్, హైదరాబాదు -500 001

SURAVARAM PRATAPA REDDY GOLAKONDA PATRIKA SAMPADAKEEYALU Part-I
Edited by Devulapalli Ramanuja Rao, Dr. E. Siva Reddy

ప్రచురణ :
**సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి**
**ఆంధ్ర సారస్వత పరిషత్తు,**
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.



ప్రథమ ముద్రణ : 1989

ప్రతులు : 1000

**వెల : రూ. 30-00**

ప్రతులకు :
**సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి**
**ఆంధ్ర సారస్వత పరిషత్తు,**
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,**
హైదర్‌గూడా, హైదరాబాదు - 500 029.



శ్రీ సురవరం ప్రతాపరెడ్డి

జననం : 28-5-1896 అస్తమయం : 25-8-1953

## సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి

# విజ్ఞాపన

సురవరం ప్రతాపరెడ్డి నామ సంస్మరణ మాత్రాన ఆనాటి తెలంగాణా లోని సాంఘిక చైతన్యం గుర్తుకు వస్తుంది. గోలకొండ ప్రాతం ఫిరంగి మ్రోత లతో తెలుగు గుండెలలో వీరావేశం నింపిన ధీరుడాయన. పత్రికా సంపాదకుడుగా పరిశోధక పండితుడుగా, అనేక సంస్థల ప్రోత్సాహకుడుగా, ఉత్తమాభిరుచిగల రచయితగా, విశాలాంధ్రోద్యమ ప్రేరకుడుగా సురవరం వారి కృషి సంస్తవ నీయం. విశిష్టమైన శైలి, నిర్దిష్టమైన భావం, ఆర్జవావేశం, విషయవైభవం వారి రచనలోని సహజగుణాలు.

ప్రతాపరెడ్డిగారి ముద్రితాముద్రిత రచనలు సేకరించి వాటి ముద్రణ కార్యక్రమాన్ని చేపట్టడానికి ఏర్పాటైన సంస్థ "సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి". ఈ సంస్థలోని సభ్యులు :

అధ్యక్షుడు :

**జస్టిస్ కొండా మాధవరెడ్డి**

ఉపాధ్యక్షుడు :

**శ్రీ దేవులపల్లి రామానుజరావు**

సభ్యులు :

**డా॥ సి. నారాయణరెడ్డి**

**డా॥ బి. రామరాజు**

**డా॥ ముకురాల రామారెడ్డి**

**శ్రీ యస్.ఎన్. రెడ్డి**

**డా॥ ఎల్లూరి శివారెడ్డి**

కార్యదర్శి :

**శ్రీ మామిడి రామిరెడ్డి**

కోశాధికారి :

**శ్రీ గోలి ఈశ్వరయ్య**

సురవరం వారి సంపూర్ణ గ్రంథావళి ప్రచురితమైతే పరిశోధకులకు, పరిశోధక విద్వాంసులకు ప్రయోజనకరంగా ఉంటుందని ఈ సంస్థ భావి స్తున్నది. ఈ ఆశయంతో మొదట "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" ముద్రించటం జరిగింది. గ్రంథ ముద్రణ కార్యభారాన్ని వహించటానికి ఈ సంస్థ ప్రత్యే కంగా "సంపాదక మండలి"ని ఏర్పాటు చేసింది. ఇందులోని సభ్యులు :

అధ్యక్షుడు :

**డా॥ సి. నారాయణరెడ్డి**

సభ్యులు :

**శ్రీ దేవులపల్లి రామానుజరావు**
**డా॥ బి. రామరాజు**
**డా॥ ముకురాల రామారెడ్డి**
**శ్రీ గడియారం రామకృష్ణశర్మ**
**శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి**
**డా॥ సురవరం పుష్పలత**
**డా॥ ఇందుర్తి ప్రభాకరరావు**

కార్యదర్శి :

**డా॥ ఎల్లూరి శివారెడ్డి**

కోశాధికారి :

**శ్రీ యస్.యన్. రెడ్డి**

సంపాదకమండలి ప్రతాపరెడ్డిగారి గ్రంథ ప్రచురణ కార్యక్రమాన్ని ప్రారంభించి ఇంతవరకు ఎనిమిది గ్రంథాలను ప్రచురించింది. ప్రస్తుతం

ప్రతాపరెడ్డిగారి గోలకొండ పత్రిక సంపాదకీయాలను రెండు సంపుటాలుగా ప్రచురిస్తున్నది. సురవరం వారి ముఖ్య రచనలన్నీ అనతికాలంలో ముద్రించా లన్నది సంపాదకమండలి నిర్ణయం. ఈ నిర్ణయానికి సహృదయులు, వదాన్యుల సహకారం తోడయితే మా ఆశయం అచిరకాలంలోనే నెరవేరుతుంది.

ప్రతాపరెడ్డిగారి రచనలు ముద్రించటంలో ఎంతో ఔదార్యం చూపి ఆర్థిక సహాయం చేసిన శ్రీ చల్లా రామభూపాల్‌రెడ్డిగారికి, శ్రీ యస్. గోపాల్‌రెడ్డి గారికి, శ్రీ డా॥ జి. నందగోపాల్‌గారికి, శ్రీ మద్దూరు సుబ్బారెడ్డిగారికి, హుసేన్ అబ్బాస్ అండ్ కంపెనీవారికి శ్రీ చెరుకూరు రామరాజుగారికి, శ్రీమతి ఇ. సరస్వతమ్మగారికి చల్లా వెంకటేశ్వరమ్మగారికి, హెచ్. లక్ష్మీదేవమ్మ గారికి, బిశ్వేశ్వర్‌లాల్ అగర్‌వాల్‌గారికి, శ్రీ వెంకట రామప్పగారికి — సాహిత్య వైజయంతి కృతజ్ఞత తెలుపుకుంటున్నది.

హైదరాబాద్
1-6-1989.

**డా॥ సి. నారాయణరెడ్డి**
అధ్యక్షుడు
**సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి**
(సంపాదక మండలి)

# తొలి పలుకు

భారతదేశంలో పత్రికల చరిత్ర చాలా ఉజ్జ్వలమైందని చెప్పవచ్చు. భారతదేశ స్వాతంత్ర్య సాధనకు, భారత జాతీయతకు, భారతదేశ సమైక్యతకు ఈ పత్రికలు చాలా తోడ్పడినవి. దేశ భాషా పత్రికలే కాక ఇంగ్లీషు పత్రికలు కూడా ఈ మూడు ఆశయాల సాధనకు గణనీయమైన కృషి కావించినవి. భారత ప్రజాస్వామికానికి కూడా పత్రికలు ఇప్పటి వరకు చేసిన, ఈనాడు చేస్తున్న కృషి చాలా గొప్పదని చెప్పవచ్చు. ఒక చిత్రమేమంటే ఇంగ్లీషు వారిని ఈ దేశం నుంచి వెళ్ళగొట్టి స్వరాజ్యసాధనకు కృషిచేసిన కొన్ని ముఖ్యమైన పత్రికలు ఇంగ్లీషులోనే నడిచినవి. చాలా మంది ఆంధ్రులు ఈ ఇంగ్లీషు పత్రికల నిర్వహణకు తోడ్పడినారు. వీరిలో సి. వై. చింతామణి, కోటంరాజు సోదరులు, యం. చలపతిరావు, కాసా సుబ్బారావు మొదలయినవారు ప్రత్యేకంగా పేర్కొనదగినవారు. తెలుగుపత్రికా సంపాదకులలో కాశీనాథుని నాగేశ్వరరావు,ముట్నూరి కృష్ణారావుగారు ఈ తరగతికి చెందినవారు.

ప్రతాపరెడ్డిగారు 1926 లో గోలకొండ పత్రికను ద్వైవార పత్రికగా స్థాపించినారు. అప్పుడు హైదరాబాదు రాష్ట్రంలో తెలంగాణ, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలు ఉండేవి. ఇందులో తెలంగాణా ప్రజలు అధిక సంఖ్యాకులు, తెలుగు ప్రధానమైన భాష. అప్పుడు మహారాష్ట్ర, కర్ణాటక భాషలకు ఏవిధమైన స్థానం ఉండేదికాదు. ప్రజలకు వాక్ స్వాతంత్ర్యం మొదలైన ప్రాథమిక స్వత్వాలు ఏమీ లేకుండెను ఇటువంటి పరిస్థితుల్లో గోలకొండకు పూర్వమే నీల గిరి. తెలుగు పత్రికలు రెండు మూడేండ్లు నడిచి ఆగిపోయినవి. కాని గోలకొండ పత్రిక మాత్రం 1947 వరకు ద్వైవార పత్రికగా నడిచి దినపత్రికయై తరువాత సుమారు 20 సంవత్సరాలపాటు వెలువడినది. ఆ రోజుల్లో హైదరాబాదు పత్రికలకు ప్రజలు, ప్రజల ఉద్యమాలతో సంబంధం కలిగినవారు సంపాదకులుగా ఉండే

వారు. ఉర్దూలో రయ్యత్ పత్రిక సంపాదకులైన మందుముల నరసింగరావు గారు, పయాం పత్రిక సంపాదకులైన ఖాజీ అబ్దుల్ గఫార్ (మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారిచేత ప్రభావితుడు,) ఆర్యభాను పత్రికా సంపాదకులైన వినాయక రావు విద్యాలంకార్‌గారు ప్రత్యేకంగా పేర్కొనదగినవారు. ఆ రోజుల్లో మాడపాటి హనుమంతరావుగారు ముషీరె దక్కన్ పత్రికకు సంపాదకీయాలు రాస్తుండేవారు. ఈ పత్రికా సంపాదకులందరు ప్రజల ఉద్యమాలతో సంబంధం కలిగి ప్రజల సమస్యలపట్ల సానుభూతి కలిగినవారు. ఒకవేళ ఆ రోజుల్లోనే ప్రజలు ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వం ఏర్పడితే వీరిలో ప్రతి ఒక్కరు ముఖ్యమంత్రి కాదగిన వారే. వారి వ్యక్తిత్వాలలో అతివాద, మితవాద ధోరణులేమైనప్పటికి అందరూ ప్రజల మనుష్యులే అని చెప్పవలసి ఉంటుంది. పత్రికా నిర్వాహణలోను సంపాద కీయాల తీరుతెన్నులలోను వారి వ్యక్తిత్వాల ప్రభావంవలన కొన్ని వ్యత్యాసాలు ఉండియుండ వచ్చును.

1926 లో ప్రారంభమైన గోలకొండ పత్రికకు ప్రతాపరెడ్డిగారు మొదటి రెండు మూడు సంవత్సరాలు ప్రచ్ఛన్నంగాను, తరువాత ప్రత్యక్షంగాను సంపా దకులుగా ఉండి పత్రికను నిర్వహించినారు. గమనించవలసిన విషయం ఏమి టంటే ప్రతాపరెడ్డిగారు, నరసింగరావుగారు, హనుమంతరావుగారివలెనే న్యాయ వాద వృత్తితోనే జీవితం ప్రారంభించినారు. హనుమంతరావుగారు షష్ఠిపూర్తి వరకు న్యాయవాద వృత్తిని వదలిపెట్టలేదు. కాని ప్రతాపరెడ్డిగారు, నరసింగ రావుగారు, కొన్ని సంవత్సరాలలోనే న్యాయవాద వృత్తిని వదలుకొని పూర్తిగా పత్రికలకే అంకితమయినారు. ఆ రోజుల్లో హైదరాబాదు రాష్ట్రంలో, ముఖ్యంగా తెలంగాణాలో ప్రజల శ్రేయస్సుకు సంబంధించిన ఏ ఉద్యమాలు వచ్చినప్పటికి వీటన్నిటితోను ప్రతాపరెడ్డిగారు సంబంధం కలిగినవారు. మొట్టమొదటి ఆంధ్ర మహాసభకు ప్రతాపరెడ్డిగారే అధ్యక్షులు. ఆ రోజుల్లో సంఘ సంస్కరణ సభ లకు అనేకమైన వాటికి అధ్యక్షత వహించినారు. ఆ రోజుల్లో ప్రజలకు మేలు కగిలించే ఏ ఉద్యమం వచ్చినా ప్రతాపరెడ్డిగారి సహాయం దానికి లభించేది.

ఆనాటి ప్రజల రాజకీయ, ఆర్థిక సాంఘిక సమస్యలపట్ల అవగాహన కలిగి సానుభూతి కలిగిన ప్రతాపరెడ్డిగారు గోలకొండ పత్రికను ఆనాటి తెలంగాణాకు దర్పణంగా రూపొందించినారు. ఆ రోజుల్లో గోలకొండ వెళ్ళని ఊరేలేదు. నిజానికి తెలంగాణాను మేలుకొల్పిన వ్యవస్థలలో గోలకొండ పత్రికకు ప్రత్యేక స్థానం ఇవ్వవలసి ఉంటుంది. ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాలవలె, మందుముల నరసింగరావుగారి రయ్యత్ సంపాదకీయాలు, ప్రతాపరెడ్డిగారి గోలకొండ పత్రికా సంపాదకీయాలు ప్రజలను జాగృతం చేసినవని చెపితే ఆశ్చర్యం కాదు.

ప్రతాపరెడ్డిగారు బహుభాషావిశారదులు. ఉత్తమశ్రేణికి చెందిన పండితులు. మంచి పరిశోధకులు. తెలుగులో అనేక సృజనాత్మక రచనలు చేసిన భావుకులు. వీరు కవితలు అల్లినారు. కథలు చెప్పినారు. నాటకాలు వ్రాసినారు. తెలుగు వచన రచనకు రూపురేఖలు దిద్దినారు. అనేక విషయాలపైన విజ్ఞాన ప్రబోధకరాలైన వ్యాసాలను వ్రాసినారు. ప్రామాణికమైన గ్రంథాలను వ్రాసినారు. అయినా ఆనాటి చాలామంది పండితులవలె దేశాన్ని ప్రజలను మరచిపోయి వారికి దూరంగా ఉండని త్యాగశీలి ప్రతాపరెడ్డిగారు. అందుచేతనే గోలకొండ పత్రికద్వారా తెలంగాణా రాజకీయ జీవితానికి పునాదులు వేసినారు. అప్పటి నిజాం రాష్ట్రంలో ప్రాథమిక స్వత్వాలు ఏమీ లేకుండెను. ప్రజలకు ప్రాథమిక స్వత్వాలు లభించవలెనని పోరాడినవారిలో ప్రతాపరెడ్డిగారు ప్రముఖులు. ఆ రోజులలో గష్తీనిషాన్ 53 అనే ప్రభుత్వ ఉత్తర్వు అమలులో ఉండేది. ఈ గష్తీప్రకారం గ్రంథాలయాలు పెట్టుకొనవలెనన్న, సభలను చేసుకొనవలెనన్న, సభను నడపవలెనన్న ప్రభుత్వం అనుమతి అవసరమై ఉండేది. అనేక సందర్భాలలో ఈ అనుమతి లభించేదికాదు. ఒకసారి ప్రతాపరెడ్డిగారు ఈ గష్తీనిషాన్ 53 గురించి ప్రస్తావిస్తూ ఇది" వాగ్బంధన శాసన శృంగార తాండవ క్రియావిశేషం" అని చమత్కరించినారు. ఆనాటి సమస్యలపట్ల గోలకొండ పత్రికలో వచ్చిన సంపాదకీయాలను గూర్చి ప్రభుత్వం నుంచి అప్పుడప్పుడు హెచ్చరికలు వస్తుండేవి. కాని, ప్రతాపరెడ్డిగారు ఈ హెచ్చ

రికలను పాడించక తమ సహజ ధోరణిప్రకారమే పత్రికద్వారా ప్రాథమిక స్వత్వాలను సమర్థించేవారు.

1947 లో గోలకొండపత్రిక దినపత్రిక అయిన తరువాత ఈ పత్రిక సంపాదకీయాలపైన ప్రభుత్వం ఒక ఆంక్షను విధించింది. ఆ ఆంక్షప్రకారం ప్రతిరోజు వ్రాసే సంపాదకీయాలను మొదట సమాచారశాఖకు పంపి వారు సూచించిన మార్పులను చేయవలసి ఉండేది. కాని ప్రతాపరెడ్డిగారు ఈ ఆంక్షను ఒప్పుకోలేదు. అందుకు బదులుగా ప్రపంచ మహనీయులు అన్ని భాషలలో వ్రాసిన సూక్తులను-ముఖ్యంగా ప్రజల ప్రాథమిక స్వత్వాలకు సంబంధించిన సూక్తులను-సేకరించి ఒక్కొక్కరోజు ఒక సూక్తిని ప్రకటించేవారు. ఈ సూక్తులు ప్రభుత్వానికి సంపాదకీయాలకన్నా ఎక్కువ బాధకలిగించేవి. పత్రికల చరిత్రలో ఇది మరువరాని సన్నివేశం.

ఆనాటి హైదరాబాదు రాష్ట్రానికి, తెలంగాణాకు సంబంధించిన రాజకీయ ఆర్థిక, సామాజిక సమస్యలకు సంబంధించిన విషయాలపైన ప్రతాపరెడ్డిగారు సంపాదకీయాలు వ్రాసేవారు. అందుచేత ఆనాటి పరిస్థితులకు సంబంధించిన ఏ విషయాన్ని గురించి పరిశోధన జరిగినా గోలకొండ పత్రిక సంపాదకీయాలలో విలువైన సమాచారం లభిస్తుంది. చరిత్ర, సాంఘిక శాస్త్రం, ఆర్థిక పరిస్థితులు, రైతుల ఇబ్బందులు స్త్రీ విద్య, స్త్రీ స్వాతంత్ర్యం, మాతృభాషలో విద్యాబోధన, విద్యావిషయాలు మొదలైన అనేక సమస్యలపైన పరిశోధన చేయదలచుకున్న వారు ఈ సంపాదకీయాలు అవశ్యం చదువ దగినవి.

ప్రతాపరెడ్డిగారి శైలి విశిష్టమైంది. ఏ విషయాన్ని గురించి చెప్పవలసి వచ్చినా దాపరికం లేకుండా, స్పష్టంగా, సూటిగా తమ అభిప్రాయం ప్రకటించే వారు ప్రతాపరెడ్డిగారు. ఈ విశిష్టత వారి సంపాదకీయాలలోకూడా కనిపిస్తుంది. స్వచ్ఛమైన తెలంగాణ తెలుగు ప్రతాపరెడ్డిగారి శైలిలో నిగనిగ లాడుతుంది. వారు వ్రాసిన సంపాదకీయాలు ఏవో ఏవి కావో వారి సమకాలికులు సులభంగా

తెలుసుకునే వారు. ప్రతాపరెడ్డిగారి సంపాదకీయాలలో వ్యంగ్యం, అధిక్షేపం, తీవ్రత, అభినివేశం అనే గుణాలు కొట్టవచ్చినట్లు కనిపించేవి. విషయానికి అనుగుణంగా వారు శైలిని మార్చి వ్రాసేవారు. స్వేచ్ఛగా వ్రాసేవారు. అప్పుడప్పుడు ప్రతాపరెడ్డిగారు స్వగ్రామమైన ఇటికాల పాడుకు (అప్పుడది నీళ్లు లేని ఇటికేల పాడు) వెళ్ళి వచ్చేవారు. వారు లేనప్పుడు సంపాదకీయాలు వ్రాసే బాధ్యత స్నేహితుల కెవరికైనా అప్పగిస్తూండే వారు. ఆ సంపాదకీయాలు చదివితే ప్రతాపరెడ్డిగారు హైదరాబాదులో లేరన్న విషయం సులభంగా అర్థమయ్యేది. సంపాదకీయాన్ని చదివి మీరు తిరిగి హైదరాబాదు వచ్చారని తెలిసిందని ఉత్తరాలు వ్రాసిన మిత్రులు వారికి లేకపోలేదు. సంపాదకీయాలను చదివితే ఆయన ఉనికి స్పష్టంగా తెలిసిపోయేది.

ఆనాడు దేశానికి మార్గదర్శకులైనవారు పత్రికలనే అందుకు సాధనంగా వినియోగించుకున్నారు. అన్నిటికన్న మిన్నగా మహాత్మాగాంధిగారు యంగ్ ఇండియా, మరియు హరిజన్ పత్రికలను, బాలగంగాధర తిలక్ గారు మరాటా, కేసరిద్వారా, జవహర్‌లాల్ నెహ్రూగారు నేషనల్ హెరాల్డు పత్రికద్వారా, మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారు అల్ హిలాల్ పత్రిక ద్వారా, రాజగోపాల చారిగారు స్వరాజ్య పత్రికద్వారా తమ అభిప్రాయాలను ప్రజలకు అందజేసినారు. ప్రతాపరెడ్డిగారు ఈ మహనీయుల మార్గమునే అవలంబించిరి. బి. ఏ., బి. యల్ పట్టభద్రులైన ప్రతాపరెడ్డిగారు వృత్తినే అవలంబిస్తే న్యాయమూర్తులయ్యేవారు. ఉద్యోగమే చేస్తే పెద్ద పదవి దొరికేది. వ్యవసాయం చేసుకున్నా తగినంత సంపాదన లభించేది. పుష్కలమైన సంపాదన కొరకు అవసరమైన అవకాశాలన్నీ కలిగినప్పటికి ప్రతాపరెడ్డిగారు వాటిని వినియోగించుకొనక పత్రికా నిర్వహణకు తమ జీవితమును అంకితము చేసినారు. ఇది ఆయన త్యాగ నిరతికి నిదర్శనం. గోలకొండ పత్రికతో ఆకస్మికముగా సంబంధం వదలుకొన్నప్పుడు మరొక పత్రిక స్థాపించే దాక ప్రతాపరెడ్డిగారు నిదురపోలేదు. ప్రజావాణి పత్రికను కొంతకాలము వారు నడిపినారు. ప్రజావాణి

కూడా గోలకొండ సంప్రదాయాన్ని అనుసరించింది. ఈవిధంగా దేశ సేవ కొరకు పత్రికను సాధనంగా స్వీకరించి సంపాదక వృత్తికి ఆత్మార్పణ గావించిన ప్రతాపరెడ్డిగారి వంటివారు దేశనాయకులలో, మేధావులలో, పత్రికా సంపాదకులలో ఎంతమంది?

1926 నుంచి 1947 దాకా ప్రతాపరెడ్డిగారు గోలకొండపత్రికకు సంపాదకులుగా ఉన్నారు. ఈ రెండు దశాబ్దుల సంపాదకీయాల నుంచి కొన్ని ముఖ్యమైన సంపాదకీయాలను రెండు సంపుటాలుగా కూర్చటం జరిగింది. రెండు, మూడు సంపుటాలు మాకు లభ్యం కాలేదు. దేశ సమస్యలు, ప్రజల సమస్యల పట్ల ప్రతాపరెడ్డిగారి దృక్పథాన్ని వివిధ కోణాలనుంచి చూపటానికి వీలుగా ఈ సంపాదకీయాలను ఎన్నుకోవడం జరిగింది. నలభై ఏళ్ళకు పైగా గోలకొండ పత్రికలను పదిలపరిచి మాకు ఈ కార్యసాధనలో సహకరించిన ప్రతాపరెడ్డిగారి కుమారులు శ్రీయుతులు యస్. యన్. రెడ్డి, హరిశ్చంద్రారెడ్డి, విష్ణువర్ధన్ రెడ్డి, కృష్ణవర్ధన్ రెడ్డిగారికి కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాము.

హైదరాబాదు
1-6-1989

దేవులపల్లి రామానుజరావు
డా॥ ఎల్లూరి శివారెడ్డి

# విషయసూచిక

పుట.

# స్వవిషయము

(అక్షయనామ సంవత్సర నిజ చైత్ర బ॥ 13)

**10-5-1926**

అనేక విఘ్న ప్రతి బంధముల కోర్చి యెట్టకేలకు "గోలకొండ" పత్రిక నాంధ్రజనులకు సమర్పించుకొన గలిగితిమి. ఇదివఱకే విన్నవించిన రీతి నీపత్రిక యొక్క ముఖ్యోద్దేశము జనసేవయే కాని తదితర మేదియు గాదు. ఈ పత్రికా విషయమై కొన్ని సందేహములు తఱచుగా వినవచ్చుచున్నవి. వానినిందు మాచే నైనంతవరకు నివారింప బ్రయత్నించుచున్నాము.

ఈ పత్రిక వలన లాభమేమిః యని కొందరు ప్రశ్నించియున్నారు. వారెల్లప్పుడును బత్రికల జదువు వారే యైనను బత్రికల లాభము గనుగొనినట్టి వారలుగ గనుపింపరు. నేటి కాలమున నాగరికతయంతయు బత్రికలపై నాధార పడినదని యనవచ్చును. ప్రజలందుగాని, ప్రభుత్వమందుగాని, మంచిగనో చెడ్డ గనో మార్పుగలిగించునది పత్రికల యొక్క మహాశక్తియే. ప్రపంచ మందలి పత్రికా ప్రచారము కల దేశములను బోల్చి చూచిన హిందూస్థానము చాల హీన స్థితి యందున్నది ప్రస్తుతము నిజాము రాష్ట్రమందు ౬౮ లక్షల కన్న నెక్కు డాంధ్రులుండగా రెండు వార పత్రికలుంట గొప్పలోటు. ఒక చిన్న తిరువాన్కూర్ సంస్థాన మందు నూర్ల కొలది నానా విధ పత్రికలుండ హైదరాబాదులోని యాంధ్రులకై మూడవ పత్రిక యొకటి ప్రచారము చేసినందులకు మేము చింతింపము.

ఈ పత్రిక "రెడ్ల" కొఱకేర్పడినదని కొందరు శంకించి యున్నారు. రెడ్ల యొక్క అభివృద్ధిని గోరుచుండునదైన నితర శాఖల వారికి బ్రతికూలముగా నెప్పటికి నుండదని యందఱకును విశదపఱచుచున్నాము.

మేము హిందువులందే యన నేల మతాంతరావలంబకులందును భేదమే మాత్రమును జేయువారము కాము. ముఖ్యముగా నాంధ్రులలో సగ బస్సీలను

వారిని మొదలుకొని యంత్య జన్మలను వారి వఱకును మేము సేవజేయ యత్నింపలము. ఇందులకై యందఱును దోడ్పడుదురు గాక.

ఈ పత్రిక చందా విశేషమేమో యని కొందఱు మిత్రులు మందలించిరి. బ్రిటిషు ప్రాంత మందలి యొకటి రెండు వార పత్రికలు తప్ప తక్కిన యన్ని పత్రికల కన్న దీని చందా తక్కువయని చెప్పగలము. అయిన నిది ప్రథమ ప్రయత్నమగుటచే నింతకన్న టక్కువ చేయజాలము. చందాదారులు విశేష సంఖ్యాకులై పత్రికకు - లాభమటుండనిండు - నష్టము రానిచో ముందు సంవత్సరము చందా తగ్గింప దలచియున్నాము.

నిజాము రాష్ట్ర మందలి జనులే యననేల మన దేశమందలి యితర ప్రదేశము లందలి వారును ముఖ్యముగా వ్యవసాయముపై నాధారపడినవారు. ఈ పత్రిక యట్టి జనులకు జేతనైనంత వఱకు వ్యవసాయ సంబంధములగు వ్యాసములను వ్రాసియు వ్రాయించియు ప్రోత్సహించుచుండును. పరపతి సంఘములు (Co-Operative Society) వ్యవసాయకుల కెంతయో లాభకరములైనవి. వాని యుపకారములను జనులు సరిగా గ్రహించిన వారుకారు. ఏతద్విషమై తరచుగా మా పత్రిక యందు వ్రాయుచుందుము. ఈ పత్రిక హైద్రాబాదు రాష్ట్రములో విశేష ప్రచార మందుండగలదు. కావున తక్కువ సమాచారములను దెలుపుచు, బ్రత్యేకముగా నీ రాష్ట్రపు వార్తల బ్రకటించుచుందుము.

ఇదిగాక విద్యాభివృద్ధిని గుఱించియు, సంఘాభివృద్ధిని గుఱించియు దగు రీతుల బ్రయత్నించుచుందుము.

పై యంశములతో బాటు భాషాభివృద్ధికరములగు వాఙ్మయసేవయు చేయు చుందుము.

ఈ పత్రిక యింతవఱకే ప్రచురింపబడి యుండవలసినది. కాని మా స్వాధీనమునలేని యనేకాంతరాయములచే మే మాలసింపవలసి వచ్చెను. ఆంధ్ర లోకము మమ్ము క్షమింతురని ప్రార్థన.

ఈ పత్రిక నిర్విఘ్నముగా దన విధిని నెరవేర్చుట యందు, దైవము, ప్రభుత్వము, ప్రజ, మాకు దోడ్పడుగాతయని ప్రార్థించుచున్నాము.

---

# విజ్ఞాపన

**10-5-1926**

రెసిడెన్సీ హద్దులలో నున్న మా ముద్రణాలయము నుండి పత్రికను ప్రకటించుటకనుమతి యొసంగ బడక పోవుటచే, నిజాం ప్రభుత్వము వారి హద్దులలోనికి, ముద్రణా యంత్రమును మార్చవలసి వచ్చుట చేతను, పోస్టలు శాఖ వారనుమతి నిచ్చుటలో నాలసించుట చేతను, మేము, తొలుదొల్త ప్రకటించిన రీతిని పత్రిక నందజేయ జాలమైతిమి లేకుండిన పత్రిక యొక్క మాసము క్రిందటనే వెలువడి యుండెడిది.

రాబోవు పత్రిక వైశాఖ శు॥ 5 స్థిరవారమున వెలువడును. తదనంతరము క్రమముగ, ప్రతి బుధవారమునను శనివారమునను పత్రికలు ప్రకటింపబడును.

——

# కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారు

**14-7-1926**

గడచిన 12 జూలైతో విఖ్యాత గ్రంథ కర్తలును, సంస్కర్తలును, నిష్కలంక దేశాభిమానులునునగు శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు స్మరణీయులై మూడువత్సరములు గడచినవి. నవీనాంధ్ర వాఙ్మయ పితామహులగు రావు బహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారి తరువాత, ఆధునిక వాఙ్మయమును పెంపొందించిన వారిలో శ్రీ లక్ష్మణరావుగారు అగ్రగణ్యులని చెప్పినచో అందతిశయోక్తి యుండదని మా తలంపు. విశ్వ విద్యాలయము నందు ఎం. ఏ. పరీక్ష యందుత్తీర్ణులై, ఆంధ్ర, సంస్కృత, వంగ, హిందీ, మహారాష్ట్రాది భాషల యందు నిరుపమాన పాండితీ వైభవమును గడించిన ఈ ఆంధ్ర సత్పుత్రుడు తన విజ్ఞానము నంతను ఆంధ్ర భాషామతల్లి సేవయందు వినియోగించి ఎడతెగని పట్టుదలతో, విసువు నెరుంగని యుత్సాహముతో, నిర్మల వర్తనముతో ఆదర్శప్రాయమగు జీవనము గడపిన ఈ మహాశయుని దేశీయులు విస్మరింపగూడదు.

శ్రీ లక్ష్మణరావుగారి సారస్వతసేవవారు విద్యార్థి దశయందు నివసించుచుండిన నాగపురము నందారంభమయ్యెను. మోరోపంత్ కృతమగు మహారాష్ట్ర కర్ణపర్వమునకు విద్వజ్జన సమాదరణీయమగు వ్యాఖ్యానము రచించిరి. "రామాయణీయమగు పంచవటి భద్రాచలము కడనున్నదా, నాసికవద్దనున్నదా" యను విషయమున మహారాష్ట్ర పండితులలో భేదాభిప్రాయములు కలిగి తీవ్రముగా వాదోపవాదములు జరుగుచున్న కాలమున, అట్టి వాదములందు ఉత్సాహముతో పాలుగొని భద్రాచలము వద్ద పంచవటియే రామాయణీయ పంచవటియని లోకమాన్య బాలగంగాధర తిలకు వంటి పండితవర్యులచే నొప్పించిరి. విజ్ఞానప్రదములగు అనేక మహద్విషయములను, "కావ్యమాల" యందు ప్రకటించి, నేటివరకు ఏ యాంధ్రునకును మహారాష్ట్రమున లభింపని యుత్తమ పదవిని

ఆ భాషయందు సంపాదింపగలిగిరి. ఈ కాలముననే వీరు రచించిన ప్రథమ ఆంధ్ర గ్రంథము "శివాజీ చరిత్రము" వెలువడెను.

తరువాత శ్రీ లక్ష్మణరావు గారి కార్యరంగము ఆంధ్రదేశమునకు మారెను. విఖ్యాతాంధ్ర భాషా పోషకులగు శ్రీ మునగాల సంస్థానాధీశుల దివాను గారు నియోజితులైరి. ఈ యుద్యోగము తరువాతి వాఙ్మయ సేవకు మంచి పునాది ఏర్పరచెను. తుదివరకు వారీ యుద్యోగముననే యుండిరి. దివాను కర్తవ్యములను వారు శ్రద్ధగా నిర్వహించ లేదనినచో అది యపరాధమగును; కాని మాకు వారితో గల పరిచయమును, వారి అనుదిన జీవితమును గూర్చిన యనుభవమును బట్టి చెప్పవలసినచో ప్రభువుగారు వీరితో మంత్రిత్వ కార్యముల నే సమయమున నిర్వర్తింపించు కొనుచుండిరో తెలియదు గాని, వీరు ఎప్పుడు వాఙ్మయ విషయిక కార్యములందు నిమగ్నులైయుండిరని చెప్పగలము. 1909 వత్సరమున విజ్ఞాన చంద్రికా గ్రంథమాల నారంభించి వివిధ శాస్త్రీయ చారిత్రిక వాఙ్మయామృత ధారలచే ఆంధ్రదేశీయులు హృదయ క్షేత్రములను ఫలవంతములుగ నొనర్చిరి. 1911 ప్రాంతమున వాఙ్మయ సేవా విషయికమగు ప్రచండమైన తుది ప్రయత్నము, అనగా "విజ్ఞాన సర్వస్వ" నిర్వహణము నారంభించి నిధనము నాటివారకు ఆ కార్యమును నిర్వహించి, "అ" భాగమును సుమారు 2000 పుటలలో మూడు సంపుటములుగా పూర్తి చేసి దేశీయుల కర్పించిరి. నాల్గవదగు "ఆంధ్ర సంపుటము" నకు పరికరముల కూర్చుచు, పరిశోధనము సల్పుచు," చాళుక్యులు దాక్షిణాత్యులే" యను వ్యాసమును వ్రాసి ముగించుచు ఆనాడే రాత్రి వేళ చెన్నపట్టణమున మరణించిరి.

ఈ మహాశయుని మహా సులభమును రసవంతమును నగు శైలియు ఎంతటి గహన విషయమునైనను కడు సుబోధముగా తెలియజేయు సామర్థ్యమును, దేశాభిమానాగ్నిని ప్రజ్వలింపజేయు మేధా విద్యుత్తును తలంచిన ఆశ్చర్యము కలుగకమానదు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వములోని వ్యాసములననేకులు కలిసి వ్రాసిరని చెప్పవచ్చును. కాని ముఖ్యములగు, వ్యాసములన్నియు వీరివే. "విజ్ఞాన చంద్రిక" లోని "హిందూ మహాయుగము" 'మహమ్మదీయ మహాయుగము' అను గ్రంథములను కళాశాల తరగతుల కుపన్యసించు ఆంగ్ల భాషా పండితులు ఎంతయో యుపయోగించు కొందురని చెప్పిన వాని యోగ్యత

ప్రకటితమగును. "స్మైల్సు" వ్రాసిన 'క్యారెక్టరు' లోని యొక యధ్యాయమును మాత్రము 'సద్వర్తనము' అను పేరుతో రచించి యుండిరి. మిల్లు, స్పెన్సరు, లబక్, మొదలగు ఆంగ్ల మహాశయుల గ్రంథ రాజముల చవిని ఇంగ్లీషు రాని ఆంధ్ర సోదరులకు జూపవలయునని వీరెంతో ముచ్చట పడుచుండిరి! కాని దేశ దురదృష్టము అందున కాటంకము కలిగించెను.

హైదరాబాదులో 1 సెప్టెంబరు 1901 నాడు శ్రీకృష్ణదేరాయల ఆంధ్ర భాషా నిలయమును స్థాపించి, ఆంధ్ర భాషా విషయమున అంధకార బంధురముగా నుండిన ఈ ప్రాంతమున విజ్ఞాన జ్యోతిని వెలిగించిన మహాశయులలో శ్రీ లక్ష్మణరావుగారు ముఖ్యులు. నాల్గువత్సరముల క్రింద ఆంధ్ర జన సంఘము వారు 'పరిశోధక శాఖ'ను స్థాపించినప్పుడు వీరు ఉపసంఘము సభ్యత్వము నంగీకరించి, దివ్యములైన యాలోచనల దెల్పి, ఎంతో ప్రోత్సహించియుండిరి. చరిత్రాంశములకు నిజాం రాష్ట్రము గని యనియు, బ్రిటిషు ఆంధ్రులు ఈ ప్రాంతములను "అండమాను ద్వీపముల" వలె జూచుచుండుట తగదనియు, సోదరుల నందరను ఇచ్చట పరిశోధనము గావింప ప్రోత్సహించిరి. ఇట్టి నిష్కళంక సేవాపరాయణుని సర్వదా స్మరించి వారి యాదర్శమును ముందిడుకొనుట ధర్మమని దేశీయుల హెచ్చరించు చున్నాము.

———

# లోకమాన్యుడు

**4-8-1926**

ఆధునిక కాలమున భారత వర్ష రంగమున నద్వితీయ విఖ్యాతితో తన పాత్రమును ప్రదర్శించిన మహా పురుషులలో లోకమాన్య బాలగంగాధర తిలక్‌ను మించిన వారు వేరొకరు లేరని చెప్పినచో అందతిశయోక్తి యుండదు. గడచిన 1 ఆగస్టు నాటితో నీ భారత పుత్ర రత్నము కీర్తిశేషుడై 6 సంవత్సరములు గడచినవి. ఆనాడు వివేకవర్ధనీ నాటకశాలయందు లోకమాన్యుని స్మరణార్థము జరుపబడిన సభా వృత్తాంతములు వేరొకచో ముద్రితములై యున్నవి.

లోకమాన్యుడు 23 జూలై 1856 నాడు బొంబాయి ప్రాంతము నందలి రత్నగిరి యందు సాధారణ కుటుంబమున జన్మించెను. 1872 లో ప్రవేశ పరీక్ష యందును, 1876 లో పట్ట పరీక్ష యందును మహా గౌరవ ప్రదముగ నుత్తీర్ణుడయ్యెను. తానభ్యసించిన న్యాయశాస్త్ర జ్ఞానమును జీవనోపాధికై వినియోగింపక, బీదతనమునే శరణ్యముగ గొని, దేశ కార్యములందు ప్రవేశించెను. జీవిత కాలమున నీ మహానుభావుడు, ఉపాధ్యాయుడుగను, గ్రంథకర్తగను, పత్రికా లేఖకుడుగను, ప్రజా నాయకుడుగను, దేశసేవ సల్పి జరామరణము లేని కీర్తి గడించెను. తలపెట్టిన ప్రతి కార్యమునందును చలింపని పట్టుదల, మొక్కవోని ధైర్యము, స్వార్థ రాహిత్యతయు, యాథార్థ్యవాచిత్వము ఆ యనఘుని యందు వ్యక్తములగుచుండెను. ఉపాధ్యాయుడుగా పనిచేసి శిష్యులందు విజ్ఞానముతో పాటు దేశాభిమానాగ్నిని రగుల్కొల్పి "నవీన మహారాష్ట్ర దేశము"ను దానిని సృష్టించెను. "వేదములందలి మన ఉత్తర ధృవ నివాసము" (Our Arctic Home in the Vedas)ను, "మృగ శిర" (Orion)ను రచించి స్వదేశీయుల వలన ప్రశంసనందుటే కాక యూరపు అమెరికా ఖండములందలి దిగ్దంతులగు పరిశోధకులను తన నవీన సిద్ధాంతములచేత ఆశ్చర్య

సాగరమున ముంచివైచెను. కారాగారమునందు రెండవమారు వసించినకాలమున రచింపబడిన "గీతా రహస్య" మను ప్రచండ వైజ్ఞానిక గ్రంథము ఆంగ్ల, ఆంధ్ర, హిందీ, ఘూర్జరాది వివిధ భాషలందు అనువాదితమై భారత వర్షీయుల కును, పరదేశీయులకును ఉత్తమ మార్గమును బోధించి నిరుపమాన యశమును గడించెను. "కేసరి", "మరాటా" యను రెండు పత్రికలను నడపి, ఏ వార పత్రికకును మన దేశమున నేటివరకు లభించి యుండని వ్యాప్తిని కలిగించెను.

నాయకుడుగా రాజ్యాంగ క్షేత్రమున చేసిన కార్యములు ఆ బాల గోపాలము విదితములని చెప్పవచ్చును. రాజ్యాంగమునందు లోకమాన్యునకుండిన జనవశీకరణము మరే నాయకునకు నుండలేదనియు, ఆయన అనుచరుల సంఖ్య కోట్ల పరిమితి కలిగియుండెననియు తెలియుచున్నది. మొదటిసారి 1892 లో 12 మాసములును రెండవ మారు 1908 నుండి 1914 వరకు 6 సంవత్సర ములును కర్మవశమున కారాగార శిక్ష ననుభవించి దేశీయులవలన నెక్కువ ప్రశంసను బొందెను. ఈ కర్మయోగి కారాగార జీవితమును ఉత్తమ గ్రంథ రచనము నందును, పఠనము నందును వినియోగించి "సుఖ దుఃఖౌ సమేకృత్వా, లాభాలాభౌజయాజయౌ" యను గీతా వాక్యమును సార్థక పరచెను. రెండవ మారు చెరసాల నుండి వచ్చిన తర్వాత ద్విగుణీకృతోత్సాహుడై, దేశీయ మహా సభయందు హిందూ మహమ్మదీయైక్యతకై, లక్నో నగరమున పాటుబడి కృతార్థుడై, ఆ సంస్థకు బలము చేకూర్చెను. హోం రూలు డిప్యుటేషన్ సందర్భ మున ఆంగ్ల దేశమునకు జని రాజ్యాంగ సంస్కారములకై యత్నించియుండెను. ఇట్టి యాదర్శ ప్రాయమగు సేవ యొనర్చి తుదకు బొంబాయి నగరమున 31 జూలై 1920 నాడు 65 సంవత్సరముల ప్రాయమునందు భౌతిక దేహమును వదలి కీర్తికాయుడయ్యెను.

లోకమాన్యుని వర్తనము నందు ఎల్లప్పుడును ప్రస్ఫుటమగుచుండు యథార్థ వాదిత్వమున కొక తార్కాణము చూపెదను. 1918వ సంవత్సరమున ఇంగ్లాండునకు బోవుచు చెన్న పట్టణమున నుండిన దినములలో ఆంధ్రుల వలన సమర్పింపబడిన సన్మాన పత్రమునకు ప్రత్యుత్తర మొసగుచు ఇట్లు ప్రస్తా

వించెను. "నేను నేడు ఆంధ్రులను మహారాష్ట్రులను ఏకముగా దలచుచున్నాను. కారణ మేమనగా మహారాష్ట్ర రాజ్యాంగ ధురీణులు అవలంబించిన రాజ్యాంగ సంస్కారము లన్నియు, విజయనగర సామ్రాజ్యమును పాలించుచుండిన ఆంధ్ర రాజులు చూపినవే. ఇందు వలననే మహారాష్ట్రులమగు మేము ఒక విధముగ ఆంధ్రులకు కృతజ్ఞులమై యుండవలసిన వారము. శ్రీ శివాజీ మహారాజును, ఆయన తరువాత మహారాష్ట్ర రాజ్యమును నడిపిన వారును విజయనగర సామ్రాజ్య రాజనీతి సూత్రములనే యనుకరించిరి. ఈ విధముగా నీ రెండు శాఖల వారికి కలిగిన సంబంధము నేటి వరకును స్థిరముగా నున్నది." ఈ విషయము చారిత్రికమే యైనను ఇంత విస్పష్టముగా నొప్పుకొనువారు మహా నాయకులలో సైతము అరుదని చెప్పవచ్చును.

లోకమాన్యుని పరహితాచరణమును, ఉత్తమ వర్తనమును, మనకు మార్గ దర్శకముగ నుండుగాక!



# విద్యా విధానము

## 28-8-1926

క్రిందటి వారము, విద్యా విధాన విషయమున సుప్రసిద్ధ మహాశయు లిద్దఱు తమ తమ యభిప్రాయముల వెల్లడించినారు. వీరు మద్రాసు విద్యాశాఖ మంత్రిగారు సర్. పరశురామ పాత్రో గారును, విఖ్యాత గ్రంథ కర్తలును పండితులునగు డాక్టర్ బ్రజేంద్రనాథశీల్‌గారును. పాత్రోగారు చెన్న పట్టణ మందును, సీల్‌గారు బొంబాయి నగరమందును, పట్టభద్రులకు పట్ట ప్రధాన మొనర్చునపుడిచ్చిన ఉపన్యాసములలో మఱుగుపఱచక వెలిబుచ్చిన యభిప్రాయము లెంతయు గంభీరములును, ప్రశంసార్హములునై యున్నవి. ఇవి విద్యా విధాయ కులు, బాలురు, ఉపాధ్యాయులు గమనింపదగినవి. విద్య యొక్క లక్ష్యము బుద్ధి వికాసమని పాత్రోగారు నుడివియున్నారు. ఇది యెల్లరు ముఖ్యముగా మనసునందుంచకొన వలసిన విషయము. కేవలము జీవనోపాధి గల్పించుట విద్య యొక్క పరమావధిగాదు. విద్య విజ్ఞానము కొఱకు గాని, ధనార్జము కొఱకు గాదు. దీనిని విద్యార్థులందఱు గమనించి విద్య యొక్క విలువను రూపాయలణాల దమ్మిడీలతో లెక్కింప కుందురు గాక.

అటుపైని, యెట్టిది కళాశాలయను విషయమున పాత్రోగారి యభిప్రాయ మెంతయు మాననీయము. జాతీయ జీవనమునకు వికాసమును, ప్రోత్సాహము నొసగునదియే కళాశాల. ఇట్టి ఉన్నతాదర్శమును నాచరణలోనికి దెచ్చునంతవఱకే కళాశాల గౌరవనీయము. విశ్వవిద్యాలయములు భావి పౌరుల కాటపట్టువులు. జాతీయభావము, సేవాశక్తి యీ విద్యాలయములందే పెరుగవలయును. కాని ప్రస్తుతము విద్యాలయముల స్థితి యెంతయు విచారకరము. ఈ యున్నతాశయా లన్నిటికిని వ్యతి రిక్తముగ కార్యక్రమములు జరుగుచున్నది. ఈ విద్యాలయ ములు విద్యార్థుల మానసిక సృష్టి శక్తి యభివృద్ధి జెందుటకు మారుగ నడుగంటు చున్నది. త్యాగము, ప్రజ్ఞాతిశయము, స్వాతంత్ర్యమును ప్రోత్సాహించుటకు

మారుగా స్వార్థ పరాయణత్వము, సంకుచిత స్వభావము, పరాధీనత పెంపొందించు చున్నవి. శైశవ దశలో నున్న ఆంధ్ర విశ్వ విద్యాలయ మీ కొఱతల సరకు గొని, సంస్కరించి స్వధర్మ నిర్వహణమునకును, ఆత్మోపలబ్ధికిని ననుకూలించు నిజమగు విద్య నొసగి జాత్యభ్యుదయమునకు పాటు పడునని నమ్ముచున్నాము.

విద్యా విధానముగూర్చి సర్ బ్రజేంద్ర నాథ్ సీల్‌గారి సూచన లెంతయు మాననీయములు. ప్రాచ్య పాశ్చాత్య విద్యా వికాసముల మేళగించి, బాలురకు శిక్ష నొసగుట ఇప్పుడు మన సమస్యయై యున్నది. బ్రహ్మచర్యము,గురుకులము మొదలగు విధానముల కాలము పోయినది. అయినను ఆ విధానములోని గూఢమై యున్న భావములను, ఆశయములను మనము విసర్జింపరాదు. వానిని గొని, మన భిన్న పరిస్థితుల కన్వయించి, సానుకూలముగా, శుభప్రదముగా మన విద్యా విధానము నెఱపవలెను. ఈ సందర్భమున సీలుగారొక నూతన విషయమును సూచించియున్నారు. విద్యావిధానము వృత్తికిని స్థానిక పరిస్థితుల కనుగుణ్యముగా నుండునటుల నుండవలెనని వారి సలహా. దీని గూర్చి యెల్లరు నాలోచించుట యెంతయు నవసరము. ప్రత్యేక కళలకును, పరిశ్రమలకు ప్రత్యేక సదుపాయము లుండును. ఆ ప్రాంతపు బాలుర కా ప్రాంతపు కళలను గాని, నేర్చుకొనుట సులభముగా నుండును. మఱియు నా కళలు గాని పరిశ్రమలుగాని వృద్ధియగుట కెక్కువ యవకాశముకూడ నుండును. ఈ యంశమును విద్యాభివృద్ధియందును తద్వ్యాప్తియందు నభిమానులందఱు నాలోచింతురు గాక!

---

# వ్యవసాయ విచారణ సంఘము

## 13-10-1926

ఈ సంఘము తాలుకు ముగ్గురు సభ్యులును, అధ్యక్షుడగు లిన్లిత్గో ప్రభువును శనివారము నాడు బొంబాయిలో నోడదిగిరి. వారచ్చటి నుండి తిన్నగా సిమ్లాకు బోయి, తదితర సభ్యులతో గూడి కార్యమున కుపక్రమింతురు. వ్యవసాయాభివృద్ధి, పశుసంపద, పశుచికిత్స, క్రొత్త పంటలు నూతన వ్యవసాయ పద్ధతులు, వీనిగూర్చి ప్రస్తుతము ప్రభుత్వము వారెట్టి చర్యను గొనుచున్నారు? ప్రస్తుతము యాన సౌకర్యములెవ్వి? ఫలసాయ మే విధముగ నమ్మబడుచున్నది? వ్యవసాయపనుల కే విధమున ధనసహాయము జరుగుచున్నది? ఋణములకెట్టి యవకాశములుగలవు? కృషికుల క్షేమముతో సంబంధము గలిగిన ముఖ్యాంశము లెవ్వి? ఈ విషయముల గూర్చి యీ సంఘము వారు శోధన సలుపవలెను. కాని యీ శోధనాంశములలో నొక ముఖ్యమైన విషయమును విడిచివేసి యున్నారు. అది ప్రస్తుతపు కౌలు పద్ధతులు గూర్చిన చర్చ. కృషికుల స్థితిగతులు ముఖ్యముగా వీనిపై నాధారపడి యుండును. వ్యవసాయాభివృద్ధికిగల యవకాశములన్నియు వీని నాశ్రయించి యుండును. ఒక ఉదాహరణము దీనిని విశదపరచగలదు. ప్రస్తుతము బంగాళాదేశమున జమీందారీ పద్ధతి అమలులో నున్నది. దీనివలన వాస్తముగా భూమిని దున్నుచున్న రయితాభూమికి స్వామి కాజాలడు మరి ఫలసాయములో కొంత భాగమును రయితు నుండి గొని, దానిలో నుండి సర్కారు వారికి సిస్తు చెల్లించి, మిగిలినది తాననుభవించుచు, జీవించుచున్న జమీందారుడా భూమికి యజమాని. ఇట్లు భూమి దున్నువాడు భూస్వామికాడు. భూస్వామి రయితు భూమికి స్వతంత్రాధికారి కాడు. ఈ ద్వంద్వ స్వామ్యమువలన యనేక అనర్థములు మూడుచున్నవి. భూస్వామి యెక్కువ ఆదాయము వచ్చుననెడి యాశచే తన భూమిని యనేక రయితులకు పంచి యిచ్చును. దీనివలన భూమి యనేక క్షుద్ర భాగములుగా విభజింపబడి, వ్యవసాయములో అభివృద్ధి మార్గముల ప్రవేశపెట్టుటకు వీలులేక పోవుచున్నది.

రయితునకు జెందవలసిన ధనము భూస్వామికిని, తదితర మధ్య వర్తులకును జెందుచున్నది. సగటున బంగాళమున నొక్కొక్క జమీందారునకు రూ. 8 స్వామి భోగము వచ్చును. ఏను దీని నుండి 10 అణాలు మాత్రమే సర్కారు వారికి సిస్తు కట్టి మిగిలిన రూ. 1-6-0 తామనుభవించుచున్నారు. వ్యవసాయ మున నెట్టి పాలునుగొనక, హాయిగా పట్టణములలో గూర్చుండి, వీరి ధనము ననుభవించుచున్నారు. ఎండలో మాడి వానలో తడిసి, రేయింబవలు పొలములో బనిచేసిన కర్షకులకు నిజముగా నీ ధనము చేరవలసియున్నది. ఈ ధన సాహాయ్యమున వారు సేద్యము నెంతయో అభివృద్ధి పరచియుందురు. కాని యిప్పుడా ధనము సోమరులకు జెంది వృధావ్యయముం పాల్పడుచున్నది. ఇట్టి ముఖ్యమైన కౌలు సమస్యను వ్యవసాయ కమిషను వారు సంశోధింపకుండు టెంతయు విచారకరము.

ప్రస్తుతము రయితులను పీల్చి పిప్పిచేయుచున్న పిశాచము ఘోరమైన ఋణ బాధ. భూమి ప్రస్తుతము యతి స్వల్పమగుట చేతను, తగు నీటి లేక పోవుట చేతనే, తదితర కారణముల చేతను రయితునకు సుఖజీవనోపాధిని కలిగించుటలేదు. గృహ పరిశ్రమలు నశించుటచే వేరు ఆదాయము లేదు. కోళ్ళను, పందులను, గొఱ్ఱెలను బెంచి వ్యాపారము చేయుట మనలో వాడుక కాదు. కాన సిస్తు కట్టుటకుగాని, పశువుల కొనుటకుగాని వివాహ శ్రాద్ధములకు గాని, సొమ్ము కావలసినప్పుడు మన బీద రయితు సాహుకారి వద్దకు బోయి ఋణమును దేవలసి వచ్చుచున్నది. ఈ ఋణము వడ్డికి వడ్డి చొప్పున అనతి కాలములోనే పెరిగి పాపమా రయితు రాబడి నంతయు మ్రింగివేయ సిద్ధపడును. ఈ ఋణమును దీర్చుట కారయితు వేరొక ఋణము జేయును. ఇట్లు ఋణము కొఱకు ఋణము చేయుచు రయితు తన జీవిత కాలములో నెన్నటికిని ఋణ విముక్తి నొందకున్నాడు. ఈ సమస్య గూర్చి శోధన సలుపు నెడ "రయితు వివాహములు, శ్రాద్ధములు చేయునవుడు విపరీత వ్యయముల చేయరాదు. రయి తుల భార్యలు నగల యందలి యపేక్షను విడువవలెను; భూమిని స్వల్ప భాగములుగా విభజింపకూడదు; రయితు పొదుపు గలిగి జీవనయాత్ర గడుప వలెను; అప్పుడీ ఋణబాధ మాయమగును." అని యా రీతిగా నీ సంఘమువారు తమ శోధనాంతరము సూచనలు చేసిన నేమియు ప్రయోజనము లేదు. ఈ విష

యము లన్నియు నిచెవలకే మన మెరుగుదుము. వీనిని మరల వల్లించుటకు వేలకొలది రూపాయలు ఖర్చుపెట్టి ప్రత్యేకముగా నొక సంఘమును నియోగింప నవసరములేదు. ఋణము చేయుట మోసమని యెల్లఱును విశదమే. కాని విధిలేక రయితులప్పుల పాల్పడినారు, పడుచున్నారు. ఋణస్తులను ఋణ విముక్తుల జేయుటెట్లు? ఋణము చేయబోవు వారిని దాని నుండి మరల్చుటెట్లు? ఈ యంశముల గూర్చి యీ విచారణ సంఘము వారు మార్గముల జూపిన దేశీయులు కృతజ్ఞులయ్యెదరు.

ప్రస్తుతము వ్యవసాయశాఖవారు చేయుచున్న ప్రయత్నములలోను, అవలబించు పద్ధతులలోను, గొన్ని నిష్ఫలములును, నిష్ప్రయోజనములునునై యున్నవి. వీరు సలుపుచున్న శోధనలు విద్యకును, విజ్ఞానమునకును సంబంధించిన వగుచున్నవిగాని, ప్రకృతపు కర్షకుల వ్యవసాయ చిక్కులను పరిష్కరించుటలేదు. అమెరికాలో కృషికులు స్వయముగ వచ్చి, పంటలు పండించునపుడు తమకు గలుగుచున్న చిక్కుల నెల్లను వ్యవసాయ శోధకుల కెఱింగించెదరు. అటుపైని, యా సమస్యల గూర్చి పరిశోధన సంఘము వారు శోధన జేయుదురు. కాని మన దేశమున రైతునకును శోధన సంఘమునకును ఇట్టి సన్నిహిత సంబంధము లేదు. పరిశోధకులు తమకు దోచిన నేదియో నొక విషయము గూర్చి శోధన ప్రారంభింతురు. సంవత్సరములకొలది ప్రయత్నించి యేదియో నొక దానిని కనిపెట్టుదురు. కాని యది కేవలము వైజ్ఞానికముగ నుపయోగపడుచున్నది గాని, ప్రకృతపు సేద్యమునకు కక్కఱకు వచ్చుటలేదు. నారవిషయములలో నిపుణుడగు ఫిన్లో దొరగారెన్నియో సంవత్సరములు ప్రయాసపడి జనప నారను వేరు విధమున దీయుట కొక యంత్రమును కనిపెట్టిరి. కాని ఈ యంత్రము గూర్చి యే సేద్యగాడును శ్రద్ధ గొనలేదు. జనపనారదీయుట కిది వఱకొక సుగమమగు మార్గముండనే యున్నది. అందుచే యీ యంత్రము వారి కావశ్యము కాదు. వారి ముఖ్యావశ్యములు వేరు. వాని గూర్చి నూతనాంశముల వారికి దెలిపిన వారు శ్రద్ధ వహింతురు. కాని వానికి బదులీ క్రొత్త యంత్రము వారి కొసగిన వారు దానిని నిరసించుటలో నెట్టి వింతయు లేదు కదా! ఇట్టి దిక మీదట జరుగకుండునటులను, ప్రకృతపు సేద్యములోని సమస్యలను స్వంతముగగాని, వ్యవసాయకుల నడిగిగాని, దెలసికొని మఱి శోధనకు గడంగు

నటులను, ఈ సంఘమువా రేర్పాటు చేసినయెంతయు మేలు కలుగును. వ్యవసాయ శాఖకును, రయితులకును దగ్గఱ సంబంధమున్నగాని వ్యవసాయ మభివృద్ధి చెందును.

ఈ సంఘము వారింకొక విషయమును తమ దృష్టి యందుంచు కొనవలెను. ప్రస్తుతము వ్యవసాయములో గమనింపబడుచున్న మన దేశీయ వాడకులను వారు గ్రహింపవలసియున్నది. మన దేశములో వ్యవసాయము నిన్న మొన్న నేర్చుకొనిన పరిశ్రమకాదు. అనేక వేల సంవత్సరముల నుండి నానాటికి వికాసము గాంచుచు వచ్చిన కళ. కాని మన పద్ధతులలో ననేక మహత్తరమైన వైజ్ఞానిక విషయములు నిగూఢమై యున్నవి. ఈ యంశమును ప్రస్తుత మనేక పాశ్చాత్య వ్యవసాయ శాస్త్రజ్ఞులు కూడ నంగీకరించి యున్నారు. కాన విచారణ సంఘము వారు మన పద్ధతులను తేలికగా నొక మూల ద్రోసివేయక, వానిని బూర్తిగ లెక్కగొని తగు మార్పుల సూచించవలెను. అట్లయినగాని వీరి సూచనలకు తగు విలువగాని ఫలముగాని యుండదు. ఈ విషయమున వివిధ రాష్ట్రీయ వ్యవసాయశాఖ మంత్రు లీ సంఘము వారికి దోడ్పడ గలరని నమ్ముచున్నాము.

---

# వ్యవసాయ సమస్యలు

**15-12-1926**

వంగ రాష్ట్రములో నొక కలెక్టరుగానున్న ఖాన్ బహద్దరు మోమెన్ అనువారు వ్యవసాయపు కమిటీవారి యెదుట వ్యవసాయ విషయమై యిట్లుచెప్పిరి. "వ్యవసాయ శాఖలో వ్యయము చాల యగుచున్నది. గొప్ప వేతనములు కల యుద్యోగులే పెక్కురున్నారు. అటుకాక జిల్లా యుద్యోగులును ప్రదర్శకులును (Demonstrators) విశేషముగా నుండవలయును. సర్కారీ వ్యవసాయశాఖ జనులలో నాదరణము నొందినది కాదు. అనేక రైతులు సర్కారు ద్రవ్యము వ్యర్థముగా వ్యయమైనదని నమ్ముచున్నారు. అధికారులూరకే తిరుగుటే (సఫర్ చేయుట) కాని యే యుపయోగ కార్యముల చేయలేదని తలచుచున్నారు. పెద్ద యధికారులు రైతులను కలియుట లేదు?

ఇంతవరకును విద్యావంతులైన వారును, పరదేశీయులును, హిందూస్థానపు రైతునకు క్రొత్త సంగతులు తలకెక్కవనియు, చెప్పిన గ్రహింపరనియు నొక యపవాదము కల్పించియుండిరి. కాని వారింతచేసిన ప్రయత్నములేమి? పైవారి వాఙ్మాలము వలన వ్యవసాయశాఖ రైతునకర్థము కానిదిగా నున్న దనియు, వ్యవసాయాధికారులెట్టివారో రైతెన్నడును చూడలేదనియు విశదమయ్యో కదా! ఇక ముందైనను ప్రభుత్వమువారేకాక విద్యాధికుడైన ప్రతివాడును బీద రైతుపై కొంచెము శ్రద్ధ బూనవలయును. సర్కారువారి కందరికన్న నెక్కువ యాదాయము కలిగించు వారీ రైతులే. కొంచ మించుమించుగా సర్కారుకు లాభము కలిగించు విషయములో వీరికి తులదూగువారు త్రాగుబోతులు.

ఇతర శాఖలపై, ఇతర విద్యలపై ఖర్చుపెట్టిన దానికన్న రైతులకు కావలసిన వ్యవసాయ విద్యపైనను, వ్యవసాయ శాఖపై నెంత వ్యయము చేసినను లోపములేదు. రైతులు విద్యాలోపముచేతను, తిన తిండిలేక దారిద్ర్యము

చేతను, దినదినము క్షీణించుచున్నారని ఆచార్య రాయిగారు తమ యభిప్రాయముగా కమిటీవారితో తెలిపెను. మరియు "పై రాయిగారు మొన్న మద్రాసులో నుపన్యసించుచు నొక్క ఇంగ్లీషుదొర భోజనము చేయు విలువగల పదార్థమును మన యంబలి త్రాగు రైతులు 40 మంది తినుచున్నారని యుదాహరించిరి. మరియు కొందరు తమ సాక్ష్యములో రైతులు దినదినము బాకీం పాలై క్షీణదశనొందుచున్నా రని నివేదించిరి. భూమి గుణము క్షీణించినది. మరల దీనిని సారవంతముగా నొనర్చుకొనుటకు రైతునకుశక్తి చాలదు. ఎల్లప్పటికి నతడు సంవత్సరమంతయు నెండలో మాడి వానలో తడసి కష్టించి సంపాదించిన యా కొద్ది మొత్తమును సాహుకారి తన వడ్డీ క్రిందికే లాగుకొనుచుండగా రైతు భూములను వృద్ధిచేసి కొనకుండిన మానె, తాను జీవించుటెటులు?

కావున వ్యవసాయపు కమిటీవారు రైతులను ఋణముల పాలుకాకుండు నట్లు చేయుటయెట్లు, వారిని విద్యావంతులను చేయుట యెట్లు, వారికి వ్యవసాయ శాఖలవలన నెట్లు లాభము గలిగింప జేయవలయు నను విషయములను చర్చించి దానికి తగిన సూచనల గావించిన దేశమునకు మహోపకారము చేసిన వారగుదురు.

---

# శ్రీప్రభువుగారి జన్మదినోత్సవము

**5-1-1927**

మహా ఘనత వహించిన నిజాము ప్రభువుగారి జన్మోత్సవము రేపటి దినము రాజధాని యందును, ఇతర స్థలములందును రాజభక్తితో జరుపబడ నున్నది. నేటి నుండి మన ప్రభువుగారికి 43 వ సంవత్సరము ఆరంభమగు చున్నది. ఈ సుసందర్భమున, శ్రీ ప్రభువుగారిని, ఒక కోటి ఇరువది నాల్గు లక్షల ప్రజల పక్షమున మేము సవినయముగా నభినందించు గౌరవమును బడయుచున్నారము.

మన ప్రభువుగారు రాజ్య సింహాసన మధిష్ఠించిన నాటగోలె రాష్ట్రములో పెక్కు మార్పులు జరిగినవి. శ్రీ ప్రభువుగా రపార ప్రజ్ఞాబలయుతులు. వీరి కాలముననే యనేక ప్రసిద్ధ నిర్మాణములు జరిగెను. ఇంకను క్రొత్త క్రొత్త కట్టడములు జరుగుచున్నవి. రాజ్యాంగము నందలి విమర్శ నీయాంశముల శ్రీ నిజాము ప్రభువుగారు శ్రమయనక శ్రద్ధతో పరికించి స్వయముగా తగు నేర్పాటులు చేయుచుందురు.

మన ప్రభువుగారు రాజ్య భారమును వహించి (17) వత్సరములు కావచ్చినది. వీరి పాలనమున రాజ్యాంగమునందెన్నియో మార్పులు జరిగినవి. ముఖ్యముగ వీరి కాలముననైన విద్యాభివృద్ధియు కృతజ్ఞతా పూర్వకముగ గొని యాడదగియున్నది. ప్రారంభ విద్యయందు వ్యక్తమైన యభివృద్ధియే కాక, ఉన్నత విద్యలను రాజ భాషయగు ఉర్దూలో నేర్పుటకై శ్రీ ప్రభువుగారి వలన ఆదర్శపూర్వకముగ స్థాపింపబడిన ఉస్మానియా విశ్వవిద్యాలయము మూలమున ఎంతయో యుపయోగము కలుగుచున్నది. నాల్గు వత్సరముల నుండి విశ్వ విద్యాలయమువలన స్నాతకులుగా జేయబడిన వారి సంఖ్య నాల్గు వందలకు మించినదని చెప్పవచ్చును. ఈ విశ్వవిద్యాలయము యొక్క 8 వత్సరముల యభివృద్ధి, మద్రాసు విశ్వవిద్యాలయమునకు సంబంధించిన నిజాము కాలేజి

మున్నగు విద్యాలయముల మూలమున దాదాపు అర్ధశతాబ్దమునకైన యభివృద్ధితో సమానముగా నున్నదని పలువురు వక్కాణించుచున్నారు.

పరిపాలనము యొక్క ఇతర శాఖలందును ఎన్నియో మార్పులు జరిగెనవి. ఇవి యన్నియు ప్రజాహితము కొరకు శ్రీ ప్రభువుగారు శ్రద్ధతో నాలోచించి చేసిరి.

ప్రజా క్షేమ తత్పరులగు మన ప్రభువుగారి పక్షమున కొన్ని మాసముల క్రింద "సంస్కారములు" చేయబడునని ప్రకటింపబడినది. అట్టి సంస్కారములలో మొదటి కార్యముగా క్రొత్త యధికారులు నియమింపబడుచున్నారు. మాల్గుజారీయందు గొప్ప మార్పులు జరిగి ముఖ్యాతిముఖ్యమగు నీ శాఖ మూలమున దేశాభివృద్ధి కలుగునని మేము విశ్వసించుచున్నాము.

ఇచ్చట శాసన నిర్మాణ సభను ప్రజా ప్రాతినిధ్య పద్ధతిపైన సంస్కరించుటకు శ్రీవారు కొన్ని వత్సరముల క్రింద నాజ్ఞాపించిరి. ఈ విషయమున కావలసిన అంకెలను వివరములును సిద్ధము కూడనైనవి. గత మాసమున ప్రధానామాత్యులగు శ్రీ మహారాజా బహద్దరుగారు శాసన నిర్మాణ సభ యందు, అనధికార సభాసదులతో, సంస్కార విషయములను సానుభూతితో నాలోచింతుమని సెలవిచ్చి ప్రజలయందుత్సాహమును ప్రతిష్ఠింపజేసిరి. ఇది యంతయు మన ప్రభువుగారి ప్రజా వాత్సల్య విశేషము. శ్రీవారి జన్మోత్సవ సందర్భమున గాని ఇతర సందర్భమునగాని ముఖ్యముగా నీ సంస్కారము ప్రవేశపెట్టుట మహా శుభ ప్రదమనియు, పరిపాలనమునందు ప్రజల తోడ్పాటు నిజముగా మన రాజ్యమును దుర్భేద్యముగా నొనర్చుననియు వినయ పూర్వకముగ సూచించుచున్నాము.

శ్రీ ప్రభువుగారు ప్రజా క్షేమంకరులై చిరకాలము వర్ధిల్లుదురుగాక ! నిజాం రాష్ట్రవాసులు ప్రపంచమందలి ఏ నాగరిక రాష్ట్రవాసులకును స్వాతంత్ర్యమునందును, విద్యాధికములందును తీసిపోక స్వదేశాభ్యుదయమునకు తోడ్పడునట్లు పరమేశ్వరుడనుగ్రహించు గాక !

———

# బ్రాహ్మ సమాజము

## 26-1-1927

గత 23 జనవరి భారత వర్షము యొక్క ఆధునిక చరిత్రమున ముఖ్య దిన మనుటకు సందియము లేదు. అది కీ. శే. రాజారామ మోహనరాయల వలన బ్రాహ్మ సమాజము స్థాపింపబడిన పవిత్ర దినమగుట చేత ప్రతి భారతీయుని వలనను స్మరింపదగినదై యున్నది.

భారత వర్షము మతములకు పుట్టినిల్లు. ఏ కాలమునకు దగిన విధమున ఆ కాలమున నిచ్చట మహా పురుషులుదయించిరి. "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" యని భారతీయ విజ్ఞానఖనియగు గీతావచనము. కనుకనే ధర్మ గ్లాని కలిగినపుడు ఈశ్వరానుగ్రహమున ధర్మ సంస్థాపనము జరుగుచు వచ్చుచున్నది.

బ్రాహ్మ సమాజము 23 జనవరి 1830 సం॥ యందు స్థాపితమైనది. అప్పటి దేశ స్థితి అందు ముఖ్యముగా వంగ దేశము యొక్క స్థితి చాల దుఃఖ ప్రదముగ నుండెననుటకు సందియము లేదు. ఏకేశ్వరోపాసనమునకై ఉపనిష త్కాలముననే ఖ్యాతి వహించియుండిన మన మాతృ దేశము మూఢాచారములకు లోనై, పరిశుద్ధమగు దివ్యమూర్తిని మరచెను. సంఘముననెన్నియో దురాచార ములు ప్రబలి యుండెను. సహగమనము, శిశువులను గంగకర్పించుట, నర బలులు మున్నగునవి లెక్కకు మిక్కిలిగ నుండి అభివృద్ధికి వలయు శాంతతను దేశమున లేకుండజేసెను. జాతులలోను అంతర్జాతులలోను పలు భేదములు, అనేకములగు హెచ్చుతగ్గులు ఏర్పడి ఐకమత్యము శూన్యమగుచుండెను. హిందూ దేశమున సమావేశములైన వివిధ మతములలో ఏక భావము కుదిరి తన్మూల మున భారత జాతి యనునది యద్భవించుట అత్యవసరమగు స్థితి కలిగెను. అట్టి కాలమున, వివిధ మతములందలి విజ్ఞానము గ్రోలి, దాని హెచ్చు తగ్గుల నారసి భారత వర్షములోని యన్ని మతముల వారికి సామాన్యమును సమిష్టి దియు నగు నొక మత వేదికను నిర్మించిన గౌరవము బ్రాహ్మ సమాజమునకు చెందవలసి యున్నది. ఈ సందర్భమును పురస్కరించుకొని హైదరాబాదు బ్రాహ్మ సమాజము వారు నిన్నటి దినమున నుత్సవము సల్పిరి. ఈ సభ యొక్క వివరములు వేరొకచో గాననగును. బ్రాహ్మ సమాజము నవీన భారత జాతి యొక్క కళ్యాణమును సమకూర్చుగాక!

# ప్రత్యేకాంధ్ర రాష్ట్రము

**26-3-1927**

మదరాసు శాసన సభలో నా రాజధానిలోని ఆంధ్ర జిల్లాను ప్రత్యేక రాష్ట్రముగ నేర్పరచుటకై ప్రతిపాదింపబడిన తీర్మానము బహు జనాభిప్రాయాను సారము అంగీకారమును పొందినవార్త ఏ ప్రాంతములందుండు వారైనను సరే ఆంధ్రులగు వారందరుకును మోదావహమనుట నిశ్చయము. మదరాసు రాజధాని లోని మా యాంధ్ర సోదరులు ఎన్నియో వత్సరముల నుండి ప్రతేక్య రాష్ట్రమును వాంఛించుచుండిరి. ఎన్నియో ఆంధ్ర మహాసభలందు ఆంధ్ర మహానాయకులు ఈ మహద్విషయమును ఆమోదించిరి. కాని ప్రభుత్వము వారు దీనిని విచారింపరైరి. ఇంత కాలమునకే తీర్మానము, ప్రాంతిక శాసనసభలోనే యగుగాక, జయప్రదముగ నంగీకరింపబడుట మా ఆంధ్ర సోదరుల భావి విజయమునకు సూచకమని మేము విశ్వసించుచున్నాము.

ప్రస్తుత తీర్మానము భారత ప్రభుత్వము వారి యంగీకారమును కూడ పొంది ఆ చరణములోనికి వచ్చుచో ఆంధ్రులయొక్క ఆదర్శము కొంతవఱకు ఫలించినదని భావింపవచ్చును కాని భారత వర్షములోని యాంధ్ర ప్రాంతము మదరాసు రాజధానిలోనే కాక, కొంత మధ్య పరగణాలందును కొంత నిజాం రాష్ట్రమునందును, మరికొంత మైసూరు సంస్థానమందును కలదు. బ్రిటిషు హిందూ దేశములోని యాంధ్రదేశము కాలక్రమమున ఒక రాష్ట్రముగ ప్రభుత్వము వారివలన నేర్పరుపబడవచ్చును. కాని బ్రిటిషు ప్రభుత్వము వారి తీర్మానములు దేశీయ రాజ్యములలో మార్పు కలిగింపజాలవు. కనుక నాల్గు పాలనముల క్రింద నున్న ఆంధ్రదేశము కొంతకాలము తరువాత మూడు పాలనముల క్రిందకు రాగలదు. అంతే నిజాం రాష్ట్రాంధ్రుల స్థితిలందు ఈ తీర్మానము సంపూర్ణ విజయము గాంచిన తరువాత కూడ ఎట్టి మార్పును కలుగు నవకాశము లేకున్నను, బ్రిటిషు హిందూ దేశములోని సోదరుల వాంఛ నెరవేరినచో ఈ రాజ్యములోని యాంధ్రులును ఆనందింతురనుట నిశ్చయము.

ఈ సందర్భమున నొక విషయము మాత్రము మాకు విచారము కలిగింపక మానదు. ఆంధ్ర మహాసభలందు ముఖ్యస్థానము వహించి ప్రత్యేకాంధ్ర రాష్ట్ర తీర్మానమును బలపరచిన పలువురు మహాశయులు మొన్న శాసనసభయందు ఈ ఉపపాదనము వచ్చినప్పుడు తమ తొల్లింటి ప్రతిజ్ఞలను మరచి తీర్మానమునకు ప్రతికూలముగా ప్రసంగించిరి. అట్టివారిని పేర్కొనవలసిన యవసరము లేదు. వారిని నిందింపను బనిలేదు. ఈ యంశము మన సోదరుల చిత్త స్థైర్య రాహిత్యమును కార్య భీరుత్వమును, మాత్రము ప్రకటించుచున్నది. ఇట్టి విచారకరములగు లోపములు మనల ముందైన వదలుగాక!



# రాజ్యాంగ సంస్కరణములు

## 4-5-1927

ఆధునిక కాలమున నిజాం రాష్ట్రము నందు రాజ్యాంగ సంస్కరణములు మహా ఘనత వహించిన నిజాం ప్రభువుగారి 16 దై 1326 ఫసలినాటి ఫర్మానుతో ఆరంభమైనవని చెప్పవచ్చును. ఈ ఫర్మాను అసాధారణ (గైరు మామూలి) జరీదా మూలమున ప్రకటించబడి యుండెను. శ్రీవారి ఈ ఫర్మాను వలన గలిగిన ముఖ్యమైన మార్పు యేదనగా,అంతకు పూర్వము ఎంతోకాలము నుండి రాజ్యాంగ సూత్రములన్నియు ప్రధాన మంత్రి యందు కేంద్రీకరింపబడి యుండ నా పద్ధతి దేశాభివృద్ధికి బాగుగా నుండదని శ్రీవారు తమ ఘన బుద్ధియందు నిశ్చయించి రాజ్యపాలనమునకై యొకసభ, ''ప్రభుత్వ సభ" (బాబెహుకూమతు) అనుదాని నేర్పరచి దానికధ్యక్షునిగా విఖ్యాతులగు సర్‌అలీ ఇమాంగారిని నియోగించి సభా నియమములు, అధికారములు, అధ్యక్షుని ప్రత్యేకాధికారములు వివరముగా నిర్ణయించిరి. ఇదే ఫర్మాను చివర శ్రీవారు "మేము మా అమీరులను, అధికారులను, ప్రియ ప్రజలను ఈ క్రొత్త రాజ్యాంగ పద్ధతిని జయ ప్రదముగా జేయుదురుగాక యని కోరుచున్నాము" అనిసెలవిచ్చిరి. ఈవిధమున శ్రీవారు పరిపాలనమున తమ ప్రజలకు సంబంధము, కలిగించు మహోద్దేశమును సూత్రప్రాయముగా జూపిరి.

తరువాతి సంవత్సరముననే శ్రీవారు మరియొక ఫర్మాను ప్రభుత్వ సభాధ్యక్షుని పేర జారీచేయించిరి. ఇది ప్రజాశ్రేయములను శ్రీవారు గౌరవింపదలచి, బ్రిటిషు హిందూ దేశములోని ఉత్తమ ప్రజా ప్రాతినిధ్య పద్ధతిని మన శాసన నిర్మాణ సభయందు ప్రవేశపెట్టగోరి ప్రకటింపబడినదై యున్నది. హైద్రాబాదు శాసన నిర్మాణ సభను బ్రిటిషు హిందూ దేశము నందలి శాసన నిర్మాణ సభలకే విధముగను దీసి పోకుండ నుండునట్లు సంస్కరించుటకై అవసరమగు అంకెలను సంగతులను కూర్చి ప్రోవుచేయుటకు రాయ్ బాలముకుందుగారి యాజమాన్యమున

స్థా కార్యాలయము ఏర్పరుపబడెను. మునుపటివలెగాక ఎన్నికల పద్ధతి ఏర్పరుప వలయుననియు, (1)శాసన నిర్మాణము (2) ప్రశ్నోత్తరములు (3) తీర్మానములు (4) ఆదాయ వ్యయ నిర్ణయము మున్నగునవి శాసన నిర్మాణసభ యందు ప్రవేశపెట్టవలయు ననియు, కొలది సంఖ్యగల జాతుల హక్కుల కాపాడుటకు వలయు జాగరూకతలు నిర్ణయింపవలయు ననియు శ్రీవారి ఫర్మాను శాసించినది. దీని ప్రకారము వెంటనే కార్య స్థాన మొకటి ఏర్పడి సంవత్సరము కంటె ఎక్కువ కాలము పనిచేసి, వివిధములగు అంకెలను, సంగతులను తయారుచేసి రెండు సంపుటములచ్చు వేసి ప్రభుత్వము వారికి నివేదిక (రిపోర్టు) యుక్తముగ నర్పించిరి. సర్ అలీ ఇమాంగారు కూడ ఈ విషయమున తమ నివేదిక కూడ వ్రాసిరట. కాని పైవానిలో నేవియు ప్రకటింపబడలేదు.

కాని ఏమి కారణమో, 1334 ఫసలి వరకు పర్యవసాన మేమియు తేల లేదు. ఈ వత్సరమున మహా ఘనత వహించిన ప్రభువు గారు మరల నీ విష యమున నొక యుప సంఘమును (ముగ్గురు సదరల్‌ముహాములును దివాన్ బహద్దరు జి. కృష్ణమాచార్యులును సభా సదులుగా గల దానిని) ఏయే రాజ్యాంగ సంస్కరణము లవసరమో నిర్ణయించి నివేదిక పంపుటకు దయాపూర్వకముగా నేర్పరచిరి. ఈ సంఘము వారు తమ నివేదిక నొక మాసము దినములలోనే ప్రభువు గారి ఆజ్ఞానుసారము ప్రభుత్వ సభ కంపిరి. ఇది జరిగియు నేటికి రెండు వత్సరములు దాటినది.

సుమారునాల్గు మాసముల క్రింద మన మహారాజా సర్ కృష్ణ ప్రసాదు బహాదురు గారు ప్రభుత్వ సభాధ్యక్షులైన తరువాత జరిగిన శాసన నిర్మాణ సభ యొక్క మొదటి సమావేశమున, మౌల్వీ మహమ్మదు అస్గర్ బి. ఏ.; బారిస్టరెట్లా గారు రాజ్యాంగ సంస్కరణముల యావశ్యకతను శాసన సభాసదుల పక్షమున మహారాజా గారి యెదుట వ్యక్తీకరింపగా, మహారాజా బహాదరు గారు ఈ ముఖ్య విషయమును గూర్చి "సానుభూతితో నాలోచింతు" మని వాగ్దాన మొనర్చిరి.

కొన్ని మాసముల క్రింద బ్రిటిషు హిందూ దేశపు ఆంగ్ల పత్రికలు కొన్ని మన ప్రభువు గారిని గూర్చియు బ్రిటిషు ప్రభుత్వము వారు మన రాజ్యాంగములో జోక్యము కలిగించుకొన నిశ్చయించినారనియు అసత్య

వార్తలు ప్రకటించునపుడు, మన ప్రభుత్వము వారు "ఈ వార్తలు అసత్యము లనియు, రాజ్యాంగమునందు సంస్కారములు చేయవలయునని ప్రభుత్వము వారు తలంచుచున్నారనియు త్వరలోనే ఆ సంస్కారములు ఆరంభింపబడు ననియు, ప్రజలకు తెలియుటకై ప్రకటనము గావించిరి. ఈ ప్రకటనము తరువాత కొన్ని మార్పులు జరిగినవి. 1. మహారాజా బహాదురు గారు ప్రభుత్వ సభాధ్యక్షులుగ నియోజితులైరి. 2. మాల్గుజారీ పోలీసు ఈ రెండు శాఖలను చేర్చి వీనికి మంత్రిగా కర్నలు ట్రేంచు గారును, 3. మాల్గుజారీ కార్యదర్శిగా మిష్టర్ టాస్కరు గారును, 4. సదరు నాజము కోత్వాలి అజ్ఞా పదవి పైన మిష్టర్ ఆర్మ్ స్ట్రాంగు గారును, 5. పారిశ్రామిక శాఖ యొక్క కార్యదర్శిగా మిష్టర్ కాలిన్సు గారును, 6. నాజము అత్యాత్ పదవికి నవ్వాబ్ తకీయార్ జంగుగారును నియోజింపబడిరి. ఇవి యన్నియు ఉద్యోగస్థులలో మార్పులే కాని రాజ్యాంగ వ్యవస్థలో మార్పులనుటకును వీలు లేదు. ప్రభుత్వ విధానములో 1329 ఫసలీలో నేర్పబడిన ప్రభుత్వ సభా (బాబె హుకూమతు) పద్ధతి తప్ప తరువాతి మార్పు ఇంకను ఏదియు జరుగలేదు. ఇది 1329 నుండి 1336 వరకు గడచిన (7) వత్సరముల ఉదంతము.

కనుక మహా ఘనత వహించిన మన ప్రభువు గారి సంకల్పమును, ప్రభుత్వ సభాధ్యక్షుల వాగ్దానములును, ప్రభుత్వము వారి ప్రకటనములును, రాజ్యాంగ సంస్కారముల విషయమున ఇంకను ఆలోచనములోనే యున్నవని యును ఈశ్వరానుగ్రహమున్నచో కార్య రూపమున వెలువడగలవనియు నమ్ముచున్నాము.

——

# నాయకులు-ప్రజలు

## 11-5-1927

అసహాయోద్యమము ప్రజల హృదయమునందు నాటియున్నదని చెప్పుటకు నాగ్పూరు యందును అలీబాగు యందునూ జరుగుచున్న సత్యాగ్రహములే నిదర్శనములు. నాయకులు తమ భావములు మార్చుకొని రానురాను ప్రభుత్వమునకు సహాయపడుట కుద్యుక్తులగుచున్నారు. కానీ ప్రజలు మహాత్మా గాంధీగారి హితవును మరువలేదు. నాయకులయందు వాక్శూరత్వ మున్నంత కార్య శూరత్వము లేదు. ఒకరితో నొకరికి సరిపడక, అభిప్రాయ భేదములు కలిగి, నిరంతరము తగవులాడుచు, కాలము మారుకొలది నూతన రాజకీయ కక్షలు బయలుదేరదీయు చున్నారు. తమ చంచల అభిప్రాయములకు తోడ్పడుటకై దేశమునందు పర్యటనము సల్పి బలము కూర్చుకొనుటకు ప్రయత్నించు చున్నవారే కానీ దేశ విముక్తికై యెట్టి మార్గ మవలంబించవలయునో ఆ త్రోవ త్రొక్కుట లేదు. ఆరునెలల క్రిందట శాసన సభలకుపోయి ప్రభుత్వము వారి చర్యల ఖండించి ఆదాయ వ్యయముల అంగీకరించమనియు, ద్వంద్వ ప్రభుత్వముల కూలదోసెదమనియు, ఆర్భాటములు చేసి అమాయకులగు ప్రజల నుండి సమ్మతుల సంపాదించి శాసన సభా మందిరములకు జేరిరి. నాటినుండి నేటివరకు ప్రజలకు కలుగుచున్న కష్ట నిష్ఠురములు విచారించినవారు గానరారు. శాసన సభల యొక్క మొదటి సమావేశపు గడవు తీరినది. ఏవో కొన్ని తీర్మానములపై తీవ్రమగు ఉపన్యాసముల గావించిరి. సంగీతముచే చింతకాయలు రాలవన్నట్లు వీరి ఉపన్యాసముల వలన ప్రభుత్వము లొంగునా?

శాసన సభలనుండి విశ్రాంతి కలిగిన పిదప జాతీయ మహా సభాధ్యక్షులగు శ్రీమాన్ శ్రీనివాస అయ్యంగారు దేశమునందు పర్యటనము సలిపి తమ శాసన సభల ద్వారా స్వరాజ్యము పొందజాలమనియు, తాము ముందు దేశము పాలించుటకై అనుభవము సంపాదించుటకై వానలో చేరితిమనియు నుడివిరి.

ఇపుడు సర్వ రాజకీయ పక్షముల వారును కలసి నొక నివేదిక తయారు చేసి ప్రభుత్వమున కర్పించవలయునని ప్రచారము గావించుచున్నారు. లోగడ బీసెంటమ్మగారు తయారుచేసిన ఇండియా కామనువెల్తు బిల్లునకే దుర్గతి పట్టినదో విదితమే కదా! అయ్యంగారి నివేదిక వలన కలుగు లాభమేమి? ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులు సహకారమునకు దిగుచున్నారు. ఈరీతి నాయకు లందరును పెడమార్గమునకు దిగుచున్నారనిన తప్పుకాదు.

మన నాయకుల స్థితి యీ రీతి యుండ ప్రజలు మాత్రము వారి అభిప్రాయానుసారము మెలగక పూర్వము అసహాయోద్యమమునందే నిలచి యున్నారు. ప్రభుత్వము వారు వంగరాష్ట్ర రాజకీయ నిర్బంధితుల విడుదల గావింపలేదని నాగ్పూరునందు అవరేగారి నాయకత్వమున ఆయుధ శాసన ఉల్లంఘనము జరుగుచున్నది. ప్రతినిత్యము స్త్రీలు పురుషులు ఆయుధపాణులై సివిలు లైనునందును ఊరేగుచున్నారు. పోలీసువారు మొదటి దినములలో కొందరిని అరెస్టు చేసిరి. కాని యిపుడు మౌనము వహించియున్నారు.

ఇదియే రీతి బొంబాయి రాష్ట్రమందలి ఆలీబాగు నందు పన్నులు ప్రభుత్వమున కొసగగూడదని తీర్మానించుకొని సత్యాగ్రహమునకు పూనుకొనిరి. గత సంవత్సరమిచట రిసెటిలుమెంటు జరిగియుండెను. ఇందువలన పన్నులు హెచ్చింపబడెను. ఎన్నిసార్లు రైతులు మొరపెట్టుకొనినను అధికారులు గమనించలేదు. అందుచే వీరు సత్యాగ్రహమునకు పూనుకొనిరి. నాయకులెవ్వరో తెలియుట లేదు. కాంగ్రెసు అధ్యక్షులు అలీబాగునకు వెళ్ళి అచట స్థిరచిత్తులయి యుండవలయునని ప్రజలకు హితవు గరపిరి.

ఇంతియేగాక దేశమునందు మతావేశపూరితలగు నాయకులు కొందరు గలరు. వీరి ఉద్రేకపూరితమగు యుపన్యాసముల వలన అపుడపుడు హిందూ మహమ్మదీయ కలహములకు కారణమగుచున్నది. ప్రభుత్వము వారింతవరకే "విభజింపుడు, పాలింపుడు" - అను సూత్రమును అనుసరించి ఉద్యోగముల యందును, వోట్లయందును, మత భేదములు గల్పించి యున్నారు. వానికితోడు మత ప్రచారము తీవ్రరూపము దాల్చుటకు సహాయపడుచున్నది. ఇట్టివారి నాయకత్వము పోయిననేగాని దేశ విముక్తి సాధ్యపడ నేరదు. కనుక ప్రజలు వీరి అభిప్రాయములకు చెవి యొగ్గకూడదు.

దేశమునందు పరిస్థితులు ఇట్లుండ మేనెల 15వ తేదీ బొంబాయి నగరమున కాంగ్రెసు కార్యనిర్వాహక సభ గూడుచున్నది. సభవారు పరిస్థితులు సమగ్రముగ చర్చించి యేమి తీర్మానింతురో అని అందరు కుతూహలపడుచున్నారు. కనుక ఇట్టి సందిగ్ధ స్థితియందు సభవారు పెడమార్గమునకు ద్రొక్కక దేశముయొక్క దాస్య విముక్తికై చక్కని మార్గము నిరూపించెదరు గాక.

---

# ఆరవ నిజాం రాష్ట్ర సంఘ సంస్కార మహాసభ

**25-5-1927**

ఈ మహాసభ హైదరాబాదు నగరమునందు అమర్దాదు నెల యొక్క మొదటి వారమున జరుగునను వార్త ఇందుకు ముందే ప్రకటింపబడియుండుట పత్రికా పాఠకులకు విదితమైయున్నది. విఖ్యాత వంగ విదుషీమణియగు శ్రీమతి సరళాదేవిగారిందుకు అధ్యక్షురాలుగనుండ నంగీకరించుట ఎంతయు ప్రోత్సాహకరముగ నున్నదనియు సభకొరకు నిర్ణయింపబడిన 6, 7 అమర్దాదులు బక్రీదు సెలవులగుటవలన స్థానికులకును, ముఖ్యముగా జిల్లాల వారికిని ఎంతయు అనుకూలముగా నున్నదనుట నిస్సంశయము. ఆహ్వాన సంఘ కార్యదర్శిగారు చేసిన ప్రకటనమునుబట్టి చూడగా, పర స్థలముల నుండి వచ్చు వారికి వలయు నేర్పాటులను క్రమముగా జరుగును కనుక ఈ సమావేశమునందు నిజాం రాష్ట్ర వాసులందరును కడునుత్సాహముతో పాల్గొనుట అత్యవసరమనియు సూచించుచున్నాము.

హైదరాబాదునందు జరుగుచున్న యుద్యమములన్నిటి యందును మన మహారాష్ట్ర సోదరులు అగ్రగాములై పనిచేయుచున్నారు. రాజ్యాంగ సాంఘిక, నైతిక, విద్యాది ప్రతి విషయమునందును వారే స్థాపకులు; వారే పోషకులు; వారే నిరుపమానముగ సేవచేయువారు: వారే ఎక్కువ ధనము వ్యయమొనర్చి దేశీయులందు ప్రబోధము కలిగించుచున్నవారు.' గడచిన 25 సంవత్సరముల కాలములో ఈ నగరమున ప్రజాహిత జీవనమును నెలగొల్పి, దానిని ఇంతవరకు పోషించిన గౌరవము మహారాష్ట్ర సోదరులకు ముఖ్యముగా నాయక రత్నములగు న్యాయమూర్తి పండిత కేశవరావు, ధర్మవీర వామననాయకుగార్లకు చెందవలసియున్నది. వీరే సంఘ సంస్కారోద్యమమునకును గారకులు, పోషకులునై ఆరవ మహాసభవరకు సదుద్యమమును గొనివచ్చి దేశీయుల కృతజ్ఞతకు బాత్రులైయున్నారు.

దురదృష్ట వశమున నిజాం రాష్ట్రంలోని యాంధ్రములో ప్రజాహిత జీవనాసక్తి తగిన విధముగ పెంపొందింపబడలేదు. ఇందునకు గడచిన (5) సంఘ సంస్కార మహాసభలే తార్కాణములు. మొదటి మూడు సభలును నాందేడు జిల్లాలో జరిగెను; కనుక తెలుగువారికి వాని గూర్చిన సంగతులే తెలియవని మా యూహ. నాల్గవ సభ హైదరాబాదునందు 1331 ఫసలీలో ఆచార్య కర్వేగారి అధ్యక్షత క్రింద జరిగెను. ఆ సభలో ఆంధ్ర యౌవనులు కొందరు పాల్గొనుటయు, మహాసభలో నుపన్యసించుటయు మే మెరుగుదుము. ఆ సభలో నాంధ్రుల కెట్టి ప్రాముఖ్యము లేకపోవుటచేతనే కొందరందునకు చింతిల్లి ఆంధ్రులలో ప్రబోధము లేకపోవుటయే అందునకు గారణముగ దలచి యట్టి లోపమును క్రమముగ దొలగించుకొన గృతనిశ్చయులై సభ యొక్క మూడవ నాటి రాత్రి (8 దై 1331 ఫ.) ఎనిమిది గంటలకు కీ. శే. టేకుమాల రంగారావు హైకోర్టు వకీలుగారి యింట సభచేసి హైదరాబాదు నగరమునందు మొట్ట మొదట ఆంధ్ర జన సంఘమును స్థాపించి, తరువాత ఆంధ్రోద్యమమును ఆంధ్ర జిల్లాలందు ప్రాకించిన యంశము మాకు బాగుగా జ్ఞప్తియందున్నది.

తరువాత గుల్బర్గాలో జరిగిన మహాసభ యందును పలు ఆంధ్ర జిల్లాల నుండి యౌవనులు వెళ్ళిన మాట నిజమే కానీ వానియందైనను వారి సంఖ్య దేశమునందున్న ఆంధ్రుల జన సంఖ్యనుబట్టి చూచినచో తృప్తికరముగా నుండలేదు. వచ్చిన వారైనను మాధ్యమిక స్థితియందుండిన యువకులు. గొప్ప ద్రవ్య స్థితి గలవారుగాని వయో వృద్ధులుగాని అందు కాన్పింపలేదు. విషయ నిర్ణాయక సంఘమునందును వారి సంఖ్య చాల లోపించియుండెను. సభలో నుపన్యసించిన వారు కూడ కొలది మందియే. వేయేల? ఈ తుది రెండు సభలును మహారాష్ట్ర సంఘ సంస్కార మహాసభలనదగియుండినవి కాని నిజాం రాష్ట్ర సంఘ సంస్కార సభలన్పించుకొనుటకు అర్హములుగా నుండలేదు. ఇందునకు గారణము మహారాష్ట్ర సోదరుల పక్షపాత బుద్ధికాదు. ఆంధ్రుల యుపేక్షాభావమే యని నొక్కి వక్కాణింపగలము.

రాబోవు మహాసభలో నధ్యక్షురాలు అఖిలభారత వర్ష ప్రాముఖ్యతగల శ్రీమతి సరలాదేవి అధ్యక్షురాలి యుపన్యాసము వేయి విధముల హిందీ భాష

యందే యుండగలదు. ఈ విషయమున శ్రీదేవిగారికి సూచింపబడినదనియు మాకు దెలిసినది. కనుక కార్యక్రమము ఎక్కువగా హిందీ భాష యందే జరుగ వచ్చును. మన రాష్ట్రమునందు హిందువులు నాల్గు తరగతులుగా నున్నారని చెప్పవచ్చును. 1. మహారాష్ట్రులు 2. ఆంధ్రులు 3. కర్ణాటకులు 4. ఉత్తర హిందూస్థానము నుండి వచ్చి మన రాష్ట్రమున స్థిరనివాస మేర్పరచుకొనిన వారు. వీరందరకును హిందీభాష బాగుగనే తెలియును. ప్రజా సామాన్యమున కుపయోగపడునట్లు ముఖ్య తీర్మానముల పైన మహారాష్ట్రము, తెనుగు, కన్నడ మున గూడ నుపన్యాసములు జరిగినచో అందరకును ఉత్సాహప్రదముగ నుండ గలదు. కనుక దేశీయులందరును ఈ మహాసభ యందు ప్రతినిధులుగా బహుళ సంఖ్యలో జేరి జయప్రదముగా జేయుట ధర్మము.

హైద్రాబాదునందును జిల్లాలందును ఎన్నియో కాలేజీలును, ఉన్నత పాఠశాలలును కలవు. వానిలోని యాంధ్ర విద్యార్థులీ మహాసభ యందు చేరి తోడ్పడవలయును. ఆంధ్ర న్యాయవాదులు పూర్వమువలె నిది ఎవరి యింటి లోని పెండ్లియోయని తలంపక, మన సంఘమునకు దేనిని ముఖ్యమైనదిగా భావించి ఈ మహాసభ యెడ అభిమానము వహించవలయును. ఉద్యోగస్థులగు వారును, చిక్కులు లేని ఈ సాంఘికోద్యమమున శ్రద్ధగైకొని ముందంజ వేయుట యుచితము. పలుమాటలేల? నిజాం రాష్ట్ర ఆంధ్రులందరును ప్రతి నిధులుగనో ప్రేక్షకులుగనో ఆహ్వాన సంఘ సభాసదులు గనో దీనియందు జేరి తమ యుత్సాహమును వ్యక్తపరుపవలయును. ఈ మహాసభ జయప్రద ముగ సాగునుగాక.

## పిక్టోరియల్ హైదరాబాదు

పై పేరనొక చిత్రపటమును కట్టించు నుద్దేశముతో ఆంధ్ర యౌవను లును, విఖ్యాత సేవా పరాయణులును అగు శ్రీయుత కృష్ణస్వామి ముదిరాజా గారు తమ చంద్రకాంత ముద్రాలయము పక్షమున వెలువరించిన ఇంగ్లీషు భాష యందలి నివేదనమును అందికొంటిమి. ఇది నిజముగ గొప్ప కార్యము. దీని యందు పటములు (500) లకు తక్కువ కాకుండ నుండును. ప్రతి పటమును గూర్చియు సంగ్రహాంశములు చేర్పబడగలవు. ఈ పటములు నాలుగు భాగము

లుగ విభజింపబడి యుండును, 1. రాజ్యములోని గొప్పవారు 2. చారిత్రిక మందిరములు, ప్రదేశములు 3. పారిశ్రామికములు. 4. ఇతరములు. డబల్ డెమ్మీ సైజున ("8" + 11' ") సంపుటము ప్రకటితమగునని నివేదికయందు కలదు. ఉద్యోగ ప్రియులగు పై ముద్రాలయము వారు, దేశీయులను రాజ పోష కులుగను (రూ. 500/-లు), పోషకులుగను (రూ. 250/-), అభిమానులుగను (రూ. 100/-) వుండుటకు అంగీకరించి ఈ యుద్యమమును తోడ్పడ వేడు చున్నారు. ఆంధ్ర యౌవనుని ఈ యుత్సాహము ప్రశంసార్హము. దేశీయుల సహాయమునకు వీరు పాత్రులై యున్నారని సూచించుచు మా మిత్రులగు శ్రీకృష్ణస్వామి గారినీ మహోద్దేశమునకుగాను అభినందించుచున్నాము.

---

# హిందూ సంఘ సంస్కార మహా సభ

## 15-6-1927

హైద్రాబాదులో మొన్న జరిగిన ఆరవ హిందూ సంఘ సంస్కార సభా చర్యలు పేరుచో ముద్రింపబడి యున్నవి. ఈ మహా సభ అత్యుత్తమముగా, జయప్రదముగా జరుపబడెననుటలో సందేహము లేదు. సభా భవనము నగర వాసుల చేతను, జిల్లాల నుండి వచ్చిన వారిచేతను పూర్తిగా నిండియుండుట ప్రజలందు కలుగుచున్న మార్పును సూచించుచున్నది. మరియు సభా తీర్మానములను శ్రద్ధతో విని వాని నామోదించుటలో మన రాష్ట్రపు జనుల సత్వరాభి వృద్ధిని సూచించుచున్నది.

ఆహ్వాన సంఘాధ్యక్షుల యొక్కయు యధ్యక్షురాలు యొక్కయు, నుప న్యాసములు చాల బోధ ప్రదములైనవి. ఆహ్వాన సంఘ అధ్యక్షులయిన శ్రీయుత రామచంద్ర నాయకుగారు హైద్రాబాదులోని పరిస్థితులను, తామెట్లు రాజకీయ సభలను చేయజాలరో, తమకెట్లు విద్యా మతాది విధానములందు విశేషా ధికారములు కావలయునో సూచించిన విషయములన్నియు ముఖ్యముగా గమనింప దగినవి. అధ్యక్షురాలగు సరళాదేవి చౌధరాణిగారి యుపన్యాసము గంభీర భావ గర్భితమైనది. ప్రతి వాక్యమును దీర్ఘాలోచనకు తావిచ్చునది. బ్రాహ్మణుల ధర్మమును వారు చూపి చెప్పిన విషయములు వారు స్వయముగా బ్రాహ్మణి యగుట చేతను, సత్యాధారములగుట చేతను నిరసింపబడక ప్రశంసింపబడెను. "బ్రాహ్మణత్వమునకు మారుగా నెప్పుడు బ్రాహ్మణుడే సంఘ నాయకుడయ్యెనో అప్పుడే పతన మారంభమయ్యెను"- ఇత్యాది వాక్యములు ఎంత తీక్ష్ణముగా నున్నను వానిలోని గంభీర భావమును గ్రహించుట అవసరము.

ఈ సంఘ సంస్కార మహా సభా తీర్మానములు అనేకములు హిందూ స్థానమందన్ని ప్రాంతములందును జరుగునన్ని సంస్కార సభలలో ప్రవేశ పెట్టబడి సాధారణముగా నామోదింపబడునట్టివి. స్త్రీ విద్యా వ్యాపకత్వమును

గురించినట్టియు, సర్వ జనైక్యతను గురించినట్టియు, అస్పృశ్యతా మద్యపాన బాల్య వివాహ శుల్కాది దోష నివారణ విషయికముల గురించినట్టియు, మున్నగు తీర్మానములు సర్వసాధారణములైనవే. ఒకటి రెండు తీర్మానములు విశేషముగా చర్చింపబడెను. అందు విధవా వివాహమొకటి. దీని విషయమై విశేష కాలము వాదోపవాదములు జరిగెను. తుదకు బహుజనాంగీకారముగా వితంతూద్వాహము అందు ముఖ్యముగా బాల వితంతూ వివాహములు అంగీకరింపబడెను.

హైదరాబాదు రాష్ట్రమునకు సంబంధించిన తీర్మానములు సభవారు చేయుట చాల యుక్తముగా నున్నవి. ఖాస్గి పాఠశాలల శాసనమును బహిరంగ సభల నిరోధించు శాసనమును, రద్దు చేయవలయునని యీ సభ కోరెను. "గ్రంథాలయ వార్షికోత్సవములను ఆపివేసినందులకీ సభవారు తీవ్రముగా ఆక్షేపించుచున్నారు." - ఈ తీర్మానము సూర్యాపేట సభల విషయమైనది. గ్రంథాలయ ఉద్యమమును రాజకీయమునకే సంబంధమును లేనిది. బరోడా వంటి సంస్థానమీ యుద్యమమునకు చేయుచున్న సహాయము బ్రిటిషిండియా యందును కానరాదు. ఇట్టి వానిని నిరోధించుట జ్ఞానమును నిరోధించుటయై యున్నది. ఈ నిరోధములు ముందు వుండకూడదని సభ కోరుట చాల సమంజసము.

భైక్షుక వృత్తిని నిరోధించు శాసనమును గురించి మా పత్రికలో నిదివరకే మా యభిప్రాయము నిచ్చియుంటిమి. ఇది చాలా యవసరమైనది. దేశమందీ మూలమున ప్రబలిన సోమరితనమును ఫలవంతమగు మార్గములందు ప్రసరింపజేయుట దేశ దారిద్ర్యమును పోగొట్టుట యగును.

మొత్తము పైన తీర్మానము లన్నియు దీర్ఘ సమాలోచనా ఫలితములని చెప్పనొప్పు. సభా కార్యక్రమములు చక్కగా జరిగెను. కానీ వానిని ఆచరణ యందుంచుట యొక్కటి మిగిలిన పని. ఇచ్చట మన లోపము విశేషము. వేయి సులభముగా చెప్పవచ్చును గాని యొక్కటి సక్రమముగా దీక్షతతో నాచరించుట కష్టము. మనలో కార్య దీక్షతకు మనము ప్రాముఖ్యత నొసగు వరకు మనకు గౌరవము కలుగదు. ఈ సభ వారు దేవీ చౌధురాణీ గారి యధ్యక్షతతో జరుపుటచే ఈ రాష్ట్రవాసులలో గొప్ప సంచలనము కలిగించిన వారైరి.

సభా కార్యక్రమము విశేష భాగము ఉర్దూలో జరిగెను. కానీ కొందరు మహారాష్ట్రమందు మాట్లాడుటచే మహారాష్ట్రేతరులకు ఉత్సాహభంగమయ్యెను. సభయందు హిందూస్థానీలో నుపన్యాసములు జరుగవలెనని కొందరి యాందోళనము కూడ జరిగెను. ఇట్లు ప్రత్యేక భాషా పక్షపాతము సభవారు చూపకుండిన చాలమేలుగా నుండెడిది. ఈ సభకు పూర్వము కొన్ని సంవత్సరములు ఈ సభలు జరిగియుండలేదు. ఇక ముందిట్టి లోపము లేకుండునట్లుగా సక్రమముగా సభలు జరుగునని నమ్ముచున్నాము. ఇంతియ కాక యీ సభయందు మహారాష్ట్రుల తీసికొనినంత ఆంధ్రులు తీసికొనకపోవుట శోచనీయము. ముందు సభలందైనను ఆంధ్రులు ఉత్సాహముతో విశేష సంఖ్యాకులుగా చేరి శ్రద్ధ వహింతురని నమ్ముచున్నాము.

---

# వరంగల్లు కళాశాల

## 30-7-1927

ఓరుగల్లు మున్నొకప్పుడు ఆంధ్ర దేశమునకు రాజధానిగ నుండెనని సర్వజనులకు తెలిసేయున్నది. కాల ప్రవాహమున ఎన్నియో మార్పులు జరుగుచున్నవి. భారతదేశమంతటను కీర్తి బడిసిన కాకతి సామ్రాజ్య మస్తమించెను. వాదిగోలె నీ పట్టణము అంధకార బంధురమై యుండెను. దయామయులగు మన ప్రభుత్వమువారు వరంగల్లును ఆ ప్రాంతమునకు ప్రధాన స్థలముగ నేర్పరచి పూర్వ గౌరవమును నిలిపిరి. గత మూడు సంవత్సరముల క్రితము తెలంగాణమునకు ముఖ్య పట్టణమయ్యెను. ప్రాంతాధికారి నియమింపబడెను. కానీ కళాశాల లేని లోపముండెను. ఆంధ్రులు హైద్రాబాదుకు వచ్చియే ఉన్నత విద్య పొందుచుండిరి. గత రెండు సంవత్సరముల క్రింద మహారాష్ట్ర ప్రాంతమున రెండు కళాశాలలు స్థాపింపబడగ ఆంధ్రుల కన్నులు దెరచిరి. ఓరుగల్లు నందొక కళాశాల స్థాపించుటకు ప్రయత్నించిరి. తత్ఫలితముగ నిపుడు కళాశాల యేర్పాటు గావింపబడినందులకు పౌరుల కృషియును, ప్రభుత్వము వారి ఆదరణయును, ప్రశంసనీయము. ఈ కళాశాల ఆంధ్రులు పౌర్వస్వత్యము బడయుటకు మార్గదర్శక మగుగాక. అయినను ఒక సంగతి వినుచున్నాము. ఇందు ఆంధ్రము సంస్కృతమునకు తావు ఒసంగబడలేదట. ఆంధ్ర భాషకు ముఖ్యస్థానమగు ఓరుగల్లునందే ఆంధ్రమునకు ప్రాముఖ్యము లేనిచో ఇంతకన్న వేరు దౌర్భాగ్యము వుండనేరదు. ఇది నిజమే అయినచో ఇట్టి లోపము ప్రభుత్వము వారు వెంటనే తీర్చెదరని నమ్ముచున్నాము.

---

# ఇంగ్లాండునకు పోవు విద్యార్థులు

## 27-8-1927

ఈ వారమున మన రాష్ట్ర వాసులగు పలువురు విద్యార్థులు వివిధ విద్యలు నభ్యసించుటకై ఇంగ్లాండునకు పోవుచున్నారు. వారిలో ముఖ్యులు రాజా శ్రీనివాసరావు కార్వాన్కరు బి. ఎ., దామోదర రెడ్డి బి. ఎ., వేనేపల్లి లక్ష్మారావు బి. ఏ., రాంరావు కోరట్కరు, కిషన్‌రావు అత్రే బి. ఎ., డాక్టరు బోర్గాంకరు గార్లును మరికొందరు మహమ్మదీయ యువకులునై యున్నారు.

పై వారిలో మొదటివారు ఇచ్చటి విఖ్యాతులగు జాగీరుదార్లు. పూర్వము అవ్వలు తాలూక్దారు పనిచేసిన రాజా శ్రీనివాసరావు గారి మనుమలు. రెండవ వారు పోలీసు మొహతెమిం పదవి యందున్న శ్రీయుత కొండారెడ్డిగారి పుత్రులు. మూడవవారు నల్లగొండ జిల్లాలోని కొప్పోలు దేశముఖులును, నిజాం రాష్ట్ర వెలమ జన సంఘ కార్యదర్శులును అగు శ్రీయుత వేనేపల్లి నరసింహారావు గారి సోదరులు. నాల్గవవారు పండిత కేశవరావు గారి పుత్రులు. వీరు ఇదివరకే సీమకు వెడలిపోయినారు. అయిదవ వారు శ్రీయుత హనుమంతరావు అత్రే బి.ఎ. గారి కుమారులు. ఆరవవారు గోపాలరావు వకీలు గారి పుత్రులు.

ఈ వారమునందు పైన పేర్కొన్న యౌవనుల గౌరవార్థమై యనేక విందులు, టీ పార్టీలు జరిగినవి. కాశీనాథరావు వైద్య, రామచంద్ర నాయకు బారిష్టరు గార్ల భవనము నందును, కర్ణాటక యువజనుల పక్షమునను, కర్ణాటక పక్షమునను, ఆంధ్ర కుటీరము నందును, వివేక వర్ధనీయందును, రెడ్డి హాస్టలు నందును, ఇంకను పలు తావులందును ఇట్టివి కొన్ని బాహుళ్యముగను, కొన్ని ప్రత్యేకముగను జరుపబడినవి.

ఈ విద్యార్థులలో యెవరెవరే విద్య నభ్యసించుటకై పోవుచున్నారో వివరములు తెలియలేదు. అయినన్ను బ్యారిష్టరీకిని, వైద్యమునకును అర్థ శాస్త్రము కొరకును అనుచున్నారు. న్యాయవాద వృత్తియందు ఉన్నత విద్య నభ్యసించ వలయునన్న మన దేశమునందే తగిన సంస్థలున్నవి. అదియును గాక సీమకు

వెడలి యీ విద్యను చదివి వచ్చిన వారెందరో ఇపుడు కలరు. ఇపుడు దేశము నకు వారి అవసరము లేదనియే చెప్పవచ్చును. వైద్యమునందు ఎం.బి.సి.ఎం. ఉన్నత పరీక్షకు కూడ హిందూ స్థానమునందు శిక్షణ నొసంగబడుచున్నది. అట్టి యున్నత వైద్య పరీక్షలలో కడతేరి కొన్నాళ్ళు అనుభవము సంపాదించి ప్రత్యేక విషయమును గూర్చి ఇంకను తెలిసికొనవలయునన్న సీమకు వెడలుట యుపయోగకరమే.

ప్రస్తుతము భారతీయులు పరిశ్రమల యందును, ఇంజనీరింగు, సైన్సు యందును ప్రవీణులు గావలసియున్నది. దేశసంపద అభివృద్ధి పరచుటకీ విద్యలే మూలాధారములు. అన్ని దేశముల వారి కన్న మనము పరిశ్రమల యందు వెనుకబడి యున్నాము. విదేశీయులు చిన్న చిన్న వస్తువుల సిద్ధపరచి కోట్ల కొలది ధనమార్జించుచుండ మనము యుద్యోగములకొరకు పెనుగులాడుచున్నాము. వారిచే తయారు చేయబడిన వస్తువుల జీవితావసరములుగా జేసికొని వారికి దాసులమై జీవితముల గడుపుచున్నాము. మన దేశమునందు మిక్కుటముగ పండుచున్నట్టి ముడి పదార్థముల విదేశములకు చౌకధరలకు ఎగుమతిచేసి వాని వలననే తయారుకాబడిన వానికి హెచ్చు వెలల నొసంగి గైకొను చున్నాము. పరిశ్రమలయందు మనము నిపుణులమై యున్న ఇట్టి ముడి వస్తువుల నుండి యెన్నియో అవసర పదార్థములు సిద్ధపరచి లాభము పొందవచ్చును గదా! వారి దేశములకు పోయి మనము నేర్వవగినది ముఖ్యముగా యీ విద్యలే. ప్రస్తుతము దేశమునకు కావలసినవి ఇవియే. ఆర్థిక స్వాతంత్ర్యమున కివియే. మూలాధారములు. కాన సీమకు వెళ్ళు విద్యార్థులు పూర్వాభిప్రాయములు విడచి తమకును, దేశమునకును లాభకరమగు విద్యల నార్జించుట శ్రేయస్కరము లేనిచో వీరు వెచ్చించు వేల కొలది ధనము వృథా యనదగును. స్వదేశమునందే యుండుట మేలు కనుక పై విద్యార్థులందరును ఆలోచించెదరు గాక.

యౌవనులగు వీరందరకును ఈశ్వరుడు ఆరోగ్యమును ప్రసాదించి వీరి ఉత్తమోద్దేశములను నెరవేర్చి పిమ్మట సులభముగ స్వస్థలముల జేర్చుగాక యని ప్రార్థించుచున్నాము. వీరు తమ దేశమునకవసరమగు పాశ్చాత్య విద్యల నభ్యసించి దేశమును, దేశీయులను, దేశ సంప్రదాయములను సదా దృష్టియందు వుంచుకొని, దేశ సేవకై ద్విగుణీకృతోత్సాహముతో కృతార్థులై మరలివత్తురని నమ్ముచున్నాను.

---

# ఐకమత్య సందేశము

## 3-9-1927

భారతదేశము నందు సంఘ ద్వేషము దిన దినము ప్రబలుచున్నది. ఎటు చూచినను హిందూ మహమ్మదీయ తగవులు గాన్పించుచున్నవి. స్వల్ప కలహములే మత యుద్ధములుగా మారుచున్నవి. ఇంతవరకు ఎన్ని సభలు జరిగినను, ఎన్ని సంధి పత్రములు వ్రాసికొనినను ఫలితము అన్యథా పరిణమించినది. భారతదేశమిట్లు అధోగతి పాలగుచుండ ఏ శాంతిప్రియుడు విలపింపకుండును? దేశమునందు అల్లరులు జరుగుచుండిన యే సంఘము వారికైనను లాభము కల్గునా?

ఈ విషమ పరిస్థితులు వీక్షించుటచే రాజ ప్రతినిధులగు ఇర్విను ప్రభువు గారి హృదయము కరిగినది. వారు అన్ని పక్షముల వారి యందు ఐకమత్యమవసరమని తలంచిరి. వీరి ప్రసంగము ఫలితముగ సిమ్లా చల్లని ప్రదేశమున సర్వ రాజకీయ పక్ష నాయకులు సమావేశమై ఈ విషయమై ఆలోచించి దేశీయులకు విన్నపము ప్రకటించిరి. అందరు ఐకమత్యముతో నుండవలయునని ప్రబోధించిరి; లేనిచో జాతీయ వికాసము కలుగనేరదని విలపించిరి. నాయకులందరును తమ భేదములు విడనాడుకొనుటకు సమ్మతించిరి. అయినను ఇట్టి విన్నపముల వలన పరిస్థితులు చక్కబడునా? "ఐకమత్యము, ఐకమత్యము"—అని ఒక వంక చల్లని ప్రదేశము నందుండి నాయకులు యుద్ఘోషించుచుండ వేరొక వంక కాన్పూరు నందు పరస్పర కలహము జరుగుచునే యున్నది కదా?

దేశము నందు శాంతి సమకూరుటకు దేశీయుల భావములు మార్పు గాంచవలయును. నాయకులు ప్రజలకు ఆదర్శప్రాయులు గనుక వారు మున్ముందు తమలోగల భేదాభిప్రాయములు విడనాడుకొని ఏక కంఠముతో జనసామాన్యము నందు ప్రచారము గావించవలయును. అందరు నొకే మార్గమునకు దారి చూప

వలయును. ద్వేష భావములు ప్రజ్వరిల్లజేయుచున్న సంఘములను, వ్యక్తులను బహిష్కరించ వలయును. అపుడే మైత్రి సమకూరును గాని వట్టి విన్నపముల వలనగాదు. ఒకరి మతమును ప్రవక్తలను ఒకరు గౌరవించవలయును. ఈ సందర్భమున మౌల్వీ లియాకత్ హుసేన్ సా॥ ప్రకటించిన విజ్ఞప్తి యెల్లరు గమనింపదగినది. గోవధ విషయమై ముసల్మానులు పోరాడనవసరము లేద నియు, బక్రీదు సందర్భమున గోవులను వధించుటకు బదులు, వానిని కొనుటకై వెచ్చించు ధనము ధర్మ కార్యములకై వినియోగించవలెననియు, వారు సూచించు చున్నారు. ఇదే విధముగ మసీదుల యెదుట వాద్యము లాపుటకు ఖురాను విధించుటలేదని వీరి తలంపు. హిందువులు గూడ ఇతరులను తమ మతమునందు చేర్చుకొనిన ఆక్షేపింపకూడదని వీరి అభిప్రాయము. హుసేన్ గారు తమ సోదరులను పై విషయముల గూర్చి అంగీకరింపజేసి దేశమునందు ఐకమత్యము స్థిరముగ నాటుకొనునట్లు జేయుదురుగాక. ఇరు సంఘముల వారును హృదయ పరివర్తనము గావించుకొనిన భేదము లన్నియు సమసిపోగలవు. హిందూ మహమ్మదీయ మైత్రి సాధ్యమైనదే. దీనికి నాయకుల కలయికయే ముఖ్యావసరమై యున్నది. భారతదేశము నందు త్వరలో సంఘ ద్వేషము సమసిపోవు గాక.

———

# నన్నయ భట్టారక వర్ధంతి

**21-9-1927**

శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషా నిలయమువారు గత శనివారము నాడు నన్నయ భట్టారక వర్ధంతి జరిపి యుండిరి. ఆ సభా వృత్తాంతమును స్థలాంతరమున ముద్రించి యున్నారము ఇట్లు కవుల వర్ధంతులను జరపునట్టిది ఈ నిలయమొక్కటియే సకలాంధ్ర భూభాగమున గనపడుచున్నది. భాషాభివృద్ధికై ఏర్పడిన గ్రంథాలయములిట్టి మంచి పద్ధతి నేల యనుకరింపగూడదో మాకు దోచకున్నది. హైదరాబాదులోని గ్రంథాలయములవారైనను తాము ప్రత్యేక సభలను సమావేశపరచుటకు అనుకూలము లేనిచో, నిలయమువారిలో జేరి సభకెక్కుడు ప్రాతినిధ్యమిచ్చి, మిగుల యాకర్షణీయముగ నొనర్పకుండుటకు గారణము దురూహ్యము. నిర్వివాదమయిన ఇట్టి భాషావిషయ కోపన్యాసములందు మనము ఏకముఖముగా ప్రవర్తించిననేగాని, జనులయందు భాషాభిమాన బీజములు నాటుటకు అవకాశము కలుగజాలదు ఆయా గ్రంథాలయాధికారులు ఈ విషయమునుగూర్చి యాలోచించెదరుగాక!

ఇక సభావృత్తాంతమును గమనించినచో అది మిగుల నిరుత్సాహకరముగ నున్నదని తెలుపుటకు చింతించుచున్నాము ఒక బాలేందు శేఖరముగారు చెప్పిన నాలుగు మాటలుతప్ప శ్రీ సోమయాజులుగారేమి, అధ్యక్షులగు ప్రభాకరరావుగారేమి, నన్నయభట్టు భారత రచనా విశేషములనుగూర్చి సుంతైనను ముచ్చటించలేదు భారతము నెవ్వరు పఠించుటలేదేయని వాపోయినంత మాత్రమున లాభము లేదు. నన్నయభట్టు రచనయందలి మేలిగొనముల నెత్తి చూపి, శ్రోతలను ఆకర్షించి వారికా గ్రంథము జదువ నభిలాష పుట్టినట్లుగా ఉద్బోధించవలయును అధ్యక్షులవా రయినను "ఎవ్వతె వీవు..., అటజనించె..." అను మనుచరిత్ర పద్యముల నుద్ఘాటించిరేగాని నన్నయ పద్యరత్నములను ఉదాహరించి యుండ లేదు ఆయా సమావేశ విషయములను బురస్కరించుకొని, ఆయా కవుల

గ్రంథములను సారస్వత దృష్టితో విమర్శించినవేగాని సామాన్య జనులయందు భాషాభిమాన బీజములు నాటుటకును, ఆంధ్రభాష యౌన్నత్యమును చాటుటకును అవకాశముండదని మా యభిప్రాయము లేనిచో ఇట్టి సభలు సోమయాజులుగారు సెలవిచ్చినట్లు ఈ కాంపు సాంవత్సరిక సంధ్యావందనములుగను కార్యనిర్వాహకులు ఈ విషయములను గమనించెదరుగాక!

భారతాది గ్రంథములు ఈ కాలమువారు పఠించుటలేదని అధ్యక్షులవారు సెలవిచ్చిరి. కానీ ఈ విషయమున మేము అధ్యక్షులతో నేకీభవించజాలము పూర్వ కవులకును, గ్రంథములకును ఈ కాలమునందే ఎక్కువ ప్రచారము గలదని మా యభిప్రాయము ఇట్టి వర్ధంతులు జరుపుచుండుటయు, గ్రంథాలయములు స్థాపించి యందు పూర్వకవుల గ్రంథములకు అగ్రస్థానము ఒసంగుచుండుటయు, వేదికలపై భాషావిషయక ఉపన్యాసములు జరుపుచుండుటయు ప్రజలదృష్టి యెట్లు ప్రసరించుచున్నదో తెలియగలదు. అంతియేగాక, పాఠశాలలందును, కళాశాలలందును, విద్వాన్ మొదలగు పరీక్షలకును, పూర్వ గ్రంథములు పఠనీయములై యుండుట క్రొత్త విషయముగాదు.మరియు ఆంధ్ర భారతీతీర్థ మొదలగు ప్రజా సంస్థలును ఈ విషయమున చక్కని కృషి సలుపుచున్నవి ఏ మాస పత్రికను, ఏ వార్తాపత్రికను తిలకించినను పూర్వగ్రంథములను స్తనశల్యపరీక్షచూసి చర్చించు వ్యాసములు పెక్కు గనిపింప గలవు రాజులును, భాగ్యవంతులును తమ ద్రవ్యమును కవుల పోషణమునకును, భాషాభివృద్ధికిని సద్వినియోగము చేయుచుండుటకు ఉదహరణములు లేకపోలేదు. ఈ యంశము యధ్యక్షులకు అనుభవైక వేద్యము ఇవన్నియు శుభసూచకములు. పూర్వకవుల ప్రతిభ దినదినము హెచ్చి దివ్యతేజస్సుతో వెలుగుచున్నది. అయినను సజీవమయిన భాష మార్పులు చెందుచుండుట ప్రకృతిసిద్ధము అందుచే మనము నిరుత్సాహము చెందనవసరములేదు పూర్వ కవుల ప్రతిభను ఊతగా గైకొని, నవీనోత్సాహముతో ప్రత్యాంధ్రుడూ ఆంధ్ర భాషాభివృద్ధికై ముందుకు నడుచుచుండునుగాక!

---

# మన రాష్ట్రాభివృద్ధి

**8-10-1927**

ఆర్థికశాఖా మంత్రులగు నవాబు హైదరునవాజుజంగ్ బహాదురు ప్రకటించిన 1337 ఫసలీ ఆదాయవ్యయ పట్టిక చాలా యుత్సాహకరముగ నున్నది ఈ సంవత్సరము క్షామ నివారణము, అభివృద్ధి శాఖ, మొదలగు నిధులకు నిలువ యుంచు మొత్తము పోగ 44 లక్షలు నిలువ యుండునని అంచనా వేయబడినది. మన రాష్ట్రము యొక్క ఆర్థిక పరిస్థితులు చక్కబరచి తగిన మొత్తము వ్యయ పరచుచు నిలువ చూపుచున్న మన ఆర్థిక శాఖ మంత్రులెంతయు ప్రశంసనీయులు

రిజర్వు నందు మొత్తము 15 కోట్లన్నర సంవత్సరాంతమున నుండునట్లు అంచనా వేయబడినది ఈ మొత్తము నుండి సగము 1934 సంవత్సరమున రైల్వే కొనుటకు వెచ్చింపబడును. అపుడు రైల్వే కంపెనీ మన ప్రభుత్వము వారి స్వాధీనమునందే యుండును. ఇంతియ కాక కాజీపేట బెల్హారుషా రైల్వే పని పూర్తిజేయుటకును కొన్ని ఇతర ఇనుపదారులను వేయుటకును తగిన మొత్తము నిర్ణయింపబడినది పై రైల్వే నిర్మాణమునకును, ఇర్రిగేషనునకును, 136 లక్షలు నిర్ణయింపబడినవి ఇపుడు నిర్మాణము నందున్న ప్రాజెక్టులన్నియు పూర్తినొనరింపబడును

బడ్జెటు నందు ఆయా శాఖల కొరకు కొంత మొత్తము ప్రత్యేకింపబడును కాని శాఖాధికారులు వానిని ఉపయోగించక నిలువ యుంచెదరు దీని వలన ఆయా శాఖల యందు జరగవలసిన అభివృద్ధికి ఆటంకములు కలుగుచున్నవి ప్రభుత్వము వారిచే వ్యయపరచుటకై నిర్ణయింపబడిన మొత్తము యేల యుపయోగింపబడదో దురూహ్యము. ఈ సంవత్సరము యూరోపియను అధికారులు నియమింపబడుటచే వ్యయమునందు రెండు లక్షల హెచ్చినట్లు మంత్రిగారు సూచించుచున్నారు రాష్ట్రము నందుగల ఇట్టి ప్రోత్సాహకరమగు

మార్గములను ఉపయోగపరచుకొను సమర్థులు కావలయునని నవాబు సాహెబు వాంఛించుచున్నారు

బ్రిటిషు ఇండియాలో ధన లోపముచే ప్రజావాంఛితములు నెరవేరజాలకున్నవి మన రాష్ట్రమున ప్రతి సంవత్సరము నిలువ హెచ్చుచున్నను రాష్ట్రాభివృద్ధికరములగు యెన్నియో కార్యములు చేయబడుట లేదు. ఈ సంవత్సరము రైల్వే, ఇరిగేషను మొదలగు వాని కొరకు కొంత మొత్తము నిర్ణయింపబడిన మాట సత్యమే కాని విద్యాభివృద్ధి యందును, ఇతర ప్రజా సౌకర్యముల కొరకును యెంత వ్యయ పరచినను తక్కువయనియే చెప్పవచ్చును ఉస్మానియా విశ్వవిద్యాలయము రాష్ట్రము యొక్క విద్యాభివృద్ధికి మార్గము చూపినది. ఎందరో పట్టభద్రులు తయారగుచున్నారు. అయినను విద్యావిధానము పాశ్చాత్య పద్ధతిపై నుండుటచే విద్యాధికులలో నిరుద్యోగము వ్యాపించుచున్నది. ఈ నిరుద్యోగము సమసిపోవుటకు పరిశ్రమలు, వాణిజ్యము, వ్యవసాయము మున్నగు కళాశాలలు స్థాపించుట యుత్తమము. వీని వలన విద్యార్థులు స్వతంత్రముగ జీవయాత్ర గడపుటకు మార్గము ఏర్పడును. ఉద్యోగములకై పెనుగులాట తగ్గిపోవును.

మొవాజినా యుత్సాహకరముగ నున్నపుడు పన్నుల భారము తగ్గించుట కూడా యుత్తమము బ్రిటిష్ ఇండియాలో పోస్టల్ రేట్లు హెచ్చగా ఇచట కూడా మనీ ఆర్డరు కమీషను ౧ అణా నుండి రెండణాలు చేయబడినది ఈ రీతి కొన్ని కమీషనులు హెచ్చినవి ఆదాయము నందు లోటు లేనపుడు ఈ కమీషన్ రేట్లు తగ్గించిన బాగుగ నుండును. దేశీయ పరిశ్రమలు వృద్ధి నొందుటకై వాని పైన గల శుంకము గైకొనుట లేదు ఇదే విధముగ రాష్ట్రము నందు ఒక ప్రదేశము నందుండి వేరొక ప్రదేశమునకు ఎగుమతి చేయబడు దేశీయ వస్త్రములు. ఇతర సామానుల పైనను సుంకములు తగ్గించుట పరిశ్రమల అభివృద్ధికి కారణమగును.

దయామయులగు ప్రభుత్వమువారు ఇట్టి మార్పులు గావించెదరని మా ఆశయము

# రైయత్

**19-10-1927**

పై పేరుతో నొక ఉర్దూ వార పత్రిక ఆజూరు చివర వారము నుండి ఆంధ్ర యౌవనులును, దేశసేవా తత్పరులును అగుముందుముల నరసింగరావు గారి సంపాదకత్వమున వెలువడనున్నది నిజాం రాష్ట్రి వాసుల యందు విజ్ఞానము వ్యాపింప జేయుటయు, నిజాం ప్రభువుగారి పాలనములో నున్న ప్రజా సమూహమున పరస్పర సానుభూతి కలిగించుటయు ఈ పత్రిక ముఖ్యోద్దేశము. చిర కాలము నుండి ఇట్టి ఉర్దూ పత్రిక నిజాం రాష్ట్రిము నుండి వెలువడ వలయునని ఎందరో కోరుచుండిరి. తుదకు పరమేశ్వరుని కృప వలన ఆ సంకల్పము నెరవేరినది ఇట్టి కార్యమునకు యుత్సాహవంతులగు నరసింగరావు గారు పూను కొనుట ఎంతయు ప్రశంసనీయము ఈ పత్రిక ప్రజలు ప్రభుత్వము మధ్యవర్తిగ నుండి చిరంజీవియై వర్ధిల్లుగాక యని కోరుచున్నాము ఉర్దూ భాష తెలిసిన వారందరును ఈ పత్రికాధిపతిని ప్రోత్సహించెదరని నమ్ముచున్నాము.

---

# ఆంధ్ర మహాజన సభ

## 16-11-1927

ఈ మహాజన సభ అనంతపురములో శ్రీయుత ఒ. లక్ష్మణస్వామి గారి యాజమాన్యమున సమావేశమయినది. అధ్యక్షుల ప్రారంభోపన్యాసము భావ గర్భితమై ఒప్పుచున్నది ఆంధ్ర మహాసభ ఏర్పడి పదునైదు సంవత్సరములు గడచినను ఆంధ్ర సభల యుద్దేశము పూర్తికానులేదని వీరు నిరూపించిరి. ఆంధ్ర రాష్ట్ర సమస్య యింకను పరిష్కరింపబడలేదు. చిత్తూరు జిల్లా వారికిగల అభిప్రాయభేదములు త్వరలో తొలగిపోయి ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము జరుగు నని తలచెదము ఈ విషయమై ఆంధ్ర మహాసభ శ్రద్ధవహించవలసి యున్నది. ఆంధ్రులలో వివిధ రాజకీయ పక్షములున్నను ఈ విషయమై అందరు ఏకాభి ప్రాయులై ప్రయత్నించెదరని నమ్మెదము

రెండవది ఆంధ్ర విశ్వవిద్యాలయము. విశ్వవిద్యాలయ కార్యాలయము స్థాపింపబడి ఒక సంవత్సరము గడచిపోయినను ఇంకను ప్రత్యేక విద్యా విధానము ఆచరణకు రానులేదు. విశ్వవిద్యాలయ కార్యస్థానము గూర్చియే తగవులాట జరుగుచున్నది ప్రతి ప్రాంతము వారును తమ ప్రాంతమునకే కార్యస్థానమున్న గౌరవము లభించవలెనని పోరాడుచున్నవారే కానీ మొత్తము పైన అన్ని ప్రాంతముల ఆంధ్రుల అందుబాటులో నుండవలయునని విచారించుట లేదు. ఇకనయినను కాల హరణము చేయక సభ్యులు తగు నిర్ణయము చేయుదురు గాక!

అధ్యక్షులగు లక్ష్మణస్వామి గారు ఆంధ్రోద్యమము ద్వారా గ్రంథాల యోద్యమము విరివిగా వ్యాపించినదనియు ఇక ముందు ఆంధ్ర వికాసమునకు ఇట్టి సంస్థలే మూలాధార మనియు వాక్రుచ్చిరి ఆంధ్ర మహాసభ ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధి కొరకు పాటుపడవలయు ననియు, ఆంధ్రుల ప్రత్యేక

శక్తులు విజృంభింపవయునన్న అన్ని విధముల జీవితమునకు ప్రోత్సాహము కలుగవలెననియు, దీనికి జాతీయ వాఙ్మయము అవసరమనియు, ఇవి యన్నియు స్థాయి సంఘమువారు పూనుకొనవలయు ననియు సూచించిరి

కొన్ని సంవత్సరముల నుండి ఆంధ్రులు రాజకీయ విషయములందే పాల్గొనుచున్నారు కాని సాంఘిక, వాఙ్మయాభివృద్ధి కొరకు శ్రద్ధ వహించుట లేదు. అందుచే ఆంధ్ర మహాసభ నిర్వీర్యమయినది ప్రతి సంవత్సరము సమావేశములు జరుగుచున్నవి, కాని కార్యాచరణలేదు. గత సంవత్సరము మద్దూరి అన్నపూర్ణయ్యగారు కార్యదర్శిగా నియమింపబడుటచే వారు కొంత వరకు మహాసభా తీర్మానములు ఆచరణకు దెచ్చుటకై ప్రయత్నించిరి ముఖ్యముగా కార్యదీక్ష కావలసియున్నది కనుక స్థాయి సంఘము చేయవలసిన పని యెంతేని గలదు

ఆంధ్ర మహాసభ అన్ని ప్రాంతములలో నున్న ఆంధ్రుల అభివృద్ధి కొరకు ప్రయత్నింపవలయును రాజకీయ విషయములలో ఒక ప్రాంతము వారికి వేరొక ప్రాంతము వారికిని భేదమున్నను సాంఘిక, ఆర్థిక విషయములలో భేదము వుండజాలదు ఈ సభ చెన్న రాజధానిలోని ఆంధ్రుల కొరకే ప్రయత్నించినచో అందు విశేషమేమి? ఆంధ్ర దేశములోని కొన్ని ప్రాంతములవారు విద్యాది విషయములలో వెనుకబడి యుండవచ్చును అంత మాత్రమున అట్టి వారిని వేరుపరచుటకు వీలువుండదు వారి అభివృద్ధికి కూడ మార్గము చూపుచుండవలయును అపుడే ఆంధ్ర మహాసభ యనిన ఏ ప్రాంతములో నుండు ఆంధ్రులకయినను గౌరవోత్సాహములు కలుగును. సభానామము, ఉద్దేశము సార్థకమగును. మహాసభవారు ఈ విషయమున శ్రద్ధ వహించెదరా?

---

# ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రుల సన్మాన సభ

## 3-12-1927

మొన్నటి దినమున మన పురోద్యానములోని టౌనుహాలు మందిరము నందు గత వత్సరమున ఉస్మానియా విశ్వవిద్యాలయము నందు పట్ట పరీక్ష లందు ఉత్తీర్ణులైన యౌవనులకు విశ్వవిద్యాలయము నందు పట్ట పరీక్షలందు ఉత్తీర్ణులైన యౌవనులకు విశ్వవిద్యాలయ పక్షమున గౌరవించుటకును, పట్టము లొసగుటకును సభ సమావేశమయ్యెను ఇట్టి సభ సంవత్సరమున కొకమారు ప్రతి విశ్వవిద్యాలయ పక్షమునను జరుపబడుచుండును. దీనిని ఇంగ్లీషున "కాన్వొకేషను సభ" యని పేర్కొనెదరు మన విశ్వవిద్యాలయ పక్షమున జరిగిన ఈ సభ మూడవది.

విశ్వవిద్యాలయ చాన్సెలరులగు శ్రీ రాజా రాజాయాన్, రాజా సర్ కిషన్ ప్రసాద్ బహద్దురు యమీనుస్సల్తనతు గారు గంభీరమగు నొక ఉపన్యాస మును చదివిరి వీని అచ్చు ప్రతులు సభాసదులకు పంచిపెట్టబడినవి. ఈ ఉప న్యాసమునందు మహా ఘనత వహించిన మన ప్రభువుగారి యౌదార్యమును, నవాబ్ హైదర్ నవాజు జంగుగారి సామర్థ్య విశేషములు పొగడబడినవి. మన విశ్వ విద్యాలయము యొక్క ప్రత్యేక లక్షణము ఉర్దూ భాషను విజ్ఞాన సాధన ముగా నుపయోగించుట యని చూసిపి ఇంత మాత్రమున విజ్ఞాన సోపానముల దాటితిమనుకొనుట పొరపాటనియు, ముందు పొందవలసిన అభివృద్ధి ఎంతేని కలదనియు వచించిరి విద్యావంతులకు జీవనాధారములు కల్పించవలసిన విషయము ముఖ్యమనియు మన విశ్వవిద్యాలయమున సాంకేతిక విద్యలకు మంచి స్థానము ఒసగబడవలయు ననియు హిందూదేశము యొక్క రాజకీయ, ఆర్థికాభివృద్ధి, దేశములందు మత విద్వేపములును, హ్రాస్వ దృష్టులను సమసి పోయిననే కాని ప్రాప్తించజాలదనియు నిర్ణయించిరి. సహకార విద్యాశాఖ,

బోధనాభ్యసన శాఖ, ఫ్రెంచి, జర్మనీ మున్నగు ముఖ్య పాశ్చాత్య భాషల శాఖ, పరిశోధన శాఖ ఏర్పరుపబడవలయునని సెలవిచ్చిరి. ఇపుడు భాషాంతరీకరణ శాఖవారు పరకీయ గ్రంథములను కొన్నిటిని ఇంగ్లీషునుండి ఉర్దూలోనికి వ్రాసి పెట్టినంత మాత్రమున చాలదనియు, విశ్వవిద్యాలయపట్టభద్రులు వాఙ్మయమున ఉత్తమ గ్రంథముల ప్రవేశపెట్టి విజ్ఞాన సంపదను వృద్ధిపరచుట తమ ధర్మముగా తలంచవలయుననియు హెచ్చరించిరి. తుదకు పట్టభద్రులను సంబోధించి చెప్పిన వచనములలో మూడే ముఖ్య విషయములు

1 నౌకరి వృత్తిపై ఆధారపడి యుండక ఇతర వృత్తుల నవలంబింపుడు
2 శారీరక స్థితిని బాగుచేసుకొనుడు.
3 స్వయం సహాయ సూత్రము నమ్ముడు
అనునవియే ఆ ముఖ్య విషయములు

ఈ మహోపన్యాసములోని ప్రధాన సూత్రమొకటి ప్రభుత్వమువారును, దేశీయులును జ్ఞప్తియందు వుంచుకొనదగియున్నది అదేదన

"...కాని ఏ దేశము నందైనను విద్యాభివృద్ధి కేవలము ప్రభుత్వము యొక్క ప్రయత్న మాత్రమున జరుగలేదు యూరోపు ఖండములోని విశ్వవిద్యాలయముల మాట చెప్పవలసిన పనిలేదు. బ్రిటిషు హిందూ దేశములోని ప్రభుత్వమువారి విశ్వవిద్యాలయములకు కూడ ఎన్నోయో విరాళములు గొప్ప గొప్పవి లభించినవి"

ఈ సూత్రమును మహా ఘనత వహించిన మన ప్రభుత్వము యొక్క విద్యాశాఖవారి దృష్టిని ఆకర్షింపదగినది గడచిన 50 సంవత్సరములలో విద్యాశాఖవారు చేసిన పని దేశమునందు నూటిలో ముగ్గురుకంటె నెక్కువ మందికి వ్రాయను, చదవను నేర్పుటకంటె ఎక్కువగ లేదు. నూటికి 97 మంది నిరక్షరులై యజ్ఞాన దశ యందున్నారు వీరికి విద్య లభించి మానవ నామమునకు అర్హులు కావలయునన్నచో ప్రజా సహాయము లేకుండ సంభవించదు ప్రజా సహాయమునకు ఆటంకములగు విద్యా శాఖవారి శాసనములను ప్రభుత్వము వారు రద్దుపరచినగాని ప్రజా సహాయము లభింపదని మా అనుమానము విద్యాశాఖవారు ఇపుడైనను తమ పొరపాటును శ్రద్ధ వహింతెదరా!

---

# కాంగ్రెసు కర్తవ్యము

**28-12-1927**

భారతదేశ స్వరాజ్య సమరమున 1928 వ సంవత్సరము యొక్క ప్రాముఖ్యత నిర్ణయింప నేటి దేశీయ మహాసభ యొక్క బాధ్యతమై యున్నది. 1927 వ సంవత్సరమున 'స్వదేశీ' ఉద్యమము ప్రారంభమయ్యెను. 1914 వ 'హోము రూలు' ప్రచారము రగులొ్కనెను. 1921 వ అసహాయోద్యమము ప్రబలెను. ఈ జాతీయ ఝంఝూ మారుతములు సక్రమమగు పథము నేమనటుల బోధించి శాసించి కాంగ్రెసు వన్నెకెక్కినది. 1928 వ సంవత్సరము కూడ నొక సంధిసమయము. భారతవర్ష స్వరాజ్యార్హత నిర్ణయింప సైమను కమీషను వచ్చుచున్నది. గత భారతదేశ స్వాతంత్ర్య సౌభాగ్యమో లేక దాస్య దౌర్భాగ్యమో నేడు పరిష్కారము కాగలదు. ఈ పరిష్కారము శుభ ప్రదముగ చేరుపుట నేటి కాంగ్రెసు కర్తవ్యము.

సైమను కమీషనుపట్ల భారతీయులు ఎట్లు ప్రవర్తింపవలెను? సహకారమా? బహిష్కారమా? ఇది ప్రస్తుతపు ముఖ్య సమస్య. కొందరొక పద్ధతియు మరి కొందరు వేరొక పద్ధతియును అవలంబించిన దేశమునకు అనర్థము. అన్ని సంఘములు తమ శక్తులొకచో క్రోడీకరించి, ఏక దీక్షతో, దేశవిముక్తికై పాటుబడినగాని లాభము లేదు. ఇట్లు ఈ సంఘములకు మైత్రిని, ఐకమత్యమును, కార్యదీక్షయు నొసగుట కాంగ్రెసు విధియైయున్నది. సాంఘిక స్పర్ధలు, రాజకీయ కక్షలు, మతవైషమ్యములు వీటి నన్నిటిని మ్రింగివేయగల దేశభక్తి ప్రతిమనుజుని హృదయములోను కాంగ్రెసు నెలకొల్పి ప్రజ్వలింపవలెను.

కేవలము తీర్మానములు వలన లాభములేదు. ఆ తీర్మానములు వలన లాభములేదు. ఆ తీర్మానములు కార్య రూపముగ పరిణమింపవలెను. ఆశయముల పైకంటె సాధనములపై నెక్కుడు లక్ష్యముంచవలెను. అప్పుడే ఈ సమావేశములకు, చర్చలకు ప్రయోజనము వుండగలదు. ప్రస్తుతము సమావేశమయిన దేశీయ మహాసభ యీ ఐకమత్యము నొనగూర్చి, జాతీయాభిమానము పురిగొల్పి, సక్రమ సాధన సంపత్తి నొసగి, దేశవిముక్తికి కారణభూత మగుగాక!

---

# ప్రజా ప్రబోధము

## 1-2-1928

మన ప్రధానమంత్రి గారగు మహారాజా బహద్దరు గారు గత వారమున చేసిన పర్యటన సందర్భమున జిల్లాలోని ప్రజలు వారి కర్పించిన వినతి పత్రములును, విజ్ఞాపనములును, మన రాష్ట్రిమున ప్రజలందు క్రమముగా కలుగుచున్న ప్రబోధమునకు నిదర్శనమై ఒప్పారుచున్నది గుల్బర్గా నగరమున న్యాయవాదులు, వర్తకులు, విద్యాశాఖాధికారులు, హిందూ ప్రజలు, మిల్లులవారు వేర్వేరుగా వినతి పత్రములను అర్పించుకొనిరి అట్లే ఉస్మానాబాదు ప్రజలును సర్వతో ముఖముగ నొక వినతి పత్రమును ప్రధానమంత్రి గారి కొసగి తమ కష్ట నిష్ఠురములను ప్రభుత్వమున కెరుక పరచిరి.

ఈ పర్యటనమున ప్రజలు వినతిపత్రముల ద్వారా తమ యాశయముల ప్రభుత్వము వారికి తెలుపుట ముఖ్యముగ వెనుకబడియున్న మన రాష్ట్రి ప్రజల విషయమున ఒక నూతన పద్ధతి యని చెప్పవచ్చును. మన చుట్టుపట్టుల నున్న బ్రిటిషు ఇండియాలోను, నాగరికములగు ఇతర దేశీయ సంస్థానము లందును, ప్రజలు తమ కోర్కెలను, అవసరములను ప్రభుత్వము వారికి ముఖాముఖిగా తెలియజేసి వారి వలన ప్రత్యుత్తరముల బడయుటకు శ్రేష్ఠములగు పద్ధతులు కలవు సభలలో ప్రతినిధులు ప్రభుత్వము వారిని ప్రశ్నలు అడిగి వెంటనే వారి యుత్తరములను బడయు విధానమున్నది. కాని మన శాసన సభ యింకను అట్టి సంస్కార మొందనందున, మనము ప్రజా పక్షమున కష్ట నిష్ఠురములను పత్రికలందు వ్రాసికొని సంతసించుట తప్ప మన మొరలను ప్రభుత్వము వారికి తెలుపుకొనుటకును వీలు లేక యున్నది ప్రభుత్వము వారేమి సెలవిచ్చెదరో తెలిసికొనుటకును వీలులేక యున్నది ప్రభుత్వము వారేదేని సంస్కరణ మొనర్చినచో మన కోర్కెకు, విజ్ఞాపనమునకు ప్రత్యుత్తరము వచ్చినదని సంత సింప వలసినదే కాని, ప్రభుత్వోద్దేశములను తెలిసికొనుటకు ఎట్టి సాధనము

మన చేతులతో లేనందున, దయామయులగు ప్రభుత్వము వారి సానుభూతి వాక్యములను వినజాలకుంటిమి ఇట్టి లోపమును ఒక విధముగ తొలగించుటకు వినతి పత్రములు అర్పించి ప్రత్యుత్తరము బడయు నీ నూతన పద్ధతి చాల మంచిదని మా తలంపు. ఈ పద్ధతినే, ప్రతి జిల్లా ప్రజలను ప్రతి తాలూకా ప్రజలను, ప్రధానమంత్రిగారు గాని శాఖ మంత్రులు గాని తమ ప్రాంతములకు దయచేసినప్పుడు అవలంబించు చుండినచో చాల ఉపయోగకారి కాగలదు.

మన ప్రధానమంత్రిగారి యెదుట చెప్పుకొనబడిన ప్రజావసరములను మూడు విధములుగ భాగింపవచ్చును 1. స్థానికావసరములు 2. ప్రత్యేక సంఘ అవసరములు 3. ప్రజావసరములు

మొదటి వానిలో రోడ్లు, నీటి వసతులు వెలుతురు ముఖ్యముగువాని యేర్పాటులు చేరియున్నవి ఇవి ఆ స్థలము వారికే సంబంధించి యుండును కనుక ఇవి అన్నిటికంటె ముఖ్యములు, సులభముగా తీర్పదగినవియు. రెండవ వానిలో, ప్రజలలోని ఒక ప్రత్యేక సంఘమునకు మాత్రము సంబంధించిన విషయములు గలవు గుల్బర్గాలోని హిందూ ప్రజలు హిందువులకు గల కష్ట నిష్ఠురములను, అవసరములను తెలుపుకొని యున్నారు. తాము ప్రజా సమూహములలో నూటికి 83 మంది చొప్పునగల గొప్ప సంఘమై యుండినను, తమకు గొప్ప యుద్యోగములు లభింపకుండుట, మునుపు దొరకుచుండినవియు తక్కువ యగుట, తమ మత విషయిక కార్యములకు ఆటంకములు కలుగుచుండుట, తమ తమ సంబంధ సమస్యలను పరిష్కరించుటకు ప్రభుత్వము వారి మత శాఖ (ఉమూరే మజహబి) లో ఒక హిందూ అధికారి నియోగింప వలయుననుట ఇటీవల నాశనము చేయబడిన దేవాలయములను బాగుచేయ వలయుననుట మున్నగునవి మనవి చేసికొనియున్నారు. ఇట్లు తమ కోరికలను ప్రభుత్వము వారికి మనవి చేసికొనుటలో హిందువులు మంచి మార్గము నవలంబించిరి. అడిగిన గాని అమ్మ కూడ పెట్టదు కదా! ప్రభుత్వమువారును వాని విషయమున ఎంత త్వరగా శ్రద్ధ వహించిన అంత మంచిదని మా యభిప్రాయము.

మూడవ వానిలో మన రాష్ట్రములోని అన్ని తెగలవారికిని, అందరికిని, సంబంధించిన విషయములు కలవు. 1. లోకల్ ఫండు సహాయాన సభా

సదులను ప్రజలు ఎన్నుకొను పద్ధతి ప్రవేశపెట్టవలయుననుట ఇంతవరకు నీ సభలలో ప్రభుత్వ నియోజితులేయున్నారు ప్రారంభదశలో ఇది అవసర మయినను నేడు అట్టి యవసరము లేదనవచ్చును గత నలువది వత్సరముల నుండి యీ సభలలో అధికారేతర సభాసదులను కూడ ప్రభుత్వాధికారులు ఏర్పరచుచున్నారు. కాని యింత మాత్రము చాలదు. ఈ తాతల నాటి పద్ధతిని వదలి యిప్పుడు నాగరిక రాష్ట్రములలోనున్న పద్ధతిని ప్రవేశపెట్టవలయునని ప్రజల కోర్కె 2 పెద్ద బస్తీలలో మజ్లీసె సఫాయీ (మునిసిపాలిటీ)లను స్థాపించవలయుననునది ఇప్పుడిట్టి మజ్లిసు హైద్రాబాదునందు మాత్రము కలదు. అదియు సంపూర్ణ దశలో లేదు అస్వతంత్ర స్థితిలోనున్నది దానిని గూర్చి చిత్తు శాసనము గడచిన 30 ఏండ్ల నుండి మన శాసన నిర్మాణ సభలోపడి యున్నది బ్రిటిషు ఇండియాలో 5 వేల జన సంఖ్య కంటే మించిన ప్రతి బస్తీ యందు ఇట్టి సంఘములున్నవి కనుక మనవారును అట్లు చేయించవలయునని ప్రార్థించుచున్నారు 3. శాసన నిర్మాణ సభా సంస్కరణము అనగా దీనిలో ఇప్పుడున్నట్టు గాక ప్రజాప్రతినిధులను ఏర్పరుపవలయుననియు, ప్రజాశయ ములు ఈ విషయమును ఇదివరకే మహా ఘనత వహించిన మన ప్రభుత్వము వారు ఏడేండ్ల నుండి ఆలోచించుచున్నారు. ఉత్తమ పరిపాలనమునకును నిదర్శనములగు నీ సంస్కారములను ప్రభుత్వమువారు త్వరలో ప్రసాదించ గలరని మా యభిప్రాయము 4 విద్యా విషయములు. ఖాస్గీ పాఠశాలల విషయమున చేయబడిన నిర్బంధ శాసనమును రద్దుచేయుట, ప్రారంభ విద్య, మాధ్యమిక విద్య విద్యార్థి యొక్క మాతృభాషలోనే గరుపబడవలయుననుట, ప్రారంభ విద్య ప్రజా స్వాధీనముచేసి ప్రభుత్వమువారు సహాయము మాత్ర మొసగుట మంచిదనుట మున్నగునవి సూచింపబడినవి

ఇట్లు ప్రజలు ప్రభుత్వమువారి ముఖాముఖిగా అడుగ గలుగుట నూతన మైన ప్రజా ప్రబోధముగ భావించుచు దీనికి కారకులగు వారిని మేము మనః పూర్వకముగ నభినందించుచున్నాము.

---

# సంఘ దౌర్బల్యము

**8-2-1928**

ఇందూరు మహారాజు గారు మరల పత్రికల చర్చలలో ప్రధానులైరి. వీరికిఇదివరకే ఇద్దరు భార్యలున్నారు ఇంతటితో నిలువక వారు అమెరికా కన్యను వివాహమాడ నెంచినారు క్రైస్తవ న్యాయానుసారముగా నొక పురుషుడు ఒక స్త్రీ కన్న నెక్కుడుగా స్త్రీలను వివాహమాడరాదు. కాని హిందూ, మహమ్మదీయ మతములలో నిట్టిది ఎంతవరకు అయినను సాధ్యమై యున్నది. కావున మహారాజు గారు ఈ అమెరికా స్త్రీని హిందూ మతములో జేర్చి మూడవ వివాహమును గావింప నిశ్చయించిరి.

హిందూ సంఘములో నెవ్వరును ఈ స్త్రీని శుద్ధిచేసి హిందువుగా జేయ సమ్మతింప మిచే ముసల్మాను సంఘము వారు వీరిరువురిని ముసల్మానులనుజేసి వివాహము చేయుటకు అంగీకరించిరట ఈ వార్త కొందరి హిందువులకు రుచించదయ్యెను. తమ మతము యొక్క జనాభాలో నిద్దరు తగ్గిపోవుదురను భీతిచే మహారాజు గారికి తమ భావి వధువును హిందూ స్త్రీనిగా మార్చెదమని ఆహ్వాన మంపినారు.

ఈ వార్తలను జూచిన సత్యాన్వేషణ పరులందరు విచారపడ వలసి యున్నది. నేడు ప్రపంచములో మతములన్నియు సంఖ్యను వృద్ధిచేయ గోరు చున్నవి గాని ప్రపంచమును వృద్ధి చేయ గోరుట లేదు ఈ కన్య కామమే ప్రధానము కలదై మతాంతరము స్వీకరించుచున్నదే కాని క్రైస్తవ మతమున కన్న హిందూ మతములో విశేషములు వున్నవని యెంచి మత స్వీకారము చేయుట లేదు. ఇట్లు చేయుట వలన నామె కుభయ మతములు కూడ బోధ కాలే దని విశదమగును.

పైగా హిందూ మహమ్మదీయులు మత వ్యాప్తితో పరస్పరముగా పోటీలు కలిగియుండుట యుభయ సంఘములకు నష్టదాయకముగా నున్నది. సంఘము వృద్ధి కావలయుననిన మతములోని లోపములను బాపికొనవలయునే కాని లోపములను మతములో వృద్ధి చేయకూడదు

## ఆంధ్రోద్యమము :

ఈ రాష్ట్రమందలి యాంధ్రోద్యమమును గురించిన విషయములు వేరుచో ప్రకటింపబడినవి. నిజాం రాష్ట్ర ఆంధ్రులలో నిరుత్సాహమునకు ఇపుడు అవసరమేమియు గనబడదు న్యాయబద్ధులై సంఘాభివృద్ధికి మార్గదర్శకములగు ఉద్యమముల నెవ్వరును ప్రతిఘటింపజాలరు. ఉన్నత న్యాయస్థానపు తీర్పు ఇప్పుడందరకును తెలిసిన విషయము. అట్టిచో వాఙ్మయాభివృద్ధికిని, సాంఘికాభివృద్ధికిని, ప్రభుత్వోద్యోగులు ఆటంకములు కలిగింపనేరరు కొంత కాలము క్రిందట హైద్రాబాదులో జరిగిన హిందూ సాంఘిక మహాసభలో ఆంధ్రులు చాలా కొలదిగా నుండి యుండిరి. దీనివలన మనము మహారాష్ట్ర సోదరుల కన్న వెనుకబడి యున్నారమని విశదమగును. కావున ఇకముందైనను మనమీ లోపములను బాపికొనవలయును. రాష్ట్రీయ ఆంధ్రులు అందరును శ్రద్ధ వహింతురు గాక.

---

# స్త్రీ విద్యా మహాసభ

## 15-2-1928

స్త్రీల యభివృద్ధి యెడ నానాటికి శ్రద్ధ హెచ్చుచుండుట సంతోషకరము. అందును, తమ అభివృద్ధికై పురుషులపైననే ఆధారపడియుండక, స్త్రీలు తమంతట తామే ప్రయత్నములు సలుపుచుండుట ప్రశంసార్హము, శుభకరము. కొలది కాలమునుండి, ప్రతి యేడును ఏదియో యొక స్త్రీల సమావేశము జరుగుచునే యున్నది. తీర్మానములలో తమ ఆశయములను, కోరికలను ప్రకటించుచు సంఘమున సంచలనము కలిగించుచునే యున్నారు. కానీ తదితర సమావేశముల కంటె మొన్నటి ఢిల్లీ సమావేశము కొన్ని విషయములలో నెగడదగినది. ఆలీగఢ్ విశ్వవిద్యాలయమునకు వైస్ ఛాన్సలర్‌ను, స్త్రీల అభ్యున్నతికై, విద్యా వ్యాప్తికై నిరంతర కృషి సలుపుచున్న భోపాలు మహారాణిగారీ సమావేశమునకు అధ్యక్షత వహించుట యెంతయు అదృష్టమనవచ్చును. అదియును గాక పాశ్చాత్య విజ్ఞాన పారీణయగు ఇర్విను ప్రభ్వి తమ అమూల్యమగు సందేశము నొసగి, ఈ సమావేశ సమాలోచనములకు వన్నెదెచ్చిరి. భారతదేశమందలి వివిధ ప్రాంతముల నుండి ప్రతినిధులు విచ్చేసి ఈ సభ యందు పాల్గొని, విపుల చర్చ యనంతరము గావింపబడిన తీర్మానములకు విలువను ఆపాదించిరి

స్త్రీలకు విద్య అత్యవసరమనియు, విద్యా వ్యాప్తికి పలు భాషలు, పేదరికము, అజ్ఞానము, ఉపేక్ష, ప్రతికూల ప్రజాభిప్రాయము, సాంఘిక నడతలు, ఆచారములు, రాజకీయములు, అంతరాయములు కల్పించుచున్న వనియు, బాల్య వివాహము, ఘరదాపద్ధతి నిరసించవలెననియు, ధృవపరుచుటలో విశేషమేమియు లేదు ఇవి యందరికి తెలిసిన విషయములే ఇందు ప్రశంసింప దగిన దేమియు లేదు.

ఈ సమావేశమును ముఖ్యముగా మూడు విషయములకై మేము అభినందించుచున్నాము. అందు మొదటిది బాలికలకు నిర్బంధ ప్రాథమిక విద్య ముఖ్యమని నిర్ధారణ చేయుచు, దీనికై ప్రభుత్వము వారిని, స్థానిక సంఘము

లను, తగిన ఆర్థిక సౌకర్యముల నొసగవలెనని కోరునది కేవలము అస్పష్టముగ, ప్రయోజన హీనముగ, విద్య కావలెనని ఉపన్యాసములిచ్చి తనివిజెందక యా కోరిక కార్య రూపముగ ఫలవంతమగుటకు గాను ప్రభుత్వమును హెచ్చరించుట సమంజసము. స్థాయి సంఘము వారి తీర్మానమును అనుసరించి విద్యాశాఖాధికారులకు ఒత్తిడి కలుగజేసినచో మంగళకరమగు ఫలితములు బడయ వచ్చును.

ఈ సందర్భమున భోపాలు మహారాణి గారి సూచన యెంతయు బొగడదగియున్నది ప్రభుత్వము వారు పూనుకొనిన వరకు చేతులు ముడుచుకొని చేచియుండుట యుక్తము కాదు. అదియునుంగాక భారత ప్రజలు కడుపేదవారు. సగటున ఒక్కొక్కరికి నెలకు రూ. 2-8-0 మాత్రమే ఆదాయమని గమనించవలెను. ఇట్టి తఱి, ప్రతి గృహస్థును తమ బిడ్డల విద్య గూర్చి తగినంత ధనము వెచ్చింపలేడుగదా! ఇట్టి నిరుపేదల కొరకు ఒక మంచి పద్ధతిని మహారాణి గారు సూచించియున్నారు. విద్యావతి యగు ప్రతి స్త్రీయును తన తీరుబడి కాలములో కొంత సమయమీ బీద బిడ్డల బోధనకై వినియోగించినచో దేశమునకు అమూల్యమగు సేవచేసిన వారగుదురు. దీని వలన ప్రస్తుతపు పాఠశాలల కొరతయు, ఉపాధ్యాయుల కొరతయు కొంత వరకు దీరును

స్త్రీ విద్యా నిరూపణ గూర్చి జరిగిన చర్చ కొనియాడదగిన రెండవ విషయము. నేటి బాలికల విద్యావిధానము, బాలుర విద్యావిధానమునే అనుకరించి యున్నది ఇది సరియయిన పద్ధతి కాదు దీని వలన స్త్రీ విద్య యొక్క ముఖ్యాశయములు విఫలమయి పోవుచున్నవి శారీరక, మానసిక, నైతికాభివృద్ధికి దోడ్పడునది విద్య పురుషుల ప్రయత్నములకు చేదోడు వాదోడుగ నుండి, కష్ట సమయములలో నాదరణ నొసగుచు, గృహమును శాంతి సుఖధామముగ చేయుటకుగాను విజ్ఞాన వికాసము నొసగుట స్త్రీ విద్య యొక్క ముఖ్యాశయము. పురుషుల కొరకు ఏర్పరచబడిన విద్యా విధానమును అనుసరించి యుండినచో, స్త్రీ విద్య యీ ఆశయమును పూర్తిచేయజాలదు అట్టి విద్య నిష్ఫలము.

స్త్రీల యవసరములు వేరు. వానిని గుర్తెరిగి తదను గుణ్యముగ విద్య గఱపవలెను. అనుదిన జీవనమున కుపయోగపడునట్టుల గృహమేధి అర్థ

శాస్త్రము, (Domestic Economy) ఆరోగ్య సూత్రములు, చేతి పనులు మున్నగునవి వీరికి తప్పక గరుపవలెను తదుపరి కళలు, శాస్త్రములు మొదలుగా గల ఉన్నత విద్యలు వలయువారు అభ్యసించుటకయి ప్రత్యేకముగ ఏర్పాటులు చేయవచ్చును విద్యా విధానములో ఇండియా నేడొక మార్గ సంధిని జేరి యున్నది. ఇక మీదట స్త్రీలు ఏ మార్గము నవలంబించవలెనో నిశ్చయించునెడ పై విషయమును శ్రద్ధతో గమనించవలెను.

ఇక మూడవ విషయము ఉపాధ్యాయినుల ఆవశ్యకత బోధకులు (Teachers) సభ్యతా సూత్రధారులు. ఏ జాతి ప్రతిభయైనను వీరి కృషి ఫలితమే చిన్న పిల్లల బోధనకు పురుషులకంటె స్త్రీల నియోగించుట శ్రేష్ఠము. శాంతి, సహనము, సానుభూతి వీరియందు ఎక్కువ అందుచే చిన్నపిల్లల మనో వైఖరిని గ్రహించుట యందును, తదనుగుణ్యముగ బోధించి పాఠముల నచ్చ జెప్పుటయందును వీరు విజయవంతులుగ నుందురు. ఈ యవసరమును, బాలికా పాఠశాలల యవసరములను, పూర్తిజేయుట కెందరో సుశిక్షితులగు ఉపాధ్యా యినులు కావలసియున్నారు ఒక స్త్రీ కేవలము పరిజ్ఞానమున్నంతమాత్రముననే సద్బోధకురాలు కానేరదు. దీర్ఘ దృష్టి, స్వార్థ త్యాగము, వృత్తియందు శ్రద్ధా భక్తులు, కలిగియుండవలెను. విద్యా బోధన అత్యుత్తమ వృత్తి యనియు దాని నవలంబించుట గౌరవ ప్రదమనియు ప్రతి బోధకురాలును నమ్మి కార్యమునకు ఉపక్రమించవలెను అప్పుడే వారి కృషి దివ్యమగు ఫలితములకు కారణమగును. ఈ ఉన్నత పదవిని స్వీకరించుటకు ఉత్తమ తరగతుల స్త్రీలు పూనుకొన వలెను. ఈ వృత్తి యెడ నేడుగల తూష్ణీం భావము మాని, భక్తి మర్యాదలతో జూచి, బోధకులకు సౌకర్యములు కలిగించుచు, ప్రోత్సాహము నొసగిన గాని ఈ అవసరము పూర్తి కాజాలదు. అంతవరకు విద్యా వ్యాప్తికి నిరోధము కలుగుచునే యుండును. కాన ఈ బోధకుల శిక్షణ కొరకు ప్రభుత్వము వారు బోధనాలయముల స్థాపించు నటుల స్త్రీ విద్యా సంఘము వారు ఒత్తిడి కలిగించ వలెను.



# మూడవ తరగతి ప్రయాణికులు

## 3-3-1928

ఉన్నవారి కందరు బెట్టుదురు అయ్యాపెట్టును, అమ్మ పెట్టును, బంధువులు పెట్టుదురు, మిత్రులు పెట్టుదురు, తుదకు ప్రభువువారు కూడా పరామర్శింతురు కాని లేనివారిని అడుగు దిక్కులేరు. వారు నోరు విడిచి వేడినను వినుదాతలు లేరు. ప్రభుత్వము మూడవ తరగతి రైల్వే ప్రయాణికుల పట్ల అవలంబించు కార్యపణతి కూడ నిట్లేవున్నది.

మూడవ తరగతి ప్రయాణికుల ఇబ్బందులు మూడుగా విభజింపవచ్చును. అందు మొదటిది రైల్వే చార్జీలు. గత దశ సంవత్సరములలో రైల్వే చార్జీలు క్రమక్రమముగా హెచ్చిపోయెను. ఇది ప్రయాణీకులకు, ముఖ్యముగా మూడవ తరగతి ప్రయాణికుల కెంతయో కష్టము కలిగించెను ఫ్రాన్సు, జర్మనీ ఇంగ్లండు మున్నగు దేశములకంటె మన దేశమతయో పేదది. మన దేశమున సుమారు 10 కోట్ల మంది తిండిలేక మలమల మాడుచున్నారని మొన్న మొన్ననే శాసన సభలో లాలా లజపతిరాయి గారు ప్రకటించిరి అయినను యూరోపు దేశములన్నిటిలో కంటె మన దేశమున రైల్వేలో సౌకర్యములు తక్కువగనున్నను, చార్జీలు మాత్రము ఎక్కువగ నున్నవి ఇది మన దురదృష్టము. కానీ ప్రభుత్వము వారీ కష్టమును తొలగించుటకు ప్రయత్నింపకుండుట శోచనీయము 1927-28 సంవత్సరమున రైల్వేవలన 12 కోట్ల 75 లక్షల రూపాయలు లాభము కలిగినది. ఇది పూర్వపు వత్సరము కంటె 3 కోట్ల 75 లక్షలు అధికము. అందుచే నార్తు వెస్టర్న్, ఈస్టు ఇండియను, గ్రేటు ఇండియను పెనిన్సులారు రైల్వేలలో చార్జీలు కొంతవరకు తగ్గింతురట తక్కిన రైల్వే కంపెనీలతో చార్జీలను తగ్గింప ఉత్తర ప్రత్యుత్తరములు మాత్రము జరిపెదరట. కానీ ఈ ఉత్తరములవలన నెట్టి లాభమును గలుగదు ప్రభుత్వము వారు పట్టుదలతో వీటి విషయమై శ్రద్ధ వహించి కంపెనీల వారికి ఒ తిడి

కలిగించినగాని ఎట్టి ప్రయోజనము నుండదు. అదియునుం గాక పై మూడు రైల్వేల లోన 50 మైళ్ళకు మించిన ప్రయాణములకు మాత్రమే మైలుకు నాలుగు దమ్మిడీల చొప్పున తగ్గింతురు కాన ఇది బీదలకు, పేద రైతులకు ఉపశాంతి నొసగ జాలదు. మన రైతుల ప్రయాణములు సర్వ సామాన్యముగా 50 మైళ్ళ లోపునే యుండును అట్టి తరి ఈ క్రొత్త ఏర్పాటు వలన చాలినంత మేలు కలుగుట లేదు.

ప్రయాణికుల రెండవ కష్టము రైల్వేయుద్యోగుల వలన సంభవించు చున్నది. బుకింగు క్లర్కులు, టిక్కెటు కలెక్టరులు స్టేషను మాస్టరుల అక్రమ చర్యలు అందరికి దెలిసినవే. పెద్ద కుటుంబములు తీర్థయాత్రలకు వెడలుతరి, వారికి సౌకర్యముగా ఒక కంపార్టుమెంటునో, డబ్బానో ఏర్పాటుచేయుటకు ఎన్నియో పాట్లు పడుదురు. ట్రెయిను ప్లాటు ఫారము మీద వున్నప్పుడు, అతు రత తోడ బరుగెత్తుకొని వచ్చి టిక్కెటు వేడు పల్లెటూరి రైతు చిక్కులను వారినే విచారించవలెను. దారిని బోవు ప్రయాణీకులను ఎక్కువ సామానున్న దని పీడించి, దక్షిణ సమర్పించనచో, వారి ప్రయాణమునకు ఆటంకము గలి గించుట కొన్ని సందర్భములలో కలుగుచున్నది దినుసులు ఎగమతి చేయుట కును గాను గూడ్సు వాగినులను కోరు వర్తకులు, స్టేషను మాస్టరుల దాసాను దాసులు. ఇటువంటి ప్రవర్తనమును పరిశీలించి, నిందితులను శిక్షించు టకుగాను ఒక విచారణ సంఘమును ఏర్పరచవలెనని జోషిగారు కోరిరి. ఈ చర్యలను శ్రద్ధతో పరిశీలింతునని వాగ్దాన మొసగుచు, ఇట్టి సంఘమవసరమని రైల్వే శాఖాధికారి త్రోసివేసెను ఈ వాగ్దానము ఎంతవరకు నెరవేర్తురో చూడ వలసి యున్నది.

మూడవది ప్రయాణికుల సౌకర్యములకు సంబంధించినది మొదటి, రెండవ తగరతి ప్రయాణికుల నుండి వచ్చు డబ్బు కంటె మూడవ తరగతి వారి వలన వచ్చు డబ్బు పది రెట్లు అధికమయినను, రైల్వేవారు వీరి సౌకర్య మును బాటించుట లేదు. తగినన్ని డబ్బాలు వుంచకపోవుట చేత, సుఖముగా కూర్చుండుటకు కూడ తావు దొరకుట లేదు స్టేషనులో మంచినీటి వసతి గాని, మరుగుదొడ్డి సౌకర్యములు గాని సరియైనవి లేవు. తిను పదార్థములు, వెయి టింగు రూములు, ఎంత అపరిశుభ్రముగ నుండునో అందరికి అనుభవమే. ఇట్టి

హీనపు స్థితిగతులను చక్కబరచుటకు రైల్వే మంత్రిగారు ఎట్టి ఏర్పాటును జేయరైరి సానుభూతి మాత్రము కొరతలేకుండా ప్రకటించిరి కానీ దీని వలన గలుగు లాభమేమి ?

నిజాం రైల్వేలో గూడ పైన పేర్కొనిన ఇబ్బందులు గలవు. బెజవాడ నుండి ప్యాసింజరు బండిలో ప్రయాణము చేయువారికి, నోరు ఎండి ప్రాణము పోయినను, అనేక స్టేషనులలో గ్రుక్కెడు మంచినీళ్ళు దొరకుట దుర్లభము. సికింద్రాబాదు స్టేషనులో ప్రయాణీకులు ఎండలో మలమల మాడవలసినది గాని ప్లాటుఫారము మీదగాని, వంతెన మీదగాని కప్పు లేదు. టిక్కెట్టు కలెక్టరుల జులుము అందరకు విదితమే అన్ని రైల్వేల కంటెను ఈ రైల్వే కంపెనీ వారికి లాభమెక్కువగా నున్నది కానీ రైల్వే చార్జీలలో చిల్లిగవ్వ యైనను తగ్గించుట లేదు. దీని గూర్చి ప్రభుత్వము వారు కొంతలో కొంత శ్రద్ధ పుచ్చుకొనిననే గాని పరిస్థితులు మారవు

---

# బాల్యవివాహ నిషేధము

## 11-4-1928

"సోదరులారా! తేజోరాసులగు పురుష సంతతికై ప్రార్థింపు"డని వివేకానందుడు భారతీయుల నుద్బోధించెను. కాని తేజోమతులగు మాతలు లేనిదే సారవంతమగు సంతతి గలుగుటెట్లు? ముక్కుపచ్చలారని బాలికలకు పుస్తె కట్టుచున్నప్పుడు విజ్ఞానహీనులగు భార్యలు, వికాస దూరులగు మాతలు, నిర్బంధ బాలవిధవలుతప్ప వీరమాతలు ఎటునుండి వత్తురు?

బట్ట కట్టుటకూడ నెరుగక, మూర్తీభవించిన ప్రకృతి దేవతలవలె జీవించు వన్యజాతులలోగూడ లేని యీ ప్రకృతి ధర్మ విరుద్ధమగు దురాచారము హిందూసంఘము నావేశించి, పీల్చి పిప్పి చేయుచున్నది. బాల్యవివాహముల మూలమున హిందూజాతి శారీరక బలము క్రుక్కిపోవుచున్నది; మనోవికాసము మరుగువడి పోవుచున్నది, నైతికదృష్టి నీరసించి పోవుచున్నది, దాంపత్య సౌఖ్య మడుగంటుచున్నది, సంఘశాంతి విలోపమగుచున్నది ప్రతి సంవత్సరము నీ ఘోర పిశాచమునకు వేలకొలది అమాయక బాలికలు బలియయి, తమ యావ జ్జీవమును దుర్భర దుఃఖముతో గడుపుచున్నారు మూఢవిశ్వాసములకు బలి యగుచున్న విధవల సంఖ్య నానాటికి పెరిగిపోవుచున్నది. 1921 వ జనాభా ప్రకారము, 5 సంవత్సరముల లోపలనే భర్తలను కోల్పోయినవారు 19 వేలును 5 నుండి 10 సంవత్సరముల లోపువారు 85 వేలును, 10 నుండి 15 సంవత్స రములవారు 234 వేలును గలరు మొత్తముమీద స్వయంకృతాపరాధమేదియు లేకనే దుర్భర వైధవ్య దుఃఖము ననుభవించుచున్నవారు 329 వేలమందిగలరు. తరుణుల కంటి నీటిచే మసిబట్టిన వంటయిండ్లు తడుచుచున్నంతకాలము హిందూ జాతికి శుభము చేకూరదు

బాల వితంతువుల వివాహము పేరెత్తినచో ఆర్య ధర్మములు అడుగంటి పోవునని పూర్వాచార పరాయణులు గగ్గోలు పెట్టుదురు. కాని ఆర్య ధర్మములను

శ్రద్ధతో పాటించుటకు ప్రోత్సాహమొసగుచు ఆర్య గృహములకు వన్నె దెచ్చు వివాహ విధానమును ఈ పూర్వాచార పరాయణులు ఏల అంగీకరింపరో తెలియకున్నది

ఈ పూర్వాచార పరాయణుల స్వస్తత్వము కడు చోద్యమయినది. చీమలకు నూకలు వేయుదురు, పాములకు పాలు బోయుదురు, పిట్టలకు ధాన్యము జల్లుదురు, గోరక్షణకయి ప్రాణము లర్పింతురు, కాని తమ కూరిమి బిడ్డలు కలకాలము దుఃఖమున మాలు చుండ నించుకేనియు చలింపరు. ఇతరు లెవరైన ఈ అమాయకపు కన్యల వెతల బాప యత్నించినచో వారిపైబడి హింసింతురు. వీరు బాల్యవివాహమును నీతితో ముడివైతురు ఈ నీతిని మతముతో పెనవైతురు. ఈ మతమను కొరడాను బుచ్చుకొని స్త్రీ జాతి నంతటిని చావగొట్టు చున్నారు వారి శరీర పాటవమును అణచి వేయుచున్నారు, స్వాభిమానము చంపివేయు చున్నారు, మనో వికాసమును మూల ద్రొక్కుచున్నారు

కాని యీ దురాచారదాసుల యధికారము చిరకాలము సాగనేరదు హిందూ సాంఘికులు మేలుకొని, యిట్టి సాంఘిక దౌర్జన్యములను దాపుటకై సత్వరముగ ప్రయత్నించిననే గాని హిందూ సంఘము నంతటిని మొదలంట కలచివైచి కలవర పరచు యువతీయువకుల తిరుగుబాటు జరుగ గలదు సామాన్యపు యోచనాపరుడగు ప్రతివాడును ఉత్తమ సాధ్వులు, వీరమాతలు కాగల తరుణీమణుల కాంతివంతములగు జీవితములు శుష్క జీవితములుగను, నిరర్థకములుగను, పరిణమించుట జూచి సహింపజాలడు, జాలిగుండె గలవాడెవ్వడును ఈ ఘోరపాపమును కలకాలము కనులార జూచి సైరింపలేడు.

బాలవితంతువుల సమస్య సమసిపోవలెనన్న బాల్యవివాహములు నిషేధించుటయే యత్యుత్తమమగు మార్గము దీనికి మొదటి మెట్టుగ 1925 లో నిషేక వయోపరిమితిని 12 నుండి 14 సంవత్సరములకు హెచ్చింపవలసినదని ఢిల్లీ శాసనసభలో సర్ హరిసింగుగారు ప్రతిపాదించిరి అప్పుడు ప్రభుత్వము వారు తటస్థులుగ నుండి, యీ తీర్మానమును దేశమందలి వివిధ సాంఘికుల యభిప్రాయ ప్రకటనకై నానారాష్ట్రములకు బంపిరి. మొత్తము మీద దేశములో నధిక సంఖ్యాకులు దీనికి సుముఖముగానే యభిప్రాయమిచ్చిరి మొన్నటి శాసనసభ

జంకుచు ముందు కింకొక దాటువేసెను గత నెలలో హరవిలాస శారదగారు 18 ఏండ్లలోపల బాలురకును, 14 ఏండ్లలోపల బాలికలకును వివాహము చేయుట న్యాయవిరుద్ధమనియు, దండనీయమనియు ప్రతిపాదింప అది సభ వారిచే యంగీకరింప బడెను. ఇది దేశీయుల యభిప్రాయము కొరకై త్వరలో ప్రకటింపబడును. అన్ని ప్రాంతములవారును దీనికి ప్రోద్బల మొసగి హిందూ సంఘమును తేజోవంతముగ జేయుదురని నమ్ముచున్నాము

పరిపూర్ణముగ అంగవికాసము నొందని బాలికలను సంరక్షించుటకై యింతకుముందే వివిధ దేశీయ సంస్థానములలో శాసనములు గలవు. బరోడాలో బాలురకు 18 లోపలను, బాలికలకు 14 లోపలను వివాహములు నిషేధించి యున్నారు కాశ్మీరములో కూడ నిట్టి శాసనమే విధింపబడి యున్నది. కొండాల్ కోట, మైసూరు, ఇందూ సంస్థానములలో నిట్టి చట్టములే కలవు. రాజకోట సంస్థానములో రెండు నెలల క్రిందటనే బాలికలకు 15 ను బాలురకు 19 ను వివాహ యోగ్యవయస్సుగ శాసింపబడెను ఇట్టి సంఘసంస్కార విషయమున దేశీయ సంస్థానములు ముందంజ వేయుచుండుట ప్రశంసార్హము

నిజాం రాష్ట్రమునకు కూడ బాల్యవివాహనిషేధ శాసనమొకటి అత్యవసరము. మన రాష్ట్రములో వేయింటికి 500 బాలికలకు 15 సం॥ లోపలనే వివాహము జరుగుచున్నది అందుచే బాలవితంతువుల సంఖ్య కూడ ప్రబలముగ నున్నది మొత్తము మనరాష్ట్రములో పదిన్నర లక్షల విధవలు గలరు వీరిలో సుమారు 4 లక్షల మంది 15 సంవత్సరము లోపువారే. కాబట్టి స్థానిక స్త్రీసంఘములొక బాల్య వివాహనిషేధ సంస్థ నేర్పాటు చేసి, ఢిల్లీలో నుండి మహారాణి గారిచే స్థాపింపబడిన కేంద్ర సంఘముతో సంబంధము లేర్పరచుకొని, ప్రజలలోనీ విషయమయి ప్రచారము సలిపి, నిజాము ప్రభుత్వము వారికి మహాజరులంపి, ఈ దురాచారమును మాన్ప బ్రయత్నింతురని హెచ్చరించు చున్నాము.

———

# మన విద్యాశాఖ

## 21-4-1928

1335 ఫసలి నివేదికయే మనకిప్పుడు లభ్యమైన నివేదిక, ఈ నివేదికలో మన విద్యాపరిస్థితులు కొంత చర్చింపబడినవి. దాని నుండి యనేకాంశములు మనము గమనింపవలసిన వున్నవి.

హిందూస్థానమందు ప్రతి రాష్ట్రములో విద్యా పరిస్థితులు దిన దినమభి వృద్ధి చెందుచున్నవి. మన రాష్ట్రమందు కూడ నభివృద్ధియైనదనియు నివేదికా సంవత్సరములో 97 పాఠశాలలును, 14 వేల విద్యార్థుల సంఖ్యయు వృద్ధియయ్యె నని తెలుపుచు ప్లేగు కరువు వంటి కాలములో కూడ నింతవృద్ధియగుట చాల సంతోషమని నుండివినారు. కాని యధార్థ పరిస్థితులెట్టివో యించుక విమర్శింతము. మన సర్కారు వారు ఈ 1335 లో విద్యపై సుమారు 74 లక్షలు వ్యయపరచి నారు అనగా మొత్తము ఆదాయములో సుమారు పదవ భాగము (నూటికి 10 వంతున) ఖర్చు అయ్యెను సాధారణముగా నిట్టి వ్యయము మరి యే రాష్ట్రము వారును జేయరని అందురు కాని యింత స్వదేశ సంస్థానములను బోల్చిచూచిన యీ యభిప్రాయమును సవరించుకొనవలసివచ్చును మైసూరు రాజ్యము వారు 61 లక్షల రూపాయలు (కల్దారు) కర్చు పెట్టుచున్నారు. అనగా ప్రతి మనుష్యు నిపై వారు 1-0-8 ప్రకారము ఖర్చుచేయుచున్నారు మన రాష్ట్రములో 0-8-0 (ఎనిమిది అణాలు) మాత్రమే ప్రతి వానిపై వ్యయము చేయుదురు మరియు తిరువాన్కూరు సంస్థానములో 42 లక్షల రూపాయీలు విద్యకై వినియోగించి యున్నారు. అనగా సర్కారీ వసూలలో నూటికి 18 ప్రకారము వ్యయ పఱచి నారు దీని వలన మన రాష్ట్రములో విద్యపై యింకను వ్యయ పఱచిన నష్టము లేదని విశదమగును. ఇంక విద్యావంతుల సంఖ్యలను గూర్చి కొంత చర్చింతము మన రాష్ట్రములో మొత్తముపై 4098 పాఠశాలలును 2 లక్షల 58 వేల విద్యార్థులును నున్నారని తెలుపబడినది. అనగా మొత్తముపై విద్యార్థుల సంఖ్య 14 వేలు హెచ్చెనుగాని ఖాస్గీ పాఠశాలల వ్యవస్థ మాత్రము గమనింపదగి యున్నది. ఈ 1335 లోని తీరు నెలలోనే ఖాస్గీ పాఠశాలల చటము బయలు దేరెను. కావున దాని ఫలిత మేమన ..

1334 ఫసలీలో

| పాఠశాలలు | విద్యార్థులు |
|---|---|
| 4053 | 76654 ఉండిరి |

1335 ఫసలిలో

| పాఠశాలలు | విద్యార్థులు |
|---|---|
| 1255 | 29626 |

దీనిపై విమర్శన యవసరము లేదు. ఏది యెట్లున్నను మొత్తముపై మన విద్యా పరిస్థితులితర సంస్థానముల కన్న చాల వెనుకబడి యున్నవని సర్కారు వారే యొప్పుకొనియుండిరి గత సంవత్సరము హైద్రాబాదు విద్యా మహాసభలో తమ యధ్యక్షోపన్యాసములో నవాబు జుల్ఖదిర్‌జంగు బహద్దరు గారు యిచ్చటను విద్యా ప్రాముఖ్యత నొప్పికొని శోకించి యుండిరి బరోడాలో నూటికి 14 గురు విద్యావంతులై యుండ మన రాష్ట్రములో నూటికి ముగ్గురు కూడ విద్యావంతులు లేరు. ఇక తిరువాన్కూరు స్థితి యెట్టిదో చూడుడు. అది మన రాష్ట్రములో పదియవ భాగము కన్న చిన్నది అచ్చట 583 పాఠశాలలున్నవి. సుమారు 53 లక్షల విద్యార్థులున్నారు మన రాష్ట్రములో 15 చదరపు మైళ్ల కొక పాఠశాల యున్నది తిరవాన్కూరులో ప్రతి 25 మైలుకొక పాఠశాల యున్నది. లేక యిట్లు లెక్కించి చూడుడు తిరువాన్కూరులో ప్రతి వేయి మందికొక పాఠశాల యున్నది ఇచ్చట ప్రతి 3400 మందికొక పాఠశాల యున్నది. మైసూరు రాష్ట్రములో మొత్తము 8212 పాఠశాలలున్నవి 3 లక్షల 20 వేల విద్యార్థులింక చదువుచున్నారు మైసూరు సహితము మన రాష్ట్రములో మూడవ భాగమున్నది. (29 వేల చదరపు మైళ్ల వైశాల్యము) మరియు దాని జనసంఖ్య సుమారు 60 లక్షలు కావున అచ్చట ప్రతి 750 మందికొక పాఠశాల యున్నది. అనగా పాఠశాల సంఖ్యలో తిరువాన్కూరు కన్నను మేలుగా నున్నది.

ఇట్లు మన రాష్ట్రముపై రాష్ట్రములతోపాటుగా ఖర్చుపెట్టుచున్నను, నసేక్షేతర స్వదేశ సంస్థానములకన్న విశేషముగా వ్యయము చేయుచున్నను విద్యావంతుల సంఖ్య యేల హెచ్చుటలేదు ద్రవ్యమును సరియైన వితరణతో వ్యయము చేయుటలేదని దీనివలన విశదమగు చున్నది. హైద్రాబాదు రాష్ట్రములో

ఐదేకళాశాలలున్నవి. దీనిలో నొకటి స్త్రీల కళాశాల, ఈ స్త్రీల కళాశాలలో 8 గురు విద్యార్థినులు చదువు చున్నారు ఈ ఐదింటిపై 5 లక్షలు ఖర్చుపెట్టినారు. ఇందు చదువు విద్యార్థుల సంఖ్య 1000 పీరిపై యింతమొత్తము వ్యయమగు చున్నది. అనగా ప్రతి విద్యార్థిపై 459 రూపాయలు ఖర్చగుచున్నది. కాని హైస్కూలు లోని ప్రతి విద్యార్థిపై 11-6-2 మాత్రమే ఖర్చగుచున్నది అనగా ఒక కళాశాల విద్యార్థిని చదివించు ఖర్చులో 40 ప్రైమరీ విద్యార్థులను చదివించ వచ్చును. ఇట్లు చూపించుటవలన ఉత్తమ విద్య (Higher education) కూడదని మా యభిప్రాయముకాదు దానితొ పాటుగా ఖాస్గీ పాఠశాలలపై కోపగించుకొనునట్లు కాక ప్రైమరీ పాఠశాలలపై యెక్కుడు శ్రద్ధవహించి విద్యావ్యాపకము చేయవలెనని మేము హెచ్చరించుచున్నాము

ఈ రాష్ట్రములో వెలువడినట్లుగా స్త్రీవిద్య మరి ఎచ్చటను వెలువడియుండ లేదు. ఈ నివేదిక కాలమున చదువుచుండిన బాలికల సంఖ్య 34 వేలు మాత్రమే స్త్రీ విద్యను వృద్ధి పరచిననే కాని రాష్ట్రములో విద్యాపరిస్థితులు చక్కబడవు. ఇట్లుచేయవలయుననిన రాష్ట్రీయ భాషలగు తెనుగు, మరాటీ, కన్నడములలోనే స్త్రీలకు బోధచేయవలెను ఇప్పుడు నగరమందుండు పాఠశాలలో సహితము బాలికలకు తమ తమ మాతృభాషలో విద్యనేర్పు, సరియైన నేర్పాటులు లేనప్పుడు జిల్లాలలో నెవరడుగుదురు ఎంతవరకు రాష్ట్రీయ భాషలకు ప్రాధాన్య మొసగరో యంతవరకు విద్యావంతుల సంఖ్య యిట్లే యుండును

ఈ సందర్భమున ప్రజలకుగూడా తమ కర్తవ్యమును సూచింపవలసి యున్నది రైతుల నుండి ప్రతి గ్రామమందును తమ పన్నులతో బాటుగా లోకల్ఫండు పన్ను అని రూపాయికి 1 అణా చొప్పున వసూలు చేయుదురు ఆ యణాలో 3 పైసాలు (నాల్గవ భాగము) విద్యకని సర్కారు వారు ఏర్పాటు చేసి యున్నారు ఈ ద్రవ్యమును ప్రతి గ్రామమందును సంపూర్ణముగా వినియో గించునట్లు రైతులు చూచుకొనవలయును

అడుగనిది అమ్మయైన పెట్టదు సర్కారు వారు తమ ప్రజలు వృద్ధికి రావలెననియే నిరంతరము తాము పాటుపడుచున్నామని చెప్పుచుందురు. అట్టిచో మన యభివృద్ధికి కారాణములగు విషయములందు మనమేల సర్కారు వారిదృష్టిని ప్రసరింప జేయకూడదు?

---

# మన విద్యావిధానము

## 25-4-1928

గత సంచికలో నిజాం రాష్ట్రీయ విద్యాశాఖను గూర్చి కొన్ని సంగతులను దెలిపియుంటిమి. రాష్ట్రీయ విద్యాలయముల సంఖ్యయు విద్యార్థుల మొత్తమును, ఈ శాఖకై వెచ్చింపబడుచున్న ధనము గూర్చియు, దెలిపియున్నాము. ఇక మన విద్యాపద్ధతి గూర్చి యించుక దెలుపవలసి యున్నది.

ఏ భాషలో విద్య గరుపవలెను? ఈ సమస్య విద్యా విధానములో మిక్కిలి ప్రాముఖ్యమైనది. బ్రిటిషు ఇండియాలో ప్రతి కళాశాలలోను ఇంగ్లీషు లోనే బోధనా విషయములన్నియు గరపుచున్నారు. మూడవ తరగతిలో ఇంగ్లీషు ప్రారంభించి, బాలుడు పై తరగతులకు పోవుకొలది నీ భాషకు ప్రాముఖ్యత హెచ్చిపోవుచున్నది. ఈ పద్ధతి మూలమున విద్యాలయములలో గరుపబడు విద్య నిస్సారమై, తేజోహీనమై, విద్యార్థుల ప్రతిభాశక్తిని అభివృద్ధి పరచుటకు బదులు, మొద్దువారిగ మెదడు గలవారినిగా జేయుచున్నది. ఈ లోపమును పరిగణించి, నేడు వివిధ ప్రాంతములందు దేశభాషలోనే విద్య గరపుటకు యత్నములు జరుగుచున్నవి. ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనము గూడ నీ సూత్రముపైననే యాధారపడి యున్నది.

మన రాష్ట్రీయ విద్యా విధానములో కూడ విదేశ భాషయగు ఇంగ్లీషు భాషకు అసమంజసమగు ప్రాముఖ్యత నొసగి, ప్రజలలో విజ్ఞాన వ్యాప్తి సరిపట్ట కూడదనెడి భావముతో ఉస్మానియా విశ్వవిద్యాలయము స్థాపింపబడియున్నది. దేశభాషలో గరపబడు విద్యయే సులభముగను సువ్యక్తముగను బాలుర మనస్సు కెక్కుననెడి కారణమే ఈ విద్యాలయమున కాధారము. సూత్రము సర్వజనాంగీకృతమే. కాని నేటి విశ్వవిద్యాలయములో ప్రధానస్థాన మాక్రమించియున్న ఉర్దూభాష దేశభాషయా? రాష్ట్రములోని ఒక కోటి 25 లక్షల ప్రజలలో

ఉర్దూ మాట్లాడువారు 13 లక్షలమంది మాత్రమే అట్టిచో ఉర్దూభాషకు ప్రాముఖ్య మేల?

ఈ రాష్ట్రమున 1921 వ సంవత్సరపు జనవరి గణనము వలన వేయింటికి,

| | |
|---|---|
| తెలుగు మాట్లాడువారు | 482 |
| మహారాష్ట్రము మాట్లాడువారు | 264 |
| కన్నడము మాట్లాడువారు | 123 |
| ఉర్దూ మాట్లాడువారు | 104 |

గలరని దెలియుచున్నది ఇట్టితరి ఉర్దూ భాషకు మన విద్యా విధానమున ప్రథమ స్థానమేల యియ్యవలెను? ఇది దేశభాషలో విద్య గరపవలెననెడి సూత్రమునకు విరుద్ధము గాదా?

ఉన్నత విద్యయేకాక, మాధ్యమిక విద్యకూడ విద్యార్థి మాతృభాషలో కాక విదేశ భాషయగు ఇంగ్లీషులోనో, లేక పరభాషయగు ఉర్దూలోనో వివిధ విషయములను బోధించుచున్నారు. ప్రాథమిక ప్రారశాలలో మాతృభాషలోనే పాఠములు చెప్పవలెనని ప్రభుత్వమువారి విద్యా ప్రణాళికలోనున్నను, మొత్తము మీద ఇటుల జరుగుట లేదు.

మన రాష్ట్రములో విద్యా వ్యాప్తి చీమ నడకతో సాగుచుండుటకీ పద్ధతియే చాలవరకు కారణమని మా అభిప్రాయము మన తాతలనాటి వీధి బడులలో వ్రాయుట, చదువుట, గణితము, మాతృభాషలోనే బోధింపబడుచుండెను. దీని మూలమున విద్యార్థులకు సులభముగ నలవడుచుండెను ఈ దృఢమగు పునాది మీద, జాతీయ భాషలో, జాతీయ పద్ధతుల ననుసరించి గట్టబడిన విజ్ఞాన మందిరము సర్వాంగ సౌష్ఠవము గలిగి, శక్తివంతమై కలకాలము నిలుచుచుండెను కాని నేటి విద్యావిధానమిందుకు విరుద్ధమైయున్నది బాల్యమున ప్రతివానికిని విజ్ఞాన తృష్ణ ప్రబలముగనుండును బాలురకు ప్రకృతిలోని ప్రతి చిన్న వస్తువును, వారికి ఆశ్చర్యము గొలుపును. చీమ మొదలుకొని ఏనుగువరకు,

ఇసుక రేణువు మొదలుకొని మహోన్నత పర్వతమువరకును వారికి ఆనంద దాయకములే. కట్టెపుల్ల మొదలుకొని సూర్యచంద్ర గ్రహములవరకును వారికి ఆట వస్తువులే. విశ్వమంతయు వారికి లీలారంగమే అందుచే వారు ప్రతివస్తువు గూర్చియు ఇదియేమి? ఎందుకిటులున్నది? ఎటుల పుట్టినది? తుదకేమియగును? మున్నగు ప్రశ్నలు కుతూహలముతో వేయుచుందురు వారికా విషయములను సులభముగ గ్రాహ్యమగు నటుల తేట మాటలతో, మాతృభాషలో బోధించుట యత్యుత్తరమగు విద్యావిధానము ఇట్లు గరపిన విద్య, బాలురకానంద దాయక ముగ నుండుటయేకాక, వారి కోమల మేధస్సునకెట్టి కష్టములేకయే. వారి యందిముడును. కాని నేడిటుల గాక బడికి పోవుచున్న ఆరేండ్ల పసి బాలుడు తిన్నగ గీతయే గీయజాలని కాలమున అర్థహీనమును, ఉత్సాహ భంగములును నగు ఓన మాలును, ఏ బీ సీ, లను, అలీబ్బేలను నేర్చుకొనుటకు గాను తల బ్రద్దలు కొట్టుకొనవలసి వచ్చుచున్నది మాతృభాషలోని అక్షరములను నేర్చుటే చాలు దీనికి తోడుగ నోరు తిరుగని వింత శబ్దములు గల కొంకిరి గీతలను నేర్చుకొనుట బాలునికింకెంత దుర్భరముగ నుండునో వేరుగ జెప్ప నక్కర లేదు. ఇట్టి పరిస్థితులలో బాలుడు బడి దొంగయైనచో నొక వింతయా?

ఇంతేకాదు, ఐదవ యేట బాలుడు పాఠశాల ప్రవేశించి 16 వ యేట మెట్రికు ముగించెనను కొందము. ఈ 11 సంవత్సరములలో కనీసము 7 సంవత్సరములు, ఒక క్రొత్త భాషనేర్చుటతోడనే పూర్తియగుచున్న వనవచ్చును. ఈ కాలమునే విజ్ఞాన ప్రాప్తికి వినియోగించియున్నచో, బాలుడెంతయు ప్రజ్ఞా వంతుడై యుండును. కాబట్టి ఉర్దూ మాతృభాష కాని వారికి నేటి విద్యా విధానము వలన ఎన్నదగిన లాభమేమియు గలుగుటలేదు ఇంగ్లీషు భాష నేర్చుకొనుట కుక్కిరి బిక్కిరి యగుచున్న వారిపై ఉర్దూ బండ నొకదానిని వేయుటయే దీని ఫలితము ఉన్నత విద్యా విధానములో కాకున్నను, ప్రాథమిక మాధ్యమిక విద్యాలయములలో మాత్రమీ విధాన మంతరింపవలెను

# ఆంధ్ర సభలు

## 12-5-1928

సూర్యాపేటలో జరుగుచున్న సభలలో ముఖ్యమైనదేది ? రాష్ట్రపు ఆంధ్రులందరికి యుత్సాహమునకు గురియైనదేది ? కేంద్రసంఘ వార్షికోత్సవము ఆ సంఘము వారికి సంబంధించినదే. గ్రంథాలయ మహాసభ కొంతవఱకు ఆంధ్రులలో పిన్న పెద్ద లందఱికి సంబంధించినదే యైనను, ఒక విధమున కేవలము గ్రంధాలయోద్యమ ప్రచారకులకును గ్రంథాలయ ప్రతినిధులకును సంబంధించినదే యన జెల్లును. వర్తకసంఘ వార్షికోత్సవపు కార్యక్రమమున ఆ సంఘ సభ్యులే పాల్గొనగలరు. ఆంధ్రలోక మంతటికిని, ప్రతి సంఘమునకును సంబంధించినది మహిళా మహాసభయే కాని యిందు పురుషులు పాల్గొనజాలరు ఇట్టి తఱి రాష్ట్రీయాంధ్రు లందఱికిని శ్రద్ధాభక్తులకును గురియయిన సభ యొకటి యత్యవసరమని వేరుగ జెప్పనక్కర లేదుకదా ! ఏ జాతివాడైనను, ఏయుద్యమమునకు సంబంధించినవాడైనను విద్యార్థియైనను, ఉద్యోగియైనను, యువకుడైనను వృద్ధుడైనను ఉత్సాహావేశములతో బాల్గొని, దానంగలుగు శుభఫలముల ననుభవింపగలుగు సభయొకటి యవసరము అట్టి సభలోనే మన రాష్ట్రపు ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధి గూర్చిచర్చింపవచ్చును

సంఘసంస్కార సభ మన రెండవ యవసరము. బ్రిటిషు ఇండియాలోని ఆంధ్ర సంఘమున జరుగుచున్న సంస్కారములోని శతాంశమైనను మన రాష్ట్రమున జరుగుటలేదు బాల్యవివాహములు, నిర్బంధవైధవ్యము, పడుపువృత్తి మున్నగు దురాచారములు పూర్తిగ రూపుమాయనప్పటికిని, ఈ యాచారముల హైన్యత, దుష్ఫలితములు, ప్రజలెల్లరు గ్రహించుచున్నారు వారి భావవైఖరి మారినది స్త్రీవిద్య యత్యావశ్యమని యెల్లరు సమ్మతించుచున్నారు స్త్రీల దాస్య శృంఖములను ఎగురగొట్టవలెనని అందరు అంగీకరించు చున్నారు ప్రత్యేకాంశముల విషయమున యభిప్రాయ భేదములున్నప్పటికిని, ముఖ్యములగు పై సూత్రముల విషయమున సాంఘికులందరేకాభిప్రాయులై యున్నారు.

కాని రాష్ట్రవాసులలో నిట్టి మనోసంస్కార మింకను జరుగలేదు. రాష్ట్రీయ సంస్కార మహాసభ యొకటి యున్నను దాని కార్యక్రమ మంతయు హిందీ లోనో, మహారాష్ట్రముననో జరుగుచుండుటచే దాని గూర్చి యాంధ్రులలో నుత్సాహము ప్రబలుటలేదు ఆ సభా తీర్మానములు పామర జనులకు తెలియుట లేదు అందుచే ఆంధ్రజన ప్రజాభిప్రాయ మొకటి(Public opinion)కలుగుట లేదు దీనివలన సంస్కార సూత్రము లామోదించువారు సహితము, తదనుగుణ ముగ ప్రవర్తించుటలేదు. అందుచే రాష్ట్రీయాంధ్రులలో సంస్కార సూత్రము లను వెదజల్లుటకొరకు సంస్కార సభ యవసరము అందు జరిగెడు తీర్మాన ములు ఆంధ్ర లోకమంతటికిని వెల్లడియగును. ఆ తీర్మానములకు ప్రజాభిప్రాయ ప్రోద్బలముండును గానవాని సభలు జరుపు యాంధ్రు లందరికిని తప్పనిసరి యగును

మూడవది ఆంధ్ర యువక మహాసభ ఆంధ్రుల భావ్యోన్నతి వీరి పైననే యాధారపడి యున్నది. నేటి యువకులే రేపటి పౌరులు. సంఘ దురాచారముల నడుగంట వలెనన్నను, వాఙ్మయము నవీన కళలతో శోభించవలెనన్నను, ఆంధ్రజాతి శక్తిమంతమై, సారవంతమై, ఆత్మవిశ్వాసము, స్వాతంత్ర్య దీక్ష. దేశభక్తిగలిగి పేరు గాంచవలెనన్న యువకులే నడుముగట్టి కార్య రంగమున నురకవలెను ఈ బాధ్యతను తెలిసికొనుటకును, సాధనములు యుటకుగాను, రాష్ట్రీయాంధ్ర యువకుల సభ యొకటి గావలసి యున్నది

ఈ సభలను వైభవముతో జరుపుటకు సమయము చాలినంత లేదు అయినను నిరుత్సాహపడక పట్టుదలతో పని జేసినచో సభలు విజయవంతముగ మాత్రము జరుగకపోవు హైద్రాబాదు యువకమండలి వారీవిషయమై ప్రబల యత్నములను సలుపుచునేయున్నారు సూర్యాపేటాహ్వాన సంఘమువారు శ్రద్ధ వహించిన చాలును మండలి సహాకారముగాని, శక్తివంచనలేక కృషి సల్పినచో తప్పక జయము చేకూరును ఈ సభలవలన రాష్ట్రీయాంధ్రులలో నొక నూతన చైతన్యము గలుగునని మా దృఢనమ్మకము కాబట్టి ఆహ్వానసంఘమువారు సంశయములను వెనుకకు ద్రోసి, వెంటనే కార్యసాధనమునకు పూనుకొందురని హెచ్చరించుచున్నాము.

---

# కీ ర్తిశేషులైన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు

**20-6-1928**

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి అకాల మరణముచేత ఆంధ్రదేశము అత్యుత్తముండును, స్వార్థత్యాగియు, సాటిలేని ప్రజ్ఞావంతుడును నగు నొక సత్పుత్రుని గోలుపోయినదనుట నిర్వివాదాంశము. వీరు హిందూదేశమందును, ఆంగ్లదేశమందును, ఉత్తమ విద్య నభ్యసించి, ఆంగ్ల విశ్వవిద్యాలయములో గొప్పదగు పట్టమును బొంది, మాతృదేశమునకు వచ్చి తమ ప్రజ్ఞా విశేషమును మొదటి బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాల యొక్క సేవయందును, తరువాత భారత దేశోభ్యుదయమున కత్యంతావసరముగ నుండిన ఆ సహాయోద్యమునందును ఉపయోగించిరి. గాంధీ మహాత్మునిచే ప్రతిపాదింపబడిన పవిత్రోద్యమము, హిందూదేశమును కాశ్మీరము నుండి కన్యాకుమారి వరకును, సింధు ప్రాంతము నుండి బర్మా వరకును ఉత్సాహముతో ఉఱ్ఱూత లూపుచుండిన ఆ దినములలో- ఎంతటి పిరికివానినైనను శాంతునిగను ఎంతటి మితభాషినైనను వక్తగను, ఎంతటి తీవ్ర స్వభావము కలవానినైనను శాంతునిగను మార్చిన ఆ దినములలో- ఆంధ్ర దేశమున మన ఆంధ్ర రత్నము ప్రదర్శించిన సామర్థ్యము అనన్య సామాన్యమని వక్కాణించగలము మన ఆంధ్రరత్నము మూలముననే కదా చీరాల పేరాలలోని ప్రజలు రవి యస్తమింపని సామ్రాజ్యము వశమునగల ఆంగ్ల ప్రభుత్వమును కొంతవరకు భయ విస్మయాకుల చిత్తముగా నొనర్చి, ఆసహాయోద్యమ చరిత్రమున ఆ జరామరమగు నొక యధ్యాయమును కల్పించినది 31 మార్చి 1921 నాడు అఖిల భారత జాతీయ సభోప సంఘము బెజవాడయందు సమావేశమై, భారతవర్షము నుద్ధరింప కంకణబద్ధులైన మహానాయకుల యెదుటను, లక్షకు మించి కూడిన ఆంధ్ర ప్రజాసమ్ముఖమునను, దేశ బంధు చిత్తరంజనుదాసు, "చీరాలకు నేషి

దినము గవర్నరు లార్డు పెంట్లండా? కాదు కాదు! దుగ్గిరాల గోపాల కృష్ణయ్యయే"యని ఉచ్చైస్స్వనమున చేసిన ప్రకటనము, అచ్చటినుండి ఆ యానందమును కొంత యనుభవించిన వారికిప్పటికిని తలచుకొనినప్పుడు చెవులందు ప్రతిధ్వనించుచున్నది! ఇట్టి నాయక వర్యుడు ఇంకను చేయవలసిన కార్యము ఎంతయో యుండ యశః కాయుడగుట భారత వర్షీయులను, అందు ముఖ్యముగా ఏ ప్రాంతమందున్న వారైనను సరే ఆంధ్రులందరును దుఃఖ సముద్రమున ముంచుననుట నిక్కము. పరమేశ్వరుడే ఆంధ్ర సోదరుని యాత్మకు శాంతిని, వారి కుటుంబమునకు ధైర్యమును ప్రసాదించుగాక! ఆంధ్ర దేశమున నిట్టి స్వార్థత్యాగులు పెక్కుమంది జనించి భారత వర్షాభ్యుదయ మునకై ప్రయత్నింతురు గాక!



# సంస్థానాధీశులు

## 10-10-1928

బట్లరు కమిటి నియామకము వలన స్వదేశ సంస్థానాధీశులలో అలజడి కలిగినది. వారు తమ నిరంకుశ పరిపాలనము నిలుపుకొనుటకై తీవ్రముగా ప్రయత్నించుచున్నారు లండను నగరముననున్న సంస్థానాధీశులకు న్యాయవాద ప్రముఖులు తోడ్పడుచున్నారు బ్రిటిషు పత్రికలు, ఆంగ్లో హైందవ పత్రికలు, వారి ఆశయములను బలపరచుచున్నవి ఈ పత్రికల యుద్దేశము భారతీయుల స్వతంత్ర్యోద్యమమున కడ్డు దగులుటయే కదా! వీరి ప్రధాన న్యాయవాదులగు సర్ లెస్లీ స్కాంటుగారి యభిప్రాయము లెట్టివో ప్రపంచమునకు తెలసినవి. వారి ఆలోచనానుసారము మన సంస్థానాధీశులకు మెలంగుచు హిందు స్థానమునకు కళంక మాపాదించుటకై పూనుకొనుచున్నారు

బట్లరు కమిటీ వారి నెల 15వ తేది విచారణ ప్రారంభించెదరు సంస్థానాధీశులు తమ కోర్కెలు న్యాయవాదుల ద్వారా తెలిపెదరు అయినను కమిటీ వారు సంస్థానములందలి ప్రజల యొక్క అభిప్రాయమును వినుటకై నిరాకరించుట శోచనీయము ఇటులగుచో వీరి మొఱ లాలపించు వారెవరు? వీరి యిబ్బందులు తీర్చువారెవరు? కొందఱు సంస్థానాధీశులు తమ ప్రజలను తీరని యిక్కట్టులు కలిగించుచున్నారు కొన్ని చోట్ల పన్నుల భారమధికముగానున్నది. స్వదేశ సంస్థానములయందు విద్యాభివృద్ధి లేదు వాక్స్వాతంత్ర్యము ముద్రణ స్వాతంత్ర్యము లేదు. ఇట్టి విషమ పరిస్థితులు సంస్థానములందున్న బట్లరు కమిటీవారు జోక్యము కలిగించుకొనకుండుటేలనో తెలియకున్నది

నెహ్రూ సంఘము వారు సంస్థానముల సమస్య అనుకూలముగా నిర్ణయించిరి. దాని వలన సంస్థానాధీశులకే పెక్కు లాభములు కాగలవు కాని సంస్థానములందలి ప్రజలకు గాదు. అయినను వారు భారత ప్రభుత్వమునకు లొంగియుండుట తమకవమానకరమని భావించుచున్నారు. సర్ లెస్లీస్కాటు

మున్నగు వారు తమ కోర్కెలు ఫలింపజేయుదురని ఆశించుచున్నారు అట్టి యెడ స్వదేశీయుల ఆలోచన వారికెటుల గిట్టును? లెస్లిస్కాటు మున్నగు వారు తమ దేశమునకనుకూలించు విధానమునే జొప్పించుటకు ప్రయత్నించెదరు కాని, భారతీయుల మేలుకై వారేం పాటుపడెదరు? బ్రిటిషు సైన్యములు సంస్థానములను రక్షించుటకవసరమని ఆంగ్లేయ పత్రికలు వ్రాయుచుండుట లేదా?

ఒక విషయము మాత్రము జ్ఞప్తియందుంచుకొనవలయును. పూర్వము స్వదేశ ప్రభువుల మూలముననే భారత జాతి దాస్య శృంఖములలో బడినది. ఇపుడు శృంఖములను ద్రెంపుటకై కృషి సలుపుచుంత మంఖల సంస్థానాధీశులే అడ్డు తగులుచున్నారు. భారతీయులు వీరి దృక్పథమును కీర్తింపజాలరు. స్వదేశీయుల గౌరవము వలననే వీరి కీర్తి యినుమడించును గాని పాశ్చాత్యులకు దాసులగుటచే కాదు. అయినను పెక్కు సంవత్సరముల నుండి వేరొక జాతికి లోబడి యున్నవారికి స్వతంత్ర భావములెట్లు కలుగును?



# ఆంధ్ర సభలు

## 24-11-1928

నవంబరు నెల 17, 18 తేదులలో నంద్యాలయందు ఆంధ్ర మహా సభ ఆంధ్ర రాష్ట్రీయ సభ గోరక్షణ సభ సమర్థులగు అధ్యక్షుల యజమాన్యముక్రింద జయప్రదముగ జరిగినవి ఇదివరలో మేము సూచించిన రీతిగా ఆంధ్రమహాసభాధ్యక్షులగు ఆచార్య రాధాకృష్ణయ్య గారు ఆంధ్రులలో యుత్సాహమునకు తోడు కార్యదీక్ష యవసరమని నుడివిరి ఎన్నియో విద్యా సంస్థలు, ఉద్యమములు కార్యదీక్ష లేనందున సన్నగిల్లినవి కనుక నీవిషయము గమనించుట ముఖ్యాతి ముఖ్యము

ఈ సంవత్సరమేలకో ఆంధ్ర మహాసభవారు నిజాం రాష్ట్రాంధ్రులపై తమ దృష్టిని ప్రసరింపజేసిరి రాజకీయ రాహిత్యసభలు సమావేశ పరచుటకు ప్రభుత్వాజ్ఞ అనవసరమనియు, నిజాం ప్రభుత్వము వారు ఇదివరకున్న అంక్ష తొలగించ వలయుననియు తీర్మానము గావించిరి ఇదియెంతయు ప్రశంసనీయము అయినను అఖిలాంధ్ర దేశము గూర్చి ఇంకను శ్రద్ధవహించుట లేదు. స్థాయి సంఘము వారు తగు రీతి పని జేయుటలేదు

రాష్ట్రీయ సభయందు నెహ్రూ నివేదిక అంగీకరింపబడుట శుభప్రదము. కాంగ్రెసు ఆదర్శము మార్చుటకై తీర్మానము తేబడెను. కాని అధ్యక్షులు క్రమ విరుద్ధమని త్రోసివేసిరి సైమను సంఘమును బహిష్కరించుటకై నిశ్చయింపబడెను ఇక తీర్మానముల ఆచరణకై నాయకులు కృషి సలిపెదరని నమ్మెదము. ఇది వాద వివాదములకు సమయము కాదు. లాలాజీవలె నిరంతరము నాయకులు కార్యాచరణయందే నిమగ్నులై యుండవలయును అది నివేశ స్వాతంత్ర్యమా? సంపూర్ణ స్వాతంత్ర్యమా యను చర్చ ఇక ముందుండదని తలంచెదము. ఆంధ్రులు తమ కర్తవ్యము నిర్వహించెదరు గాక!

---

# ఆంధ్ర విశ్వ విద్యాలయము.

**5-12-1928**

ఈ విశ్వ విద్యాలయము యొక్క అకెడెమిక్ కౌన్సిలు వారు ఆంధ్ర భాష మూలక విద్యను నిరాకరించిరి భారతదేశ మంతటను దేశభాషలో విద్య గఱపవలయునని తీర్మానింపుచుండ వీరిట్లు తీర్మానించుట శోచనీయము. ఇక ఆంధ్ర విశ్వ విద్యాలయ అవసరమేమి కలదో మాకు తెలియకున్నది. మద్రాసు విశ్వవిద్యాలయము వలన విద్యా ప్రచారము జరుగలేదా? ఉద్యోగులను తయారు చేయు విశ్వవిద్యాలయములను నెలకొల్పి ప్రజాధనము వృథాపరుచుట యేల? ఇంతవఱకును కేంద్ర స్థల నిర్ణయము జరుగలేదు ఇప్పుడు భాష నిర్ణయము జరిగినది ప్రత్యేక లక్షణములతో నెలకొల్పఁబడునని చెప్పుచుండిన వైసు చాన్సెలరు లగు కట్టమంచి రామలింగారెడ్డిగారేమి చేయుచున్నారో వారికే దెలియును.

---

# నిజాం రాష్ట్ర గ్రంథాలయములు

## 23-1-1929

కొంత కాలము క్రింద రహెబరె దక్కన్ సంపాదకులు నిజాం రాష్ట్రము లోని గ్రంథాలయములపై రాజద్రోహపు స్థలములని ఘోరమగు నిందను ఘోరతరమగునట్టి యబద్ధముచే మోపియుండిరి. కేంద్ర సంఘ కార్యదర్శిగారు వారికి నేరము నిరూపింపుమని జవాబు వ్రాయగా జవాబులేదు మరియు పండిత కేశవరావుగారు కూడ రహెబరె దక్కన్‌కు జాబు వ్రాసి యే కారణముతో నట్లు వ్రాసిరో తెలుపుమనగా నా జాబునే ప్రకటింపక పోయిరి ఇట్టి చర్యకలవారు జవాబేమియ్యగలరు. ఈ రెంటిని బట్టి వీరు శుద్ధాబద్ధమును బల్కినారని తేలినది కాని అంతటితో గ్రంథాలయముల కర్తవ్యము తీరలేదు ప్రతి గ్రంథాలయ సభ్యులును సమావేశమై యీ రహెబరు యొక్క రోత వ్రాతలను ఖండించి తీర్మానములు చేసి మాకును ఆ పత్రికకు కేంద్ర సంఘ కార్యదర్శిగారికిని నితర పత్రికలకును పంపుదురు గాక! చేయమని మేమప్పుడే సూచించి యుంటిమి కాని యేలనో యింకను నెవ్వరును నట్లు చేయలేదు. ఇట్టి నిందారోపణమును జేయు పత్రికను నందరు నిరసింతురుగాక!

---

# సావర్కార్ ప్రవాసము

**16-2-1929**

బెజవాడ దుర్గా విలాసమునందు సమావేశమైన ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెసు సంఘ సభవారు సావర్కార్‌గారి ప్రవాస కాలమును మరింత కాలము హెచ్చించినందులకు ప్రభుత్వము వారి చర్యను ఖండించుచు నొక తీర్మానమును గావించిరి సావర్కార్ యువకుల నాయకుడు దేశమునకై పాటుబడిన యోధుడు నేటికిని ప్రభుత్వపు దారియందు తగుల్కొని …ల్యావశిష్టుడైయున్న వీరుడు ఇక వారి విడుదలకై తీర్మానములు గావించిన లాభములేదు. యువకులగు వారు సక్రమ యాందోళన జరిపి సావర్కార్‌ను తిరిగి తమ యందొకనిగా కలుపు కొనవలయును. అప్పుడే మనయొక కార్యమును సాధించిన వారమగుదుము.

—

# ఫాదిరీల దౌర్జన్యము

**23-3-1929**

నిజామాబాదు జిల్లాలోని ఆర్మూరు తాలూకాయందు ఇబ్రాహీం పట్టణము, వేళకొండ మున్నగు గ్రామముల ప్రజలు మహాఘనత వహించిన నిజాము ప్రభుత్వము వారి ప్రభుత్వసభ (బాబెహూకూమతు) పేర పంపుకొనిన యొక సంఘ విజ్ఞప్తి మా కార్యస్థానమునకు వచ్చినందున దానిని వేరొక తావున ప్రకటించి యున్నాము

ఈ విజ్ఞప్తిలో క్రైస్తవ మత బోధకులు గ్రామస్థులను తిప్పలు బెట్టు చున్నట్టును, వారి మత కట్టుల నాచరింపుట యందాటంకములు కలిగించు చున్నట్టును, స్త్రీలు నీరు తెచ్చుకొనుచుండ వారిని బుద్ధి పూర్వకముగా నంటు కొని వారి నపవిత్రపరచుచుండే నట్టును, బలవంతపెట్టి జనులవద్ద నుండి చందాలు వసూలు చేయుచుండి నట్లును ఇంకెన్నెన్నియో అవాచ్యములగు పనులు జరుపుచున్నట్టును తెలియు చున్నది ప్రభుత్వము వారికి పంపుకొనబడిన ఈ విజ్ఞప్తియందు అబద్ధము లుండగూడదు ఇందలి యంశములను కొంత అతి శయోక్తులుగా దలచినను, యదార్థముగా నిర్ణీతమగు భాగము కూడ చాల భయం కరమును, మతసహిష్ణుతకు భిన్నమును, క్రైస్తవ మతబోధకులందు కనబడు ఉత్తమ సాత్త్విక వర్తనమునకు విరుద్ధముగను ఉన్నది విజ్ఞప్తిలో చెప్పబడిన చర్యలు ఇతర మతస్థుల వలన తరచుగా జరిగియుండుట వినుచున్నాము. కాని క్రైస్తవ మతబోధకులిట్టి పద్ధతులు తమ మత వ్యాప్తికై యవలంబించుట విని యుండలేదు. అథమ పక్షమున ఈ రాష్ట్రమున నీ సంగతులు అకృత పూర్వ ములు. ఇట్టి స్థితిలో నేటి కాలమున, ఇరువదవ శతాబ్దమున నిజాము రాష్ట్రములో క్రైస్తవ మత బోధకులు ఈ నవీన మార్గము నవలంబించుటకు కారణము సూక్ష్మముగా నాలోచింపదగి యున్నది.

పై గ్రామముల ప్రజలు క్రింది యుద్యోగస్థుల [illegible] గ్రామముల గూర్చి మొరపెట్టుకొనిన మీదట కొంత చర్యను పొందిన యధికారులు [illegible] తరువాత ఉపేక్షవహించిరని విజ్ఞప్తివలన తెలియుచున్నది [illegible] మేమి? ఇట్టి వంత మహోన్నత వహించిన మన ప్రభువుగారు ఒక ఫర్మానా జారీ చేసియుండిరి దానిలో క్రింది యధికారులు గ్రామములలోని మత పక్షములలో ఒకరి యొకవైపుచేరి రెండవ పక్షము వారికి అన్యాయము కలుగజేయు చున్నట్టు సూచన చేయబడినది. అది మహమ్మదీయ యధికారుల విషయమేమో యని తలంచితిమి ప్రభుత్వాధికారులలో చాల మంది దాదాపుగా సంపెరును మహమ్మదీయులేయగుటవలన - హిందూ మహమ్మదీయ మతముల వారికి పక్షలు వచ్చినప్పుడు అధికారులు మహమ్మదీయుల పక్షము వహించుచు హిందూ ప్రజలకన్యాయము చేసియుండుటను మన ప్రభువుగారు ఫర్మానులో సూచించి యుండిరనుట నిశ్చయము, కాని ఆర్మూరు తాలూకాలోని పైసంగతులను అట్టి కారణము కూడ కనుపడదు.

ఎట్లయినసనేమి, విజ్ఞప్తిలోని వార్తలు సత్యములే యైనచో - లేక కొంత వరకైన సత్యములే యైయుండవచ్చును ప్రభుత్వాధికారులు తక్షణమే విచారించి ప్రజలకు నెమ్మది కలిగింపుట యవసరము. హిందూ ప్రజలు ఈ రాష్ట్రమున సంఖ్యలో అందరిని మించినవారము, ప్రభుత్వాధికారమునందు ప్రాముఖ్యతలేని కారణముననో మరే దౌర్బల్యము వలననో, ఎప్పుడు నిస్సహాయత్వమును ప్రకటించుకొనుట సంభవించు చున్నది. ఇది చాల సంతాపకరము.

పోలీసుమంత్రి గారగు కర్నలు ట్రెంచిగారు ఆంగ్లులు. క్రైస్తవ మతస్థులు సర్వసమత్వమును కోరు స్వభావము కలవారు. ప్రభుత్వ సభలో మెంబరులు. ప్రస్తుత విజ్ఞప్తిలోని చిక్కులను తొలగించి జనులందు నమ్మకమును, నెమ్మదిని వ్యాపింపజేసి, పరమతస్థుల దుండగములను అణగునట్లొనర్చుట వారి విధియైయున్నది తక్షణమే ప్రభుత్వమువారు తమ విధిని నెరవేరుతు గాక!

---

# హైదరాబాదు పరిశ్రమలు

## 27-4-1929

మన ప్రభుత్వమువారు హైద్రాబాదు పరిశ్రమల యభివృద్ధికై యొక కోటి రూపాయీలు ఇచ్చియున్నారని వినుటకు చాల సంతోషమగుచున్నది ఈ కోటి రూప్యములీ క్రింది విషయములందు వ్యయపఱచుట వారి యుద్దేశమై యున్నది

1. గృహ పరిశ్రమలకు (Cottage Industries).
2. పరిశ్రమ యంత్రముల పరిశోధనకు
3 రాష్ట్రములోని యార్థిక పారిశ్రామిక విచారణకు.
4 పరిశ్రమ పరిశోధన సహాయమునకు.
5. ఇచ్చటగాని బయటగాని యువకులు పరిశ్రమలకై యభ్యసించిన వారికి సహాయము చేయుటకు.

ఈ యుద్దేశములు నిరభ్యంతరముగా నుత్తమమైనవి ప్రతి దేశము నేటి కాలమున పరిశ్రమలపై విశేషముగా నాధారపడియున్నది మన రాష్ట్రములో నింతవరకెవ్వరు పరిశోధక పండితులుగాని, శాస్త్ర పరిశోధకులుగాని, చారిత్రక పరిశోధకులుగాని, నూతన వస్తు నిర్మాతలుగాని (Inventors) యుత్పత్తి గాకుండుట చూడ నాశ్చర్యముగా నున్నది. లేకున్న నేటేట డజనుల కొలదిగా విద్యార్థులు విదేశములకున్నత విద్యానిమిత్తమై పోయి ప్రతి సంవత్సరమును లక్షల కొలదిగా సర్కారు వారి ద్రవ్యమును తినినను లాభము లేక పరిణమించుచున్నది. నిజాము రాష్ట్రములో నేత పరిశ్రమ మున్నగు పరిశ్రమలు సర్కారు వారిచే ఏల నడుపబడును? వాణిజ్యాది శాఖ యొకటి యున్నది. కాని యింతవరకు చెప్పకొనగలిగినంతటి ఫలితము మనకు గనుపించలేదు.

ప్రస్తుతము ప్రభుత్వము వారీ కోటి రూప్యములను వ్యయము చేయ నిశ్చయించి నందున ముందు గొప్ప గొప్ప మార్పులీ పరిశ్రమ శాఖవలన రాష్ట్రమునందు గలుగునని విశ్వాసము కలదు గృహ పరిశ్రమల యభివృద్ధి మొదటి స్థానమలంకరించి యున్నది. దీనిని నిజముగా నభివృద్ధి చేయనెంచిన మహాత్మగాంధీ గారి రాట్నమును గూడ గొంత పరీక్షించి చూడవలయును. మగ్గములు అగ్గువయు, శ్రేష్ఠమైనవియు, లాభకరములైనవియు, గ్రామములకు సులభముగా నేర్చుకొనుటకు వీలుగ నెగినట్టివియు, చూచి ప్రచార మందుంచ వలయును.

పరిశ్రమ యంత్రముల ప్రచారము (Demonstration) రెండవ కార్యముగా ప్రభుత్వమువారు నిర్ణయించినారు నగరములలో ప్రదర్శించు కొనిన నెవరికిని లాభములేదు మరియు ప్రదర్శించు యంత్రములు విశేషముగా వ్యవసాయ సంబంధముగాను, రాష్ట్రపు పరిస్థితులనుబట్టి యా సంబంధ మైనవిగాను నుండవలయును ఈ యంత్రముల ప్రదర్శనము గ్రామ ములో గావలయును ప్రతి గ్రామమునకు బోయి చేయుటకు మారుగా గ్రామ జనులు విశేషముగా గూడునట్టి జాతరలలో జూపింపవలయును మన రాష్ట్రములో ప్రతి జిల్లాయందును గొప్ప గొప్ప జాతరలు జరుగుచుండును. కొన్ని కొన్ని జాతరలలో వేనవేల జనులు కూడుచుందురు. అచ్చట త్రాగుడు విశేషముగా నుండుటయే కాననగును దానికి మారుగా నిట్టి ప్రదర్శనములు చూపించిన వారికెంతయో లాభకరముగా నుండును మేమెన్నియో మారులీ విషయమై వ్రాసియుంటిమిగాని చెవిటి ప్రభుత్వమునకు చెవుకెక్కుట లేదు.

నిజముగా నీ కోటి రూప్యములను సద్వినియోగము జేయవలయుననిన ప్రజలకు లాభమగు మార్గములందు దీనిని వినియోగ పరచవలయును. మొత్తము పై ప్రభుత్వమువారి యౌదార్యమును ప్రశంసించుచు వారి ద్రవ్యమును నధిక సంఖ్యాకులగు రైతులకు లాభకరమగు మార్గములలో వినియోగంతురని మరొక మారు నమ్ముచున్నాము

---

# మా అయిదవ సంవత్సరం

## 7-5-1930

మా పాఠకుల యాదరము వలనను, ప్రభుత్వానుగ్రహమువలనను మేము తిన్నగా నాల్గవ సంవత్సరమును దాటించితిమి ఈ సందర్భమున మేము నివేదింపకొనదలచిన విషయములు చాలాలేవు మా నాల్గవ సంవత్సరము హిందూ స్థానమందేగాక, నిజాము రాష్ట్రమందు కూడ చాల ముఖ్యమైనది. ఈ సంవత్సరమందే మహాత్మా గాంధీగారు తమ యపూర్వ యుద్ధమును ప్రారంభించిరి. సర్వ ప్రపంచ దృక్పథమును మార్చివైచు నీ యుద్యమము ప్రపంచ మందద్వితీయమై యున్నది. ఈ మహోద్యమము మూలలందుండు మా నిజాము సోదరులను గూడ కొందరి నాకర్షించినది.

ఇట్లొకవంక బ్రిటిషు హిందూ స్థానములో తిరుగుబాటు జరుగుచుండ ఉపన్యాసము లిచ్చుటకుగాని, యాందోళనము చేయుటకుగాని జనులు వెనుదీయక బ్రిటిషు ప్రభుత్వమును ముప్పతిప్పల పెట్టుచుండ మన నిజాము రాష్ట్రములో మా నాల్గవ సంవత్సరకాలమందు పోలీసు గష్తీ యొకటి బయలుదేరెను దాని వలన రాజకీయసభలుగాని, రాజకీయేతరములు కాని చేయుటకు వీలులేకపోయెను సర్వప్రపంచమందు సర్వహీనస్థితియందుండిన మన విద్యార్థికి తోడుగా నీ యవసర నిర్బంధములు మా ప్రజలపాలిట సుందరకంకణములై పొటమించినవి, బ్రిటిషు ప్రభుత్వమువారి దాతృత్వ మెంతటిదో కాని యచ్చట చిన్నచిన్న బాలురును, స్త్రీలును, సభా వేదికలపై యెక్కి యిష్టము వచ్చినట్లు వాగుచుండ వారిజోలికి పోయిన పాపమునకు పోకపోయిరి కాని మా రాష్ట్రములో రాజకీయములననేమియో తెలియని యమాయక ప్రజలు కేవల విద్య సంబంధపు సభల చేసికొందుమనిన వానికై నెలలకొలది కార్యభారములు జరిపి.........వాధినిగరానీలో సభలు...............వచ్చుచున్నవి.

............ వంక వాగ్బంధన విధానము ............ వృద్ధి నొందుచుండ నింకొ............పత్రికా ధ్వంసనము ప్రారంభమయ్యెను. సుమారు మూడు సంవత్సరములనుండి రైతుల పక్షమునసే తన కలము నుపయోగించిన రయ్యతు పత్రికనోట నీరుపోయు వారైనను లేక దిక్కులేని చావు చచ్చెను పాపము 9 వారములైన సరిగా ప్రపంచ వెలుతురు చూడని (న్యూయిరా) పత్రిక పురిటిలోనే గంతుకొట్టెను ఇంక మా గోలకొండ, రహబరె దక్కన్, సుబెదక్కన్, పత్రికకు మందలింపుచే భీతి కలిగెను. మన రాష్ట్రములో పదియవ భాగమైన తిరువాన్కూరు సంస్థానములో సుమారు 600 పత్రికలున్నవి కాని మన రాష్ట్రములో 6 పత్రికలైనను సరిగా లేవు. మా రాష్ట్రమున దినపత్రికలు పత్రికలే కావు మా ఉర్దూ దినపత్రికలు పలుమారు సంపాదకీయములే వ్రాయవు మా ఉర్దూ పత్రికలకు సంవత్సరమున ఒక్కొక్క తంతి వార్తకూడ రాదు!! బుల్లెటిన్ పత్రికను పట్టుకొని రాత్రి కూర్చుని దానిని అనుకూలమున్నంత వరకు తర్జుమా చేసికొని ప్రొద్దుననే అచ్చొత్తి బయటపడు నట్టివి మా దినపత్రికలు ఇక మా బుల్లెటిన్ కూడ విదేశ వార్తలను నిచ్చుటలో చాల యాలస్యము చేయుచున్నది ఈ పత్రిక లన్నింటిలో మన రాష్ట్రములోని జిల్లాలలో నేమి జరుగుచున్నదో తెలియనే తెలియదనవచ్చును. ఈ జిల్లాల వార్త లిచ్చుటలో మా గోలకొండయు, నిజాము విజయము తప్ప తక్కిన పత్రిక లిచ్చుటయే లేదనిన యతిశయోక్తి కాదు!!

ఇట్టి స్థితిలో యిట్టి యంధకారములో మేము తగుల్కొనియున్నాము. ఇక మా యాంధ్రుల సంగతి కొంత విచారింతము. ప్రస్తుత రాజకీయ హద్దులను బట్టియు, మా రాష్ట్ర భూగోళమునుబట్టి యేమి మద్రాసు భూగోళమునుబట్టి యేమి నిజాము రాష్ట్రము వేరు, మద్రాసు రాజధాని వేరు కావున ఉభయ ప్రభుత్వ ములు బ్రిటిషు ఆంధ్రులను నిజాము ఆంధ్రులనుండి విడదీసి యున్నారు. అయినను నీ యుభయాంధ్రులలో సామీప్యసారూప్యములు లేకపోలేదు. 64 లక్షల సోదరులను దక్షిణ ఆఫ్రికాకు పోయిన కూలీలనుగా తక్కిన యాంధ్రులు చూడ జాలరుగదా! అయినను అటులే చూచుచున్నట్లు మాకు గోచరించుచున్నది.

ఈ రాష్ట్రములో తెలంగానా మరట్వాడ ముఖ్య రాజ్య విభాగములు, అందు తెలంగానాలు 64 లక్షలు యాంధ్రులు, మరాట్వాడాలు 32 లక్షల మహా

రాష్ట్రిలును గలరు మహారాష్ట్రిల సంఖ్య తెలుగు వారలు సగమే యుండినను బ్రిటిషు రాజ్య మహారాష్ట్రిలు - అనగా బొంబాయి రాజధానిలో మహారాష్ట్రిలు తమ సోదరుల యెడ అత్యంత సానుభూతి చూపుచున్నారు పత్రికలందేమి, గ్రంథములందేమి, సభలందేమి, సర్వ విధములవారు తమ ప్రాంతములలో తమ సోదరుల విషయమై శ్రద్ధ పుచ్చుకొనుచున్నారు. ఈ శ్రద్ధ కొంచము శ్రుతి మించినదిగా కూడ నున్నది. కావుననే కొందరు మా రాష్ట్రమునుండి 'షేరు బదల్' అయిరి కొన్ని మహారాష్ట్రి పత్రికలు రాష్ట్రములోనికి రాకుండ నిషేధింపబడెను కొన్ని మహారాష్ట్రి గ్రంథములు కూడ నిషేధింపబడెను.

ఇది యిట్లుండ మా మద్రాసు రాజధానిలోని యాంధ్ర సోదరులు మాకేమి చేసిరని ప్రశ్నించుచున్నారు. అచ్చట పత్రిక లిక్కడి వార్తలనే ప్రకటించుట లేదు. నిజాము రాష్ట్రపుటాంధ్రులకు బ్రిటీషు రాష్ట్రపు జనులకు కాంగ్రెసు యెట్లో అట్లు ప్రధానమైన ప్రథమాంధ్ర మహాసభ జరుగగా దాని వార్తయైన యచటి పత్రికలు ప్రకటింపకపోయెను. ఇక ముఖ్యోపన్యాసములలో తీర్మానములు అచ్చువేయు దాతలెవరు? మొత్తము పై మాయనుభవమున మహారాష్ట్రిలలో నుండునంతటి ప్రేమ మా యాంధ్రులలో లేదు

ఇక మా రాష్ట్రములోని యాంధ్రుల స్థితిని విచారింతము. మీ సోదర రైతులను పాటకపు జనులను వర్తకులను-అనగా ఆంధ్రులందరు యవాచ్యహీన స్థితులు నుండినందులకు వర్తక రైతు సంఘములే తార్కాణము. ఈ సంఘముల ముఖ్యోద్దేశము ప్రజలు తమపై యన్యాయమైనట్టి దౌర్జన్యము లెవ్వరును చేయ కుండుటకై యాత్మ సంరక్షణము చేసికొనుట అనగా వీరికింతవరకు కష్టములే కలుగుచున్నవని దీని భావము.

నిజాము రాష్ట్రము ఏ శతాబ్దములో వృద్ధికి రావలయునో! యెన్నడు సర్వసంస్థానములందు నిజాముగా యుత్కృష్టమైనదని యనిపించు కొనునో, మా జ్యోతిష గణితములో నగోచరముగా నున్నది మేము మాత్రము మా శక్తి కొలది ప్రజా సేవ చేయుచుందుము. కాని ప్రజలు మాత్రము, తమ ధర్మము నెరవేర్చుట లేదు మేము పైన వర్ణించిన నీసమగ్రపు ఉర్దూ దిన పత్రికలకు ద్రవ్యము హెచ్చుగా నిచ్చికొనుటలో గౌరవము అని భావించు సోదరులనేకు

లున్నారు వారందరి దృక్పథము మారినట్లైన నిజమైన పత్రికలేవియో బయట పడును. కుక్క కూసలలో మంచివేవి యని పరీక్షించువారై వాని నన్నింటిని బావిలో వేయుదురు. అని పనికి రానివి యడుగునకు పోవ...మం...చివి యీదు కొని వచ్చును ఇటులే మా రాష్ట్రములోని సర్వ పత్రికల చందాదారులను పత్రికలను పరీక్షింపవలెను.

ఈ సంవత్సరము మేము......లో నొక ముఖ్యమగు .........చేయు చున్నాము ప్రజల యొక్క అభివృద్ధి తృప్తికరముగా నుండుట పత్రిక యొక్క పరిమాణమును పెద్దగా చేసి 12 పుటల నుండి 16 పుటల వరకు ప్రతి తడవ యిచ్చివేయుచున్నా...ము ఈ సైజులో ప్రచురించుట యుండుననగా పూర్వము సైజుకన్న రెండు వేలు పెద్దదిగా చేయుట యని పాఠకులకు నివేదింపనవసరము లేదు

ఇంత వరకు మాయందు అభిమానముంచి మాకు తోడ్పడిన సోదరులకు అందు ముఖ్యముగా మా రాజపోషకులకు, పోషకునికి, అభిమానులకు, విలేకరు లకు మేము కృతజ్ఞతా వందనము లర్పించుచున్నాము. పత్రిక చిన్నది. కార్యము పెద్దది. మా రాష్ట్ర సోదరుల అభిప్రాయమును గాని, వ్యాసములు గాని, ప్రచు రించుటలో, మేము స్థల సంకోచముచేత అనేక మారులు ఆలస్యము చేయుటయో, లేక ప్రచురింపక పోవుటయో కావించి యుందుము. ఈ లోపములను మన్నించి యందరును మాకు దోడ్పడుదురని ప్రార్థించుచున్నాము.

— —

# సరోజినీదేవి గారి నిర్బంధము

**24-5-1930**

సరోజినీదేవి గారు హైదరాబాదు నందు జన్మించిన వీరనారీమణి యని ఎల్లరు ఎరిగిన విషయమే వీరు కేవలము చిన్నప్రాయమునుండియే తమ మేధాశక్తిని జూపి ఎల్లరుల మెప్పును బడసిరి. వీరు హిందూ దేశమున కొనర్చిన సేవ అపారమైనదని అట్టి వారు నేడు కేవలము దేశసేవ జేయుటవల్ల కారాగార గృహమునకు పోవలసి వచ్చినప్పుడు వీరిని అభినందింపని వారెవరుండగలరు.

సరోజినీ దేవిగారు మొదటి నుండియు తన జీవితము దేశ సేవయందే గడపిరి అందుచే వీరి సేవకు మెచ్చి హైందవులు వీరిని కాంగ్రెసు అధ్యక్షులుగా గూడ నొక సంవత్సరము నెన్నుకొనిరి హైందవ స్త్రీలలో ఇప్పటికిని ఉన్నత స్థానము నలంకరించిన వారు వీరొకరే తర్వాత గూడ దేశ సేవా తత్పరులై అమెరికా ఖండమునకు వెళ్ళి మిస్ మేయోగారు వ్రాసిన "మదర్ ఇండియా" గ్రంథమువల్ల జరిగిన దుష్ప్రచారమును తమ వాఙ్మాధుర్యముతో నణంచివేసిరి. అక్కడనున్న ఆరు నెలలును వీరు హిందూదేశమునకై చేసిన కృషి అపారము. వీరి కృషిని మెచ్చుకొనియే వచ్చిన కొన్ని దినములకే వీరిని భారత మహిళా మహాసభ కధ్యక్షులుగా నెన్నుకొనిరి తరువాత గాంధీగారి ఉద్యమము రాగానే దానియందు హృదయ పూర్వకముగ పాల్గొని ఆతని మన్నన బడసి తుదకు వారి తదనంతము అదే ఉద్యమమునకు నాయకురాలుగా నియమింపబడిరి ఇట్టి నియతపదవి యందుండగ వారు చేసిన కృషి పత్రికా పాఠకుల కెల్లరకు విదితమే. ఇపుడు వీరికి దేహ మస్వస్థతగ నున్నదని తెలియుచున్నది కాబట్టి ఇట్టి భారత నారీ రత్నమునకు ఇంక నినుమడింతలు దేశసేవ నొనర్చుటకై భగవంతుడు చిరాయురోగ్యము నిచ్చుగాత!

---

# రామప్ప దేవాలయము

**9-7-1930**

ఓరుగల్లులోని రామప్ప దేవాలయము పునర్నిర్మాణము గూర్చి నైజాము ప్రభుత్వము వారు పదునాలుగువేల రూపాయల విరాళము నొసంగుట వేరుచో ప్రకటింపబడిన వార్తలవలన తెలియును ఈ దేవాలయములు ములుగు తాలూకా పాలము పట్టు అను నొక గ్రామమునకు రెండుమైళ్ళ దూరమున మహారణ్యములో గలవు. పిల్లల మర్రి, నాగులపాడు, పానగల్లు దేవాలయములకన్నను నీ దేవాలయముల శిల్పము మిగుల మనోహరముగానున్నది. పదునొకొండవ శతాబ్దమునాటి యాంధ్రుల శిల్పమును జూడదలతుమేని రామప్ప గుడి యందు మూర్తీభవించియున్నది. అచట గల శిలా శాసనముల వలన నీ యాలయము రుద్రదేవుని యనంతరము గణపతి రాజ్యారంభమున రేచర్ల గోత్రేయుడగు రుద్రసేనానిచే గట్టబడినటులందెలియుచున్నది.

చరిత్రాంశములతో నిండియున్న నిట్టి ప్రదేశమును కాపాడుటకు తల పెట్టిన ప్రభుత్వము వారిని మేమెంతేనియు నభినందించుచు, ఇట్టులే ఇతర ప్రాంతములందున్న ప్రదేశముల కాపాడ సలహానిచ్చుచున్నాము.

---

# ఉర్దూ నిఘంటు

## 23-8-1930

మన ప్రభుత్వము వారు ఉస్మానియా విశ్వవిద్యాలయమునకై పడరాని పాట్లు పడుచున్నారు. ద్రవ్యమును ఉదారముగా ఖర్చు పెట్టుచున్నారు ఇంతకు పూర్వము తర్జుమా శాఖపై మన ప్రభుత్వము వారు వ్యయము చేసిన విషయము విమర్శించియుంటిమి ప్రకృతము ఉర్దూ నిఘంటువొకటి సిద్ధము చేయుటకై మౌల్వీ అబ్దుల్లాఖ్ గారిని వినియోగించి యున్నారని వినుటకు చాల సంతోష మైనది. మౌల్వీగారు ఉరుదూలో అపూర్వ పాండిత్య ప్రకర్షను కలవారని విను చున్నాము అట్టివారిని నీయుత్తమ కార్యమునకై వినియోగించుట ప్రశంస నీయమే?

కాని ఒక్క విషయము మాత్రము విమర్శనీయము. మౌల్వీసాహెబు గారికి ప్రతి నెలకు 1000 రూపాయిల జీతముపై పది సంవత్సరముల వరకే పని యిచ్చియున్నారు అనగా వీరి పని పూర్తిచేయు వరకు రూ 1,20000 జీతము పొందుదురు.

ఇంతటి తోడనే పూర్తిగాదు ఇదంతయు సమగ్రమైన తర్వాత దీని అచ్చు వేయించవలెను ప్రభుత్వము వారి అచ్చు శ్రేష్ఠముగా నుండును వారి కాగితము ఉత్తమ గ్లేజు గలవిగా నుండుట కేమి సందేహము. ఇదంతయు పూర్తి అగువరకు 20 లేక 30 వేలు ఖర్చు అగును.

ఇన్ని రూపాయిలు ఖర్చుపెట్టి ఒక్క నిఘంటువును తయారుచేయుచున్న భాషయెంత ధన్యమైనదో యూహించుడు. ఆంధ్ర దేశమందు వేదము వేంకట రాయశాస్త్రి కన్న మించిన పండితుడు లేకుండెను. అట్టి వారిచే సూర్యరాయాంధ్ర నిఘంటు ప్రారంభము చేయించినప్పుడు వారికి నెలకు 250 రూపాయల కన్న నెక్కుడియ్యలేదు. కాని యీ ఉరుదూ నిఘంటువు చాల అదృష్టముతో గూడి నట్టిది.

ప్రభుత్వమింత ఖర్చు పెట్టుచున్నను ఉరుదూ తెనుగు నిఘంటుకు మాత్ర మొక్క పైసా కూడ యిచ్చుటకు బుద్ధి పుట్టలేదు. ఎవరి సహాయము లేకయె స్వయముగా ఏండ్లు పర్యంతము కష్టించి యుత్తమ పద్ధతిపై మహరాష్ట్ర నివాసి యగు కొండల్‌రావుగారు అను ఆంధ్రుడు ఉరుదూ తెనుగు నిఘంటువును వ్రాసి ముద్రించుటకై ప్రభుత్వ సహాయము కోరగా నతనికేమియు దొరకకపోయెను. బహుశః ఇట్టి నిఘంటువు ఉరుదూ భాషకు లేక ఉరుదూ మాట్లాడు వారికి లాభ కారి కాదేమో!

ఇంతియకాక మేము శ్రీమంతు రాజారాజేశ్వరరావు బహద్దరు దోమకొండ సంస్థానాధీశులు కేవలము నిఘంటువేకాక ఉర్దూ సర్వస్వమే(Encyclo Paedia) వ్రాసియున్నారు వారు వ్రాసి యుంచిన నిఘంటు గ్రంథము లౌక రెండెడ్ల బండి మోతకు తక్కువ కాదు అది మేముచూచి చాల ఆశ్చర్యపడి యున్నాము. మౌల్వీ గారికి పునః పరిశ్రమ లేకుండ శ్రీమంతు రాజాగారే వ్రాసి యున్నారు కావున ప్రభుత్వము వారు శ్రీరాజులుగారి యనుమతి పొంది వారి గ్రంథమును అవసరముండిన మౌల్వీ గారితో పరిశోధన చేయించి ముద్రించుట యుక్తముగా దోచుచున్నది. ప్రజల ద్రవ్యము విశేషముగా నీపద్ధతి వలన వ్యయము కాదు.

---

# మహాత్మాజీ జన్మదినం

## 20-9-1930

మహాపురుషుల జీవితములు సాధారణ ప్రజలం కాదర్శప్రాయములు, ప్రజలు వర్ధంతులు జరిపి మహాపురుషుల గౌరవింతురు భారతదేశమున నీ యాచారము పూర్వకాలము నుండి వచ్చుచున్నది శంకరాచార్య, రామానుజాచార్య మున్నగు మతాచార్యుల యొక్కయు రామ, కృష్ణ మున్నగు పురాణ కాల పురుషుల యొక్కయు జయంతులు భారతదేశమందంతటను, ఇప్పటికిని జరుపబడుచున్నవి.

ప్రపంచమందంతటను ప్రఖ్యాతి గాంచినట్టియు అహింసా సిద్ధాంతముచే జయము పొందవచ్చుననియు చాటిన మోహనదాసు కరంచంద్ గాంధీగారి 62వ జన్మదినము నిన్న తటస్థించినది పీరు వృద్ధులైనను యువకోత్సాహముతో భారత దేశ స్వాతంత్ర్యమునకు తీవ్రమైన కృషి సలుపుచుండుటచే ప్రపంచమునందన్ని దేశములవారు ముగ్ధులగుచున్నారు వీరి శాంతి సందేశమున కన్నిజాతులవారును జోహారు లొసగుచున్నారు. యుద్ధము వలన విసిగిన పాశ్చాత్యులు వీరి విధాన మవలంబించుటకు కుతూహలపడుచున్నారు కొందరు పాశ్చాత్య మతాచార్యులు గాంధీజీ క్రీస్తు అవతారమని కీర్తించుచున్నారు

గాంధీజీ దక్షిణాఫ్రికాయందును, భారతదేశమునందును, చేసిన త్యాగ మపారము తమ సర్వస్వమును దేశమున కర్పించిరి తుదకు భారత స్వాతంత్ర్యమునకు తమ ప్రాణముల కూడ నర్పింపయున్నారు. ఈ యుత్కృష్ట పురుషుడు, నిరాడంబరజీవి, త్యాగి, యోగి యొక్క జీవితము ప్రపంచము నందలి అన్నిదేశముల వారికిని, అన్నిజాతుల వారికిని, ఆదర్శప్రాయముగ నున్నది వీరి శాంతి సందేశము వలన ప్రపంచములో ముందు యుద్ధభయ ముండజాలదు, సర్వేశ్వరుడు వీరికి ఆయురారోగ్యముల నొసగి, భారత స్వాతంత్ర్యమునకు పాటుబడుటకు సహాయపడుగాత!

———

# మన స్థితిగతులు

## 6-12-1930

స్వదేశీలీగువక్షమున నిన్న దేవిడీన్‌బాగులో జరిగిన బహిరంగసభ చాల ముఖ్యమైనదని చెప్పవచ్చును ఈ సభ కధ్యక్షత వహించిన పండిత కేశవరావు గారు కరోడ్గిరి మహిసూలు వలన ప్రజలకు నష్టము కలుగుచున్నదని అంకెల ద్వారా తెలిపిరి. ఈ కరోడ్గిరి మహిసూలు (సుంకపు పన్ను కొన్ని వస్తువులపై మూడు నాలుగుసార్లు తీసికొనబడును) ఈ దేశమునందు తయారగు వస్తువులే నగరమునకు గొనితెచ్చినవానిపై పన్ను విధించుట చోద్యముగ నున్నది. ఈ విషయ మొక యుదాహరణము వలన బాగుగ తెలియగలదు ఒక నేతగాడు షోలాపూరము నుండి నూలు తెప్పించిన యెడల ఈ నూలు ఈ రాష్ట్రమునకు దిగుమతి చేయబడినందున దానిపై సుంకము వసూలుచేయబడును ఆ నేతగాడు ఈ నూలుతోనే నేసిన వస్త్రములను విక్రయమునకు దెచ్చిన మరల సుంకము వసూలు చేయబడును ఆ వస్త్రములనే ఒకడు కొని వేరొకచోటికి తీసికొని పోయిన అవి క్రొత్త వస్త్రములని సుంకము విధింపబడును ఈ ప్రకారము సుంకము అంటగట్టుటచే ఇచటి పరిశ్రమలకు తీరని నష్టము కలుగుచున్నది. మేమిదివరకెన్నియోసారులు సూచించినట్లు దయామయులగు ప్రభుత్వమువారు దేశీయ పరిశ్రమ లభివృద్ధి జెందవలయునని కోరుదురేని ఈ కరోడ్గిరి మహిసూలును వెంటనే తొలగించవలయును.

రామచంద్రనాయకు జాటెల్లాగారు హైద్రాబాదు ప్రస్తుత ఆర్థికస్థితిని దెలిపి విద్యాధికులను గ్రామముల స్థితి బాగుపరచుటకు పూనుకొనుటకై ప్రబోధించిరి ఫజలుర్రహిమాన్ సా॥ తెలిపినట్లు ప్లేగు, కలరా మున్నగు అంటువ్యాధుల వలన జనసంఖ్య తగ్గుచున్నది ప్రజలకు వైద్య సహాయము లభించుటలేదు. ప్రజలు విద్య నేర్చినవారు కానందున ప్రభుత్వమువారు చేయుచున్న సహాయమునుండి యైనను లాభము పొందుటలేదు. గ్రామముల పారిశుధ్యము కూడా బాగులేదు.

అందువలననే మరణసంఖ్య అధికముగ నున్నది ఎల్లప్పుడు ఏదోయొక వ్యాధి ప్రబలుచుండును ఈ విషయమున ప్రభుత్వమువారికన్న ప్రజలే తగుకట్టుబాట్లు చేసికొనవలసియున్నది గ్రామములో విద్యావంతులు తమ తోడి సోదరుల క్షేమ లాభములను దృష్టియందుంచుకొని వారికి ఆరోగ్య విషయమునను, యితర విషయములందును బోధ గావించిన కొలది దినములలో గ్రామముల స్థితిగతులు కొంతవరకైనను బాగుపడుననుటలో సందియముండదు.

మాడపాటి హనుమంతరావు పంతులుగారు నుడివినటుల తెలంగాణములోనే కల్లుదుకాణము లధికముగ గలవు. మత్తు పదార్థముల గ్రోలుటను ప్రభుత్వము వారి పద్ధతియే ప్రోత్సహించు చున్నదని దేశాభిమాను లనుకొనుచున్నారు. అబ్కారీ ఆదాయము ప్రతి సంవత్సరము పెరుగుచుండుటయే దీనికి నిదర్శనము. మత్తుపదార్థముల ధరలు హెచ్చిన వానిని యుపయోగించు వారి సంఖ్య తగ్గుచుండుట లేదు. కనుక ప్రభుత్వమువారు త్వరలో త్రాగుడు పద్ధతి నిర్మూలించుటకు నూతన పద్ధతి ప్రవేశపెట్ట వలయును

ఇచట దేశపురోవృద్ధికై పాటుబడువారే అరుదు ఉన్న వారైనను ప్రచారము చేయదలచినను బహిరంగ సభల గష్తివలన అటంకము కలుగుచున్నది. ప్రభుత్వమువారు బహిరంగ సభలకై అనుమతి నొసంగుచున్నను సభా సమావేశములకు అనుమతి పొందుటకు కొంత కాలము ప్రయత్నింప వలసివచ్చుచున్నది. దీనిచే సమయము మించిపోయి చేయదలచుకొనిన సభవలన అంతగా లాభము కలుగుచుండుట లేదు. దేశము నందావరించి యున్న అంధకారమును తొలగించుటకు ప్రస్తుతము ఉపన్యాసములే అవసరమై యున్నవి ప్రజలలో ప్రబోధము కలిగిన వారపుడు కార్యాచరణకై గడంగుదురు కనుక దేశాభివృద్ధి కలుగవలయునన్న ఈ బహిరంగ సభల గూర్చిన గష్తిని ప్రభుత్వమువారు వెంటనే రద్దుచేయవలయును ప్రభుత్వమువారు రాజకీయ సభలకై అనుమతి పొందవలయునను నిర్బంధముంచినను ఉంచవచ్చును, కాని విద్యా, సాంఘిక విషయిక సభలకై ఎట్టి నిర్బంధముల నుంచరాదని మేము కోరుచున్నాము.

---

# దేశ భాషలు – కచ్చేరీల వ్యవస్థ

**21-2-1931**

ప్రథమ ఆంధ్ర మహాసభలో గత వత్సరము చేయబడిన తీర్మానములలో 17 వ తీర్మానమిట్లున్నది

"గ్రామస్థులకు అనుకూలముగా నుండుటకై మున్సిఫ్ అదాలతులలోను, సబ్ రిజిస్ట్రారు కచ్చేరీలలోను వ్యవహారమంతయు ఇంగ్లీషు ఇలాకాలో వలె జనుల దేశభాషయందే జరుపుట అత్యవసరమని ఈ మహాసభ వారు ప్రభుత్వము వారికి సూచించుచున్నారు"

పై తీర్మానము ననుసరించి కేంద్ర సంఘ సభ్యులును మహబూబు నగరము జిల్లా వాస్తవ్యులును నగు శ్రీయుత ఎం. నారాయణరావు గారు (హైకోర్టు వకీలు) న్యాయ శాఖాధికారులతో నుత్తర ప్రత్యుత్తరములు జరిపి దేశ భాషల ప్రాముఖ్యతను సూచించిరి. "న్యాయ స్థానముల వ్యవస్థ యందు తక్షణమే మార్పు అవసరము" అను విషయమును గురించి "మష్హూర్" పత్రికలో శ్రీ నారాయణ రావుగారు వ్రాసియుండిరి

న్యాయ స్థానముల వ్యవస్థతో అమీరుల కింత సంబంధము గలదో నంత కంటె నెక్కువ సంబంధము బీదలకును, గొంగళ్ళను కప్పుకొను తెగలవారికిని గలదు ధనవంతులకంటె నెక్కువగా బీదసాదల హక్కులు సంరక్షింపబడుట అత్యవసరము మన న్యాయ స్థానముల ప్రస్తుత వ్యవస్థ యందనేక లోపము లుండుటం బట్టి ఈ విషయమున ఫలవంతముగ లేదు. జనులకు న్యాయము ప్రసాదింబడుటలో లోపభూయిష్ఠమైన వ్యవస్థ తన పర్యవసానమును గలిగించు చున్నది.

ప్రస్తుతము ప్రతి దినము అదాలతులలోని పనులయందు ముఖ్యముగా గనబడు లోపమును గురించి మాత్రమే విచారింతము దీనిని నివారించుటకు న్యాయశాఖ యొక్క ఉన్నతాధికారులును, ప్రభుత్వము వారును ప్రయత్నింతురుగాక!

మన న్యాయ స్థానములలో వ్యవహరింపబడు భాష ఉర్దూయై యున్నది. జన సామాన్యము వాడుకొను భాషలు మహారాష్ట్రము, కన్నడము, తెలుగు, సాక్షులు తమ సాక్ష్యమును గూడ స్వభాషయందే నొసగుచున్నారు నిందితులు గూడ సహృదయాంతర్గత భావములను తమ మాతృ భాషయందే వెల్లడి చేయుచున్నారు సాక్షుల యొక్కయు, నిందితుల యొక్కయు భావములను సరిగా తేటపరచునట్టి మార్గమున నేడవి గ్రంథస్థ మొనరింపబడుటయే సరియైన న్యాయ పద్ధతి యగును ఇట్టి రికార్డు పైననే న్యాయ పరిశీలన జరుగవలెను కాని దుర దృష్టవశమున న్యాయ శాఖలో పనిచేయు అధికారులు దేశ భాషలందు ప్రవేశము గలవారు కారు సాక్షులకు, నిందితులకు అదాలతు భాష తెలియదు. వీరిరువురి మధ్య అనగా అధికార వర్గము సాక్షులు నిందితుల పరస్పర భావములను వెల్లడించుటకు భాషాంతరీకరణము చేయువారు కావలసివచ్చు చున్నది ఈ కార్యము సులభమైనదిగను, అంత ముఖ్యమైనది గానిదిగను తలపడుచుండుట గూడ దుర దృష్టమే పరస్పర భావ ప్రకటన కార్యము కఠినమైన భాషాంతరీకరణ కార్య భారము అసాధారణమైన ప్రజ్ఞతో గూడికొనినదై యున్నది తర్జుమా చేయుటకు నియమింపబడు ఉద్యోగులు ఉభయ భాషా ప్రవీణులై యుండుటవసరమై యుండును. కాని అమలు తద్విరుద్ధమై యుండుట మనము చూచుచున్నాము. ఈ పద్ధతి నిర్మూలింపబడుటత్యావశ్యకము నిందితుల వాఙ్మూలములు వారి మాతృ భాషయందే గ్రంథస్థ మొనరింపబడుటయే ముఖ్యమైన పని ఇట్లే చేయవలెనని నియమముండినప్పటికిని మిసళ్ళు జూచినచో నూటికొక నిందితుని వాఙ్మూలమైనను మాతృ భాషలో రికార్డు చేయబడుచున్నదా యను సందేహము గలుగును భాషాంతరీకరణ మొనర్చువారు గూడ అంత విశ్వాసపాత్రులును, ఉభయ భాషా ప్రావీణులునుగను లేకుండుటచే వారు చెప్పు దాని పైన సంపూర్ణ విశ్వాసముంచుటకు వీలు లేదు. కనుక వీనిపై నాధారపడియుండు తీర్పులు న్యాయ పథమున నుండకపోవుట గూడ కొన్ని సమయములందు సంభవించును.

మనరాష్ట్రములోని ఉన్నత న్యాయ సభ యొక్క ప్రధాన న్యాయాధీశులు అనేక పర్యాయములు గష్తీల ద్వారాను, అహకాముల మూలమునను నిందితుల యొక్క వాఙ్మూలములను వారి మాతృభాష యందే రికార్డుచేయవలెనని నియమ మేర్పరచియున్నారు ఇట్లు జరుపుటకు వీలులేనిచో భాషాంతరీకరణ మొనర్చుటలో చాలా జాగ్రత్త వహింపవలెనని హెచ్చరించియున్నారు. ఈ విషయములందెంత వరకు శ్రద్ధవహింపబడుచున్నదో స్పష్టమే. అదాలతులతో సంబంధము గల వారందరును నైక కంఠముతో నీ విషయమున అదాలతు పని, వ్యవస్థ ప్రయోజనకారిగా లేదని చెప్పగలరు. ఈ విషయము ముఖ్యమైనదని వాదించుటకు మేము వెనుదీయము కాని ఇంతకంటె నెక్కువ లోపము గనబడుచున్నందున "ఉత్తముండకంటె అత్తముండ మేలు" అని మాత్రము చెప్పవలసి వచ్చుచున్నది

మనరాష్ట్రములోని దివానీ భాగమునందు గౌరవన్యాయాధిపతులకు మూడవ దర్జా అధికారములు గలవు. మున్సిఫులకు ఫౌజ్దారీలో జిల్లామెజిస్ట్రేటు యొక్కయు, దివానీలో 1000 రూ. అభియోగములను విచారించు అధికారములు గలవు. బ్రిటిషు ఇండియా కంటె ఈ విషయమున మనమెంతో ముందున్నాము మన తాలూకాలలో నుండు ప్రతి యొక్కనికిని అన్నిటికంటె నెక్కువయైన న్యాయస్థానము నుండి న్యాయము బడయు సౌకర్యమున్నది కానినిట్లు నిర్భయముగా చెప్పుటకు హృదయకంపముగలుగుచున్నది. ఏలననగా మనము నిజమైన న్యాయమును బడయుట లేదు. ఇందుకు ముఖ్యమైన కారణమునరయుదము గొప్ప అధికారములు గల మన మున్సిఫి మెజిస్ట్రేటుల వద్ద వాఙ్మూలములనిచ్చు సాక్షులలోను, కక్షదారులలోను నెక్కువ భాగము అదాలతీ భాష దెలిసిన వారు కారు న్యాయస్థానము (అదాలత్)నకు దేశభాషల పరిచయము లేదు భాషాంతరీకరణమొనర్చు ఉద్యోగులు నియమింపబడియుండరు, కనుక తీర్పు చెప్పువారు తమకు తెలియని భాషలో జరుగు వ్యవహారమును నెట్లు పరిశీలించ గలరు? ఈ పరిస్థితులలో "దుబాసి" (తర్జుమాపనిచేయువారు) సామాన్యముగా అదాలత్ చప్రాసీయో లేక హాజరున్న వారిలో నెవరోయైయుండిన ముఖ్యమైనట్టియు, బాధ్యతాయుతమైనట్టియు కార్యభారమును నిర్వహించి న్యాయస్థానమునకు న్యాయపరిశీలన కార్యమునందు తోడ్పడుదురు. తర్జుమాయైనను

ముక్కికిమక్కిగాని వాడక మాటలలోగాని జరుగదు. కొన్నివేళలందు వీరు చెప్పునదొకటి వారు చెప్పునది మరి యొకటియై యుండును కనుక సరియైన న్యాయమును బడయుట మిక్కిలి దుస్తరమగుట సంభవించును, కనుక ఉన్నత న్యాయశాఖాధికారులీ విషయమున శ్రద్ధవహించి ఈ లోపమును తొలగించుటకు కృషి సలపెదరని నమ్ముచునియ్యది వారి విద్యుక్త ధర్మమని హెచ్చరించు చున్నాము

ఈ విషయమును అధికార వర్గము ఒక్క జవాబుతో తెల్పివేసెదరని మాకు తెలియును ప్రస్తుత మెట్టి యేర్పాటు చేయుటకు "గుంజాయిషు" లేదని చెప్పుటయే వారి జవాబై యుండును న్యాయము ప్రసాదింపబడుటలో నీజావాబు తృప్తికరమైనదిగా జాలదని ప్రపంచమంతకును విదితమైయున్నది కనుక అధి కార వర్గము జనసామాన్యము యొక్క అవసరమును ప్రజాభిప్రాయమును చేయూతగాగొని ప్రభుత్వము నీ విషయమున బలవంతపెట్టవలెను న్యాయశాఖా వ్యవస్థయందు విస్పష్టముగా గానవచ్చుచున్న నీ కళంకమును దొలగించుటకు కృషిసలుపవలెను జనులు సరియైన న్యాయమును బడయవలెననుటయే మా దృష్టియందున్న విషయము. వ్యవస్థను విమర్శించి కళంకములను ఆక్షేపణ పూర్వకముగా జూపించవలెననెడి యుద్దేశ్యమే మాత్రముగాదు. ప్రజాభిప్రాయ ముతో బాటు అధికార వర్గము యొక్క సహాయముతో ప్రభుత్వము వారి దృష్టినిప్పట్ల నాకర్షించుటయే మాయాశయము. కనుక లక్షలకొలది రూప్యములు రాష్ట్రేతర ప్రాంతములకై వినియోగింప బడుటయు రాష్ట్రీయుల యోగక్షేమ మున కత్యంతవసరమైన వ్యయమునకై గుంజాయిషు లేదనుటయు సరియైన పద్ధతిగాజాలదు కనుక ప్రభుత్వమువారీ విషయమున శ్రద్ధవహించెదరుగాత



# ప్రతాపరుద్ర జన్మదినోత్సవము

**28-3-1931**

శా. శ 1176 అను ఆనందనామ సంవత్సర చైత్ర శు॥ ౕల రోజున (25-3-1254) కాకతీయ సామ్రాజ్యము నేలిన ప్రతిభాశాలియగు ప్రతాపరుద్ర సార్వభౌముడు జన్మించిన దినమని స్థానిక చరిత్ర చరిత్రవలనను ప్రతాప రుద్ర చరిత్రవలనను తెలియుచున్నది. ఇట్టి మహా పురుషుని జన్మదినోత్సవము జరిపి ఆ మహనీయుని యశోగానము గావించుట ఆంధ్రుల శ్రేయోభివృద్ధి కవసరమని గత బుధవారమునా డొక బహిరంగ సభ రెడ్డి గ్రంధాలయ భవన మునందు ఆంధ్ర యువకులు సమావేశ పరచిరి. ఇట్టి కార్యము చేత ఆంధ్ర యువకులు ఇతరులకు మార్గదర్శకులగుటయే గాక ఆంధ్రుల జీవితములను ధన్యము గావించిరి.

ఈ సభకు ముఖ్యోపన్యాసకులుగ నుండిన మారేమండ రామారావు పంతులు ఎం ఏ గారే యీ యుత్సవమునకు కారకులని చెప్పవచ్చును. వీలయిన ఆంధ్ర యువకు లీ వీరుని యుత్సవము సలుపవలయునని చాలకాలము నుండి తలంచు చున్నను, ఏ తేదీన జరుపవలయునో సందేహించు చుండిరి. కాని శ్రీ రామారావు గారు చైత్ర శు॥ ౕ రోజున ప్రతాపరుద్రుని జన్మదిన మని నిర్ధారణ పరచి ఆ మహనీయుని యశోగానము గావించుటకు ఆంధ్రులకు మార్గము చూపిరి.

జాతీయోన్నతికి వీరపూజ ముఖ్యాతి ముఖ్యము. వీరుల స్మరణయే జాతిని తేజోవంతముగను, శక్తిమంతముగను, నొనర్చును. దేశాభిమానము నకును, జాతీయాభిమానమునకును, వీరపూజయే మూలకందము. కనుక ఇట్టి సభలు ప్రతి వత్సరము జరుగుచుండ వలయును ఇపుడు జరిగిన యుత్సవము నకు తగినంత వ్యవధి లేకుండుట చేతను, కొన్ని అనివార్య కారణములు సంభవించుట చేతను, వైభవముగ జరుపుటకు వీలులేక పోయెను. అయినను

ముందు సంవత్సర మీ యుత్సవము ఆంధ్రవీరుని ప్రతిభకు తగిన వైభవముతో ఆంధ్ర యువకులు జరిపెదరని ఆశించెదము.

ఈ సందర్భమున నొక్కమాట జెప్పనిది నుండజాలము. ఏ మహా వీరుడు కాకతీయ సామ్రాజ్యము నఖండముగ నేలెనో, ఏ వీరుడు రణరంగమున పోరి రాజ్యమును, ప్రాణములను నర్పించెనో, ఎ ఆంధ్ర చక్రవర్తి నామము సర్వదా స్మరించుకొనవలసి యున్నదో, అట్టి శ్రీప్రతాపరుద్ర చక్రవర్తిని ఓరగల్లు నివాసులు మరచిపోయిరి. కాననే ఆ ప్రదేశమునందు మాంద్యము తాండవ మాడుచున్నది. ముందైనను ఈ వీరుని స్మరించిన నీ మాంద్యము తొలగ గలదు. కనుక రాబోవు సంవత్సరము ఓరుగల్లు నివాసులు ఈ యుత్సవము మహావైభవముతో జరిపి తమ ధర్మమును నిర్వహించెదరు గాత!

---

# మా యైదవ సంవత్సరము

## 9-5-1931

నేటికి మా గోలకొండ పత్రికకు అయిదు సంవత్సరములు పూర్తియైనవి. నిజాము రాష్ట్రమందు ఆంధ్ర పత్రికలకు అయిదవ సంవత్సరము గండము అని మా మిత్రులు చెప్పెడివారు. ఎట్లయిననసనేమి మా కా గండము తప్పినది.

మా అయిదవ సంవత్సరములో ప్రపంచమంతటను గొప్ప మార్పులు జరిగెను. బ్రిటిషు హిందుస్థానములో ముఖ్యముగా నెన్నడును జూడనట్టి సంచలనము జరిగెను దేశమంతయు సత్యాగ్రహతత్త్వముచే నిండిపోయెను వేలకొలది జైలుకు పోయిరి. వేలకొలది దెబ్బలు తినిరి. అనేకులు ప్రాణము లర్పించిరి. తుదకు గాంధీ - ఇర్విన్ ఒడంబడిక జరిగెను కాని యిట్లు అచ్చట ప్రచండ సంచలనము జరిగినను మా రాష్ట్రము మాత్రమే చిక్కులు లేక సుఖముగా నుండుట విశేషము అయినను బ్రిటిషు హద్దులపై యావరించెడి భావములు గాలిచే నిచ్చటికి కొన్ని గొట్టుకొని వచ్చిన వనుట నిస్సందేహము మన రాష్ట్రము నుండి గోల్మేజు సభకు ప్రభుత్వ ప్రతినిధులు వెడలియుండిరి.సభలో మన ప్రభుత్వ నియోజితులు మన రాష్ట్రమును గూడ ఫెడరల్ ప్రభుత్వములో చేర్చుటకు యంగికరించియున్నారు.

ఈ యంగికారము చాల ముఖ్యమైనది ఏలన సివిల్ పద్ధతిలో మన రాష్ట్రము చేరినట్లైన......ప్రజా ప్రాతినిధ్య సంస్థ లేర్పడుట తధ్యము

గత సంవత్సరమందు మన రాష్ట్రములో......మార్పులు విశేషముగా లేవు .....సం॥లో అయిన ఖాన్గీ పాఠశాలల గష్టీ......, రెండేండ్ల క్రిందటి 53 వ సభల గష్టీయును యుండిన మార్పులు జరిగినవని చెప్పగలుగు...... కాని ప్రజల మొరలు మన ప్రభుత్వము చెవికింకను బాగుగా నెక్కలేదని మాకు

వ్యసనము కలుగుచున్నది ప్రజలే రీతిగా నేడ్చిన నింపుయుండునో, యాయేడ్పు ఎప్పుడు మన ప్రభుత్వ......యమును గరిగించునో యెవ్వరును దారి...... వారు లేరైరి

గత సంవత్సరమందు ఆంధ్రులు కొంత దేశ...కార్యములు చేసినారు ముఖ్యముగా దేవర...సభ పేర్కొన దగినది. కాని యాంధ్రులలో కార్యదీక్ష చాలా తక్కువ. ఆంధ్రుల యభివృద్ధికి ఆంధ్రులే యాటంక పడువారు కాని యితరులు...ప్రతి గ్రామమందును పటేలు పట్వారీలు,......, దొరలు, దేశ పాండ్యాలు తమ తమ...జనులసేవ చేసినట్లైన యాంధ్రా...లోనే కాగలదు...

స్థితి యింకను హైక్య మొందుటలో నేమి సందేమి. **ప్రజలను పీడించి బ్రతుకుట రాక్షసకృత్యము. ప్రజల నోరు కొట్టి తమ కడుపులు నింపుకొనుట పైశాచము. ప్రజలను నిర్ధనులనుగా జేయుటడాకూలపని. ప్రజల నిరక్ష రాస్యులనుగా నుంచుట నాస్తికత. ప్రజలే గ్రామమున కలంకారభూతులు. ప్రజలే దేశ సంపదలకు మూలకములు. ప్రజల యభివృద్ధి సర్వతో ముఖాభి వృద్ధి. వారి నాశనమే సర్వనాశము.**

ఈ సూత్రములను ప్రతి' విద్యావంతుడును, ప్రతి ధనికుడును దృష్టి యందుంచుకొని తమ సోదర ప్రజలను వృద్ధికి దేగలుగుదురు గాక !

మన రాష్ట్రములో పత్రికా పఠనాభిలాష యింకను చాల తక్కువ బ్రిటిషు హిందూ స్థానములో ఘోర కల్లోలములు జరుగుచుండినను గాంధీగారి పేరు విననివారు కొందరున్నారు. పేరు వరకు వినినవారు గాంధీగారు జైలు నుండి యెప్పుడు వచ్చెదరు అని ప్రశ్నించువారున్నారు. మన ధనికులకు మొకద్దమాలపై యున్న యభిలాషలో శతాంశముకాదు సహస్రాంశమైన పత్రికలపై నుండిన వారు తరించగలరు

కచ్చేరీ వ్యవహారములపై ఖర్చుపెట్టు దానిలో సహస్రాంశము పత్రికలపై కర్చుపెట్టినవారు వృద్ధికి వత్తురు. తుదకు వారు తమ విదేశీ సిగరేట్లకు దినము నకు నాలుగణాలు వ్యయముచేయుదురు. కాని పత్రికలకై వారమునకు రెండణాలు వ్యయము చేయనొల్లరు.

మేము మా పత్రికా స్థాపనా కాలము నుండియు రెండంగములు దృష్టి పథమందుంచుకొని దేశీయుల సేవజేయు చున్నాము మొదటిది యాంధ్ర భాషా సేవ. రెండవది జాతికుల వివక్షత లేక నిష్పక్షపాతముగా నాంధ్రులలో సర్వ శాఖలవారి యొక్క సత్వరాభివృద్ధికై పాటుపడుట.

మన రాష్ట్రీయాంధ్రులలో విద్యావంతులమని చెప్పికొనువారిలో విశేషము వంతువారు మాతృభాషాభిమానములేనివారు అనేకులగు దొరలలో (అనగా కేవలము రెడ్లే కాదు వెలమలు, గోలకొండ వ్యాపారులు కూడ నీ దర్జాలో చేరిన వారు) వీరిలో జాతీయత కానరాదు వీరి వేషములబట్టి యెవరును వీరిని హిందువులని చెప్పజాలరు. వీరి భాషయు తెనుగు గాదు విశేషముగా హుర్దూ భాషయందే వ్యవహారములు జరుపుచుందురు అట్టిచో నాంధ్ర పత్రికలనినవారికి తలనొప్పి కలుగుటలో విచిత్రమేమియులేదు. మేము సర్వ శాఖలవారి యభివృద్ధికి గాను బాటుపడు విషయమునకు మా పాఠకులే సాక్షులు.

కాలము మారుచున్నది. నవీన భావములు ప్రబలుచున్నవి. దాని కనుగుణ్యముగా మనమును మన భావములను సవరించుకొనవలెను మన సాంఘికాచారములలో ననేకములీ నవీన కాలమునకు పనికిరావు రాజకీయముగా సహితము మనము చాల వెనుకబడియున్నాము మన రాష్ట్రములో ప్రజలకు రాజకీయాధికారములననేవో తెలియవు. ప్రపంచమందంతటను రాజకీయములు జనులకు ముఖ్య ప్రాణవాయువై యున్నవి ఏ రాజ్య వ్యవహారములు ప్రజల యనుమతిపై నడుపబడునో యా రాజ్యమందే రాజకీయ జ్ఞాన మున్నదని చెప్ప వలెను. ఏ రాజ్యమందు రాజకీయమందు ప్రజలకు.........లేదో యా దేశపు జనులకును చెంచువారికిని చాల భేదము లేదు కావున మేము ప్రజలకును ప్రభుత్వమునకు సూచించున దేమన మన రాష్ట్రములో ప్రజల తెలివి తేటలను వృద్ధికి తేవలనని వారికి మునిసిపాలిటీలలో శాసన సభలలో ప్రాతినిధ్య మొసగ వలెను

ఆంధ్రులందఱకును మా పత్రికను ప్రోత్సహించుట ధర్మమైయున్నది. ఈ రాష్ట్రమందలి యాంధ్రుల యాదరము తక్కువయగుటచేతనే అయిదు సంవత్సరములు సేవచేయు చుండిన 'నీలగిరి', 'తెనుగు' పత్రికలు గొప్ప

నష్టమునకు లోనై యాగిపోయెను అదేవిధముగ "సుజాత" పత్రిక బహు నష్టమునకు పాలై నిలిచిపోయెను ఒకవేళ పత్రికలలో లోపముండినను ఆంధ్రులు వానిని భరింపవలెను తమ బిడ్డ మురికిదని యెవరును పెంటపై పారవేయరు కదా! మన యాంధ్రపత్రిక లిచ్చట ఉర్దూ దినపత్రికలకన్న నెన్నటికిని తక్కువ యైనవి కావని ఘంటాపథముగా చెప్పగలము కాని యదేమి వ్యామోహమో అనే కాంధ్రులు ఉర్దూ పత్రికలను (చదువ లేకున్నను) చేతబట్టిన నది కేవలము హస్తభూషణమేకాక గౌరవప్రదమని కూడ తలతురు మేనత్తకు మీసము లతికించినంత మాత్రముననే పిన్నబ్బ కానేరదు. కావున మా పాఠకులు మాచేయు సేవ మా పత్రికావశ్యకత, ఆంధ్రోద్యమమున కిది మూలకందమని తలచి మమ్మాదరించుటను ప్రశంసించుచు తక్కిన విద్యావంతులను, ధనికులను నీ పత్రికను బహుళముగా నాదరించు నీటుల ప్రోత్సహింతురని కోరుచున్నాము ఈ పత్రిక చిరస్థాయిగానుండి యాంధ్రుల ప్రతిభను దిశదిశల ప్రసరింప జేయుటలో నగ్రస్థాన మలంకరించుటకై మా హితచింతకులందఱును చేయూత నొసగుదురు గాక!

మా పత్రికకు వ్యాసములును, వార్తలను పంపి, మాకు తోడ్పడిన విలేఖరు లందఱికిని మేమెంతయు కృతజ్ఞులము ముందుకూడ ఇదేవిధముగ సహాయపడెదరని కోరుచున్నాము.

——

# ఆంధ్ర మహా సభలు

**1-7-1931**

ఈ నెల 27 వ తేదీన ఆంధ్రభాషాభిమానులును, ఆంధ్ర ప్రముఖులును స్వార్థత్యాగులునునగు శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి యాధిపత్యమున గుంటూరు నందు ఆంధ్ర మహా సభ సమావేశమయ్యెను. ప్రకాశంగారు తమ యధ్యక్షోపన్యాసము నందు భావి భారతదేశ పరిస్థితులను వివరముగ చర్చించిరి. గత భారత స్వాతంత్ర్య సమరమున పాల్గొని అధిక కష్టములకు పాల్పడి, అహింసా వ్రతానుసారముగా సమరమును విజయ వంతముగా కొనసాగించిన ఆంధ్ర సోదర సోదరీమణులను ప్రశంసించిరి భాషా ప్రయుక్త నిర్మాణావశ్యకతను వివరముగా తెలియపరచిరి గత రౌండు టేబిలు మహాసభయందు సింధుదేశమును ప్రత్యేక రాష్ట్రముగా నొనర్చుట కను మతింపబడెను. కాని సుమారిరువది సంవత్సరముల నుండియే ప్రత్యేక రాష్ట్ర మునకై యాందోళనము సలుపబడుచున్న ఆంధ్రరాష్ట్రము గూర్చి యందెట్టి సూచనయుగావింప బడలేదు ఆంధ్ర రాష్ట్రము నుండి వెడలిన ప్రతినిధులలో నొకరుగూడ నిందుకై చర్చించలేదు. వీరు ప్రజాభిప్రాయము నేమాత్రమును నీసభయందు వెల్లడింప లేదు ఇందుచే వీరు ప్రజాప్రతినిధి యర్హతను బొంద లేదనియు, ముందు జరుగబోవు సభలో తప్పక ప్రజాప్రతినిధులు బోవలసిన యావశ్యకత గలదనియు, ప్రజలు ప్రభుత్వ నియోజిత ప్రతినిధివర్గము వలన నేమాత్రమును లాభము పొందజాలరనియు, తేటతెల్లమగు చున్నది.

పంతులుగారు హిందూ మహమ్మదీయ సమస్య గూర్చి అమూల్యాభి ప్రాయము నొసగిరి. వీరు సంయుక్త నియోజక వర్గములు దేశాభివృద్ధికి మూల కారణములని నుడివిరి. ప్రస్తుతము భారతదేశమందీ సమస్యకు ప్రాముఖ్యత కలిగినది. మహమ్మదీయులలోని జాతీయ పక్షము వారికిని షౌకతలీ పక్షము వారికినీ పరస్పర విరోధములుదయించినవి ఈ రెండు పక్షముల వారిని సమాధానపరచుటకై ప్రథమము నుండియు భూపాలు నవాబుగా రత్యంత ప్రశంసనీయమగు కృషి సలిపిరి కాని దేశ దురదృష్టమువలన నది విఫల

మైనట్లు సిమ్లాలో జరిగిన సమావేశము వలన విదితమగుచున్నది. భారతదేశము నందు హిందూ మహమ్మదీ యైక్యతను కాక్షించు మహానుభావులందరును, మహమ్మదీయులలో నధిక సంఖ్యాకులును, ముఖ్యముగా జాతీయ వాదులందరును, సంయుక్త నియోజకవర్గములనే వాంచించుచున్నారు. కొన్ని దినముల క్రిందట నిచటికి విచ్చేసి సుమారారు వారము లిచట నివసించినట్టియు, లాహోరులోని జమీందారు పత్రికా సంపాదకులైనట్టియు మౌలానా జఫరలీఖాన్ సా॥ గూడ సంయుక్త నియోజక వర్గములే కోరుచు ప్రస్తుత స్థితిగతులనుబట్టి పది సంవత్సరముల వరకు ప్రత్యేక నియోజకవర్గము లుండవలయుననియు, తదుపరి సంయుక్త నియోజక వర్గములు కావలయుననియు, యభిప్రాయ మొసగిరి. దీనికి జాతీయ పక్షము వారొప్పుకొనినను షాకతలీ పక్షమువారు ఇందు మరి కొన్ని కఠినతమములగు నిబంధన లేర్పరచిరి ఇక ముందైనను వీరు సమాధానమునకు వత్తురో లేదో చూడవలసి యున్నది. ప్రకాశంపంతులుగారు హిందూదేశ అంతస్సమస్యయగు నిది పరిష్కారముగాకున్నను రౌండు టేబిలు మహాసభ యందు పాల్గొనవలయునని యభిప్రాయమును వెల్లడించిది. గాంధీ మహాత్ముడును, కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యులును, దీనినే యంగీకరించినారు కదా! ప్రకాశంగారు సంస్థాన ప్రజల యధికారమును గూర్చి వివరముగ చర్చింపకున్నను పటియాలా మహారాజుగారు సమాఖ్య విధానమునకు సమ్మతింపక నూతన విధానమును సూచించుట గూర్చి తీవ్రముగా ఖండించి యితర సంస్థానాధీశులు వీరి యభిప్రాయమునకు సమ్మతిని తెలుపనందున సంతసించిరి సంస్థానాధీశులు బ్రిటిషిండియాతో బాటు సమాఖ్యలో చేరవలయునని వీరు సలహా నొసగిరి

మొత్తముపై వీరు భారత దేశాభివృద్ధికరములగు నట్టియు, భావ్యభివృద్ధికి ఆటంకములగు నట్టియు, విషయములన్నిటిని చర్చించిరి. వీరు ముఖ్యముగా కోరినట్టి విషయమగు ప్రత్యేకాంధ్ర రాష్ట్రమును గూర్చి ముందు జరుగబోవు రౌండు టేబిలు సభలో విచారణకు వచ్చునవియు, గాంధీమహాత్ముడు ఈ విషయమును గురించి శ్రద్ధ వహించుటకు సమ్మతించుటచే నిది సఫలమగుననియు, విశ్వాసము కలుగుచున్నది దీని కొరకు ఆంధ్రులు తమ యావచ్ఛక్తిని వినియోగించెదరు గాక! అంతః కలహముల చెలరేపి ఈ మహదాశయమునకు విఘ్నము కలిగింపకుందురు గాక!

---

# ఆంధ్ర మహాసభలు

## 4-7-1931

గత సంచికయందు ఆంధ్ర రాష్ట్రీయ మహాసభాధ్యక్షుడుగ ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారి ప్రారంభోపన్యాసమును విమర్శించుచు ప్రత్యేకాంధ్ర నిర్మాణావశ్యకత యెంతవరకు గలదో నిరూపించి యుంటిమి. ఇక ఆంధ్ర మహాసభయం దేమి తీర్మానింప బడినదో చూతము అధ్యక్షుడుగు వరహాగిరి వేంకట జోగయ్య పంతులుగారు ఆంధ్ర దేశమును ప్రత్యేక రాష్ట్రముగ నొనరింపవలయుననియు, ఇందుకుగాను ఆంధ్రదేశమున కన్ని విధముల అర్హత గలదనియు, నొక్కి వక్కాణించి యున్నారు. ఇట్టి ప్రాముఖ్యమగు విషయమున ఏ బుద్ధిమంతునికైనను భేదాభిప్రాయముండదని చెప్పగలము. ఆంధ్ర మహాసభయొక్క తొమ్మిదవ తీర్మానము ఇట్లు గలదు :-

"స్వరాజ్య నిర్మాణమునకు భాషాప్రయుక్త రాష్ట్రము లావశ్యకముగాని రాబోవు రాజకీయ సంప్రదింపులలోను, రాజ్యాంగ నిర్మాణము నందును, ఆంధ్ర దేశమును ప్రత్యేక రాష్ట్రముగ నిర్మించు నేర్పాట్లు గావింపవలెనని యీ సభవారు మహాత్మాగాంధీ గారికి విన్నవించు చున్నారు."

ఈ తీర్మాన మెంతయు సమంజసమై యున్నది. రౌండు టేబిలు మహాసభలు గాంధీ మహాత్ముడొకడే కాంగ్రెసు ప్రతినిధిగా వెడలు చున్నాడు గాన ఇట్లు తీర్మానింపబడినది మహాత్ముడు భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనసూత్రమును అంగీకరించియున్నాడు. అందువలననే కాంగ్రెసు సంస్థలు యీ విధానము ననుసరించి నెలకొల్పబడినవి

ఆంధ్ర మహాసభయందు గావింపబడిన తీర్మానములలో ముఖ్యమైనది మరియొకటి గలదు. ముందు ఆంధ్ర మహాసభను ఆంధ్ర రాష్ట్రీయ సభతో గాక ప్రత్యేకముగ జరుపవలయునను తీర్మానము. ఇందువలన ఆంధ్రోద్యమ ప్రచారము

తీవ్రముగ జరుగగలదని తలంచవచ్చును ఈ రెండు మహాసభలొకసారి జరుపబడుచుండుటచే ఆంధ్ర మహాసభ ప్రాముఖ్యత తగ్గిపోవుచున్నది. ఎల్లరి దృష్టిని రాష్ట్రీయ సభయే ఆకర్షించుచున్నది స్థాయి సంఘసభ లపుడపుడు జరుగనందున దేశములో చలన మెంతమాత్రము లేకున్నది. ఇకనైనను తీర్మానానుసారము స్థాయి సంఘము వారు ప్రతి మాసము గూడి ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమునకు గాను తీవ్రమైన ప్రచారము చేయవలయును

ఇంతియే గాక గుంటూరునందు మరికొన్ని మహాసభలు జరిగినవి. వీనిలో హిందీ మహాసభకు ధర్మవీర వామన రామచంద్రనాయకుగా రధ్యక్షత వహించిరి. వీరు రాష్ట్ర భాషయగు హిందీ యావశ్యకత నిరూపించుచు భావగర్భితమైన యుపన్యాస మొసగిరి హిందీ భాషకు రాష్ట్ర భాషయగుట కన్ని విధముల అర్హతగలదని తెలిపిరి వీరు సూచించినటుల విద్యాశాఖవారు ప్రతి పాఠశాలలో హిందీ బోధించుట కేర్పాట్లు గావించెదరని కోరుచున్నాము.

---

# దరిద్రనారాయణుడు

**3-10-1931**

దరిద్రనారాయణుడగు గాంధీమహాత్ముడు భారతదేశమున యవతరించి నిన్నటికి 62 సంవత్సరములు గడిచెను. ఈ మహాత్ముని దివ్యనామముతెలియని వ్యక్తి లేడనిన అతిశయోక్తి కానేరదు. గాంధీ మహాత్ముడు కోట్లకొలది బీదలకు సేవ జేయుటకును, వారిని యుద్ధరించుటకును యవతరించెను. తన యుద్దేశమును నెరవేర్చుటకై నేటికిని అహోరాత్రులు కృషి సలుపుచున్నాడు. మహాత్మునికి ప్రేమ, సత్యము, అహింస యను మూడు గుణములు మూలాధారములు అహింసయే విజయాస్త్రము ప్రేమవలననే శత్రువులను కూడ లోబరుచుకొనగలుగుచున్నాడు. భారతదేశములోని కోట్లకొలది బీదల దుస్థితి గాంచి సహించలేక తాను గూడ ఐచ్ఛిక దారిద్ర్యమును స్వీకరించెను. వారిని యుద్ధరించుటకై రాట్నపరిశ్రమ లేవనెత్తెను రాట్నమే బీదలకు భుక్తి నొసగునని ప్రపంచమునకు చాటెను ఇది యొక పిచ్చి యని పలువురు పరిహసించసాగిరి నేడయ్యదియే సుదర్శనచక్రముగా మారినది విదేశ వస్త్రములను భారతదేశమున దిగుమతి కాకుండ జేయుచున్నది నిరుద్యోగులకు పని గల్పించినది. భారతీయులకు స్వదేశీపై ప్రేమ గలిగించినది. మహాత్ముడీ రాట్నమును ప్రజల హర్నిశములు త్రిప్పవలయునని కోరుచున్నాడు ఖద్దరే సర్వదా ధరించవలెనని హెచ్చరించుచున్నాడు ఖద్దరువలన భారతీయులలో కలిగిన నూతనోత్తేజము గత సత్యాగ్రహ సమరమున ప్రపంచమునకై విదితమైనది బ్రిటిషు ప్రభుత్వము వారిని భయకంపితుల గావించినది. నిర్బంధప్రయోగములన్నియు వ్యర్థమైనవి సత్యము, అహింసపై ఆధారపడినచో జయము తప్పక చేకూరునను విశ్వాసము ప్రజలలో యుద్భవించినది వేయేల ఖద్దరువలన భారతదేశమున నూతనశకము ప్రారంభమయ్యెను. ఈ శకమునకు మూలపురుషుడు గాంధీ మహాత్ముడు. ఈయన బోధించుచున్నది ఖద్దరు మంత్రము. ఈ మూడక్షరములు జపించిన

వారికి భుక్తియు, ముక్తియు సమకూరును ధైర్యస్థైర్యములు గలుగును. ఇట్టి మంత్రమును జపించి ముక్తిబడయని దేశీయులుండజాలరు గదా!

గాంధీ మహాత్ముడు ప్రజల అర్థికస్థితి చక్కబెట్టుటకై పూనుకొనుటయే గాక దేశమునందు వ్యాపించిపోయిన దురాచారములను కూడ పెరికివేయుటకై పూనికొనెను మహాత్మునికి ముఖ్యముగా అస్పృశ్యత అమానుషమైనదిగా గన్పట్టెను భూతదయ బోధింపబడునట్టి భారతదేశమున తోడిమానవుల కుక్కల కన్న హీనముగా జూచుట మానుషలక్షణమునకు యోగ్యముగాదని తలంచి, అస్పృశ్యతానివారణమునకై భారతీయులకు ప్రబోధించెను ఈ దశాబ్దములో అంటరానితనము చాలవరకు తొలగిపోయినది దేశాభిమానుల ప్రయత్నమువలన నింకొక దశాబ్దములో అంటరానితనము పేరు లేకుండ సమసిపోగలదు.

గాంధీ మహాత్మునికి దైవముపై భక్తి మెండు. ప్రతి కార్యమునకు దైవ సహాయ మపేక్షించుచుండును ఉదయము సాయంత్రము భగవత్ ప్రార్థన సలుపును. దీని యొక్క యావశ్యకత ఇతరులకు బోధించుచుండును. ఇటీవల రాజపూతానా యొడలో నొక విద్యార్థి ప్రశ్నకు జవాబొసగుచు ఆత్మకు దైవ ప్రార్థనయను ఆహార మత్యవసరమనియు, ప్రార్థన జేయు కొలది మానవునికి పరమేశ్వరునిపై విశ్వాసము హెచ్చుననియు బోధించెను మహాత్మునికి భగవద్గీతలోని నిష్కామయోగము మూలకందము. పరమేశ్వరునిపై నిట్టి అచంచల భక్తి యున్నను కొందఱు మతాభిమానులవలె మతమను పిచ్చిలోబడి ఇతర విషయములను వర్జించువాడు కాడు తన మతమే శ్రేష్ఠమని ఇతర మతము వారితో వాదించువాడు కాడు తన మతమెట్లు శ్రేష్ఠమో, ఇతరుల మతము కూడ నట్టిదే యని భావించువాడు సర్వమత సహనము మహాత్మునికి విలువలేని భూషణము. ఏ మతము సిద్ధాంతముల నుండి యైనను సద్విషయములను స్వీకరించుటకు సంసిద్ధుడు. కనుకనే అన్ని మతముల వారును, అన్ని జాతుల వారును, గాంధీ మహాత్ముని ప్రేమించుచున్నారు.

గాంధీ మహాత్ముడు రాజకీయవేత్త గాడని కొందఱు వాదించెదరు అయ్యది నిరాధారమని తెలుపుటకు ఇటీవల రాజకీయ విషయములో అవలంబించు చున్న వైఖరి వలన గాన నగును. ఏ విషయము నందైనను మహాత్ముడు

సత్యముపై నాధారపడి యుండును నిష్కాపట్యముగను, మోసమేమియు లేకుం డను, తన అభిప్రాయములను వెల్లడింపను ఇతరులను లోబరచుకొనుటకును అసత్యములాడడు ఇతరులకు నష్టము కలిగించ వలయునని లతని యుద్దేశము కాదు గతవారము లంకాషేరు ప్రజల దుస్థితి గాంచి పరితపించుచు వారికి తగిన సహాయము చేయుటకై ప్రయత్నించెదనని వాక్రుచ్చెను అట్టి సుగుణము లన్నియు గాంధి మహాత్ముని యందు పుంజీభవించి యుండుటచేతనే భారతీయులు ఆయన నొక అవతార పురుషునిగ భావించు చున్నారు ప్రపంచ మంతటను ఖ్యాతి యినుమడించు చున్నది.

మహాత్ముడు ప్రశంసా వాక్యములతో తృప్తి నొందువాడు కాడు. రాట్నము చేపట్టిననే అతనికి సంతృప్తి కలుగును. మహాత్ముని కత్యంత ప్రియమైన విష యము ఖద్దరు. మనము ధరించుటకు సిద్ధపరచుటకై ప్రయత్నించుట, ఇతరు లకు బోధించుట మన కర్తవ్యమై యున్నది. అపుడే ఆ దరిద్ర నారాయణుని పూజించిన వారమగుదుము. దీని వలన మన కిహపరములందును మోక్షము గలదు. గత సమరమున తయారు చేయబడిన కోట్ల కొలది విలువగల ఖద్దరు నిలువయున్నదనియు, అయ్యది విక్రయించి మరల ఖద్దరు ఉత్పత్తికై చేవలకు పనిగల్పించ వలెననియు, కాంగ్రెసు మహా సభాధ్యక్షులగు సర్దారు వల్లభభాయి పటేలు గారు హెచ్చరించుచున్నారు. గాంధీ మహాత్ముడు మన రాజకీయ భవిష్యత్తు నిర్ణయించుటకై దూరదేశమున నున్నాడు. అట్టియెడ మన కర్తవ్యము మనము నిర్వహించి ఆయనకు తృప్తిగలిగించుట మన విధ్యుక్త ధర్మము. దరిద్ర నారాయణుని సంకల్పమునకు విజయము కలుగుగాక!



# తృతీయాంధ్ర మహాసభ

## 23-1-1932

ఎన్నడును గష్తీనిషాన్ 53 దెబ్బ యింత బాగా తగిలియుండలేదు. రెండు సంవత్సరములుగా ఆంధ్ర మహాసభలకు అనుజ్ఞ సులభముగా నెల పది పూటలకు ముందే దొఱకుచుండెను కాని యీ తృతీయాంధ్ర మహాసభా గ్రహచారమేమో పాపము ఇంక 13 దినములే మిగిలియున్నను నింతవరకు అనుజ్ఞ దొఱకలేదు ఆంధ్రులందఱును తహతహపడుచున్నారు ఒక దిక్కు కొల్లాపుర ములో వందలు వ్యయముచేసి మంటపములు సిద్ధముచేయు చున్నారనియు, నింతవరకు ఆ కార్యమునకై యెంతయో వ్యయమైనదనియు వార్తలు వచ్చు చున్నవి.

మఱియు కొల్లాపురము వారు ఈ సభలకు ప్రతికూలముగా నున్నా రనియు, తాము తమ సంస్థానము హద్దులతో సభలుచేయ నియ్యమనియు నను చున్నారని వినుచున్నాము సంస్థానము వారు సభలు రాజకీయములు కానంత వరకు, రాజద్రోహము చేయునవి కానంతవరకు తుదకు మతభేదములు యనుజ్ఞ నియ్యనొల్లరో యర్థమగుట లేదు. గష్తీనిషాను 53 వారికి వర్తించదని తలచి నారా? ఖాల్సాకు మాత్రమే యీ గష్తీ వర్తించును మాకిది వర్తించదని వారు అనజాలరు

ఇప్పుడీ వ్యవహారము బాబెహుకూమతు వరకు పోయినదని విను చున్నాము. ఒకవేళ బాబెహుకుమతు వారు సభ సంస్థానమందు చేయగూడదు, కావలసిన ఖాల్సాలో నెచ్చటనైనను చేయుడు. సెలవిత్తము" అని తీర్మానించిన (అట్లు చేయరని మా దృఢ విశ్వాసము) దీని ఫలితము చాల వికారముగా పరిణ మించునేమో! ఇట్టి యాజ్ఞను అధారముగా గొని యికముందు కొల్లాపుర సంస్థాన మందేకాక యే యితర జాగీరునందుకు తదధికారులు సభలనుచేయ నియ్యరని చెప్పవచ్చును. అట్టిచో సంస్థానములందుండు ప్రజలు చాలా కష్టముల

పాలకులగు తమకు విన్నతాపరచెదని, తమను పట్టిచాలెం చేయుచున్నారని, తమకు గ్రంథాలయము రావలెనని, తమ ప్రభువులతో నెట్లు చెప్పుకొనుచున్నారు ఇప్పటికైనను ఆలస్యమైనను బాబహుకూమతు వారు ఈ 2–3 దినములలో సెలవిత్తురని విశ్వసించుచున్నాము

ఈ యాంధ్రసభలు చాల నిరపాయములనియు ప్రజాహిత సంస్థలనియు, రాజభక్తి గలవనియు, మన నిజాము రాష్ట్ర పత్రికలన్నియు మిస్టాసుచేత సనదు హొందుటయే కాక నిచ్చటికి 500 మైళ్ళ దూరమున నున్న మద్రాసునుండి ఇంగ్లీషులో వెలువడు హైద్రాబాదు హెరాల్డు పత్రికచేతను మంచి సర్టిఫికెట్టును హొందెనని ఒకవేళ కొల్లాపుర అధికారులకు తెలియకున్నను సభ విషయమై మా బాబహుకూమతు వారికి బాగుగా తెలియును

---

# హైద్రాబాదు సివిల్ సర్వీసు

**2-3-1932**

బ్రిటిషు ఇండియా ఐ సి. యస్ పరీక్షలెట్లో, మైసూరు సంస్థానములో మైసూరు సివిల్ సర్వీసు పరీక్షలెట్లో, మన రాష్ట్రములో హైద్రాబాదు సివిల్ సర్వీసు పరీక్షలట్లు ఏర్పాటుఅయి అనేక సంవత్సరములైనది ప్రతి సంవత్సరము 52 విద్యార్థులను ఈ సర్వీసులోనికి తీసుకొనుచున్నారు. కాని యీ పరీక్షలలో మనకు బ్రిటిషు ఇండియాకును, మైసూరునకు చాల భేదమున్నది బ్రిటిషు ఇండియాలోని పరీక్షలకే విద్యార్థులు బి ఏ. పరీక్షయందు తీర్ణులై యుండవలెను. ఆ విద్యార్థులు పరీక్షయియ్య వలసిన విషయమంతయు, ఇంగ్లీషులోనే యుండును ఒక్క పత్రికమాత్రమే ఏదైన యొక ప్రాచీన భాషలో (Classical) నుండును.

మన రాష్ట్రములోని పరీక్షా విషయములో బహుకాలము నుండి ఏ కారణముచేతనో హిందువులు కృతార్థులగుటలేదు ఒక్కొక్క సంవత్సరమొక్క హిందువు సహితము సర్వీసునకెన్నుకొనబడడు ఇట్లు అనేక సంవత్సరముల నుండి జరుగుచున్నది. దీనికి కారణములు చాలమందికి సరిగా తెలియదు హిందువులకు ప్రోత్సాహము ప్రభుత్వమువారు కలిగించుట లేదని జనులనుకొను చున్నారనియున్నది సరికాదనియు ప్రభుత్వ పక్షమున యొక ప్రకటన కావింప బడెను. ప్రభుత్వమువారిట్లు అనుచున్నారు.

“సెలక్షను బోర్డువారు హిందువులకు ప్రతికూలముగా నున్నారని యనుచు న్నారు. కాని ఎన్నికలను జేయునప్పటి యంకెలజూచిన ప్రభుత్వము వారికంచ బును సమానులేయని విశదమగును. నియమముల ప్రకారము వయస్సులో ముల్కీ యగుటలో, ఆరోగ్యవిషయములోనే విద్యార్థి తృప్తికరమగు నిదర్శ నములను జూపించునో యతడు దరఖాస్తు ఇయ్యవచ్చును దరఖాస్తులను విచారించునపుడు ప్రభుత్వమువారు హిందులయెడ ప్రత్యేకముగా రియాయతీ చేయుచుందురు. ఆఖరు నియామకము పరీక్షా ఫలితమునుబట్టి యుండును.

పరీక్షకులు విశేషముగా రాష్ట్రమునకు బయటనుండువారే యుందురు. అట్టిచో ముసల్మానులయెడ పక్షపాతమెట్లుచేయగును. ఈయేడు సంవత్సరముల సంఖ్యలను జూచిన హిందువులు తక్కువసంఖ్యలో దరఖాస్తులిచ్చుచున్నారు. అది హిందువులతప్పే అయినను, వారిలో నెక్కువమందినే నామకరణము చేయుచున్నాము 16-32 లోని సంఖ్యల జూచిన 100 మంది హిందూ దరఖాస్తులలో 60 మంది నామకరణమైనది కాని......ముసల్మాను దరఖాస్తులలో 298 మాత్రమే నామకరణమైనది పోటీ పరీక్షలోనే హిందువులు క్రిందబడి పోవుచున్నారు"

ఇది ప్రభుత్వము వారి సమాధానము ప్రభుత్వము వారు హిందువుల విషయములో చూపించెడు ప్రేమకు మేము కృతజ్ఞులము మరియు ప్రభుత్వము వారు ప్రజల పక్షమునుండి నేవిధమైన యాక్రోశము కలిగినను వెంటనే దాని విషయమున తమ యభిప్రాయమును వెల్లడించుట చూడ వారి ప్రజానురాగము వెల్లడియగుచున్నది అందుచేత మేము ప్రభుత్వము వారికి రెండు మూడుసూచనలు చేయసాహసించుచున్నాము పై ప్రకటనలోని విషయములలోకొన్నిసమాధానములు మాకు సరిగా నచ్చలేదు నామకరణము అనునది వేరు. పరీక్షా ఫలితముగా నియామకమువేరు. నామకరణములో హిందువులనెక్కువగా తీసికొనినంతనే హిందూ విద్యార్థులకు లాభములేదు హిందువులలో నూటికి 60కి మారుగా 95 తీసికొని ముసల్మానులలో నూటికి 5 మందినే నామకరణము చేసిరనుకొనుడు. పరీక్షా ఫలితముగా ముసల్మానులు 5 లో 4 గురిని తీసికొని హిందువులలో 95 లో నెవ్వరినిగూడ గెలిపించక యుండవచ్చును. కావున పై నామకరణ సంఖ్యలవలన లాభములేదు. మనకు కావలసినది అసలు నియామకములు

హిందువులు నిశ్చయముగా చాలకొలది మందియే దరఖాస్తులిచ్చుచున్నారు. అది హిందువుల తప్పేయనుట కొంత నిజమను కొందాము కాని యంతయు హిందువుల తప్పుకాదు ఈ 15 - 20 ఏండ్లుగా హిందువు లెందఱు ముసల్మానులెందరు ఎన్నుకొనబడినారు ముసల్మానులే నూటికి 95 ప్రకారము తీసికొనబడి యున్నారు. ఇది చూచియే హిందువులకు దినదినము ధైర్యము తక్కువై లాభములేని యీ విశ్వప్రయత్నములేల యని మానుకొనినారు సాధారణముగా ప్రతి మనుష్యుడు ఎదుటి వాని భావము గుర్తించి పనిచేయును ఎదుటి వాడు

తనకు సుముఖుడు కాలేడని యొకనికి తెలిసిన వాడు వాని దగ్గఱకే పోడు ఎదుటివాడు తనయందు ప్రీతియున్నదని వాడు గుర్తుపట్టిన వాని దగ్గఱకు తాను పోవుటయే గాక తన బంధువులను గూడ బిలిచికొాను పోవును ఏ సంవత్సరమైన హిందువులు హెచ్చుగా తీసుకొనబడిన దాని ఫలితము మఱుచటి సంవత్సరమే విశదమగును, హిందువు లెక్కువ సంఖ్యతో ప్రయత్నింతురు ఇవియే దీని రహస్యము.

ఇక యొక ముఖ్య విషయమును గమనింపవలసియున్నది. హిందువుల నామకరణము హెచ్చుగా నుండిసను వారెందుకు పరీక్షలో కృతార్థులు కారు ఒకవేళ యిచ్చటి వారు పరీక్షకులుగా నుండిన పక్షపాతము చూపి యుందురని తలపవచ్చును. కాని యందఱును బయటివారే కదా పరీక్ష చేయునది

ఈ వాదము బాగుగానే యున్నది. కాని మా యభిప్రాయమున బయటి వారు కూడ ముసల్మానులే యుండవచ్చునని హిందువులు తలుచుచున్నారు. ఏలయిన విశేషముగా పరీక్షా పత్రములు ఉర్దూ సంబంధము కలవే అందుచేత ఉర్దూ వచ్చిన ముసల్మానులే ఈ పరీక్షకులుగా నుండిన విచిత్రము కాదు. అయిసను ఈ విషయములో మాకాక్షేపణము లేదు

మేమాక్షేపించునది పరీక్షా పద్ధతియే! పరీక్షలో మొత్తము 500 గుణములు. అవి యిట్లు విభజింపబడినవి

| | |
|---|---|
| ఇంగ్లీషు ప్రశ్నా పత్రిక | 100 |
| ఉర్దూ వ్యాసము | 100 |
| ఇంగ్లీషు నుండి ఉర్దూకు / ఉర్దూ నుండి ఇంగ్లీషుకు తర్జుమా | 100 |
| ఆధునిక సమస్యలు: ఇంగ్లీషులో 50, ఉర్దూలో 50 | 100 |
| నోటి జవాబులు | 100 |
| మొత్తం | 500 |

ఈ 500 నూర్లలో నోటి జవాబులు......... మూలకము కాసందుచే అందు భాషా జ్ఞానము......... అభిప్రాయ జ్ఞానమే ప్రధానము కాన అదిపోగా మిగతా 400 గుణములలో ఉర్దూ కొరకై 250 గుణములున్నవి. అనగా ఉర్దూ మాతృ భాష కలవారికెక్కువ సౌకర్యమున్నది. తక్కిన వారికి లేదు దీని

వ్యాఖ్యాన మేమన హిందువులకు కష్టము ముసల్మానులకు సులభము ఇదియే హిందువులు వెనుకబడుటకు ముఖ్య కారణము ఇదెట్లున్నదన ఉరుకుడు పందెములో కొందఱిని అడ్డు లేక చక్కగా ఉరుకుమనుటయు మరికొందఱిని తట్టుకపడు కట్టె అడ్డము పెట్టి ఉరుకుమనుటయు నెట్లో అట్లు (Running races Huddle race) సాధారణముగా లధికారులలో నడుమ పందెము (Walking race) ఉండును. అందు ముసలివారిని, పొట్ట పెరిగినవారిని, నడుము విరిగిన వారిని, నడ్డి వచ్చిన వారిని 100 గజముల దూరము ముందుగానే నిలిపి బాగున్న వారిని వెనుకబెట్టి పందెము నడుపుచుందురు ఈ సర్వీసు పందెము కూడ అట్లే కనబడుచున్నది. "యోడల్ ఫిద్మతు"లకు మన రాష్ట్రములో "ముల్కీ జబాను" పరీక్ష కెందు అట్లే యీ సర్వీసు వారికిని తెనుగు మహారాష్ట్రము, కన్నడములో నేదియైననొక భాష పెట్టి దానికని 100 మార్కులైన పెట్టిన అపుడు సంగతులు తెలియగలవు

మన రాష్ట్రములో పుట్టి తెలంగాణాలో పెరిగి నౌకరీలు చేయు గొప్ప అధికారులు తమ ప్రజల భాష యెరుగని వారు వందల కొలది యున్నారు. అట్లే మరట్వాడాలో. ఇపుడు హిందువులను 400 మార్కులలో 250 మార్కుల ఉర్దూ ప్రశ్నలకు సివిలు సర్వీసులో వ్రాయు మనిన తమ భాష కాకున్నను వారెట్లో ప్రయత్నించుచున్నారు హిందూ విద్యార్థులు ఉర్దూలో నూటికి 40 వచ్చిన పరీక్షలో కృతార్థులగుదురను కొందము ముసల్మాను విద్యార్థుల సౌకర్యార్థమై మరాటీ తెనుగు కన్నడ భాషలలో నేదేని యొకదాని యందు నూటికి 20 మాత్రమే గుణములు వచ్చిన కృతార్థులుగా చేయుటకైనే మొప్పుకొందుము

కావున హిందువులకు సౌకర్యములు తక్కువ దానిపై ప్రోత్సాహము లేకుండుట, అందుపై ఉర్దూలో విశేష భాగము పోటీచేయుట యివియే వారికి ఆటంకములు కలిగించుచున్నవి ఉర్దూ రాజకీయ భాష అనునది మాకు తెలియును. మరియు నితర భాషలు ముల్కీ భాషలనియు మాకు తెలియును ప్రభుత్వము వారికి తల్లిలేని పిల్లలపై యింకను యెక్కువ శ్రద్ధ యుండవలెను, లేకున్న (యతీంఖానా) లుండి యేమి ఫలము ఇపుడు "యతీంఖానా"లో చేరిన తెలుగు, మరాటీ, కనడీలకు మంచి గుణతుగల గొల్లభామ గడ్డిపాలనైన పోసి పెంచినచో మరి కొంత కాలము జీవింపగలవు

---

# భిక్షా నిరోధక శాసనము

## 30-3-1932

మన సిఫాయివారు మూడండ్లుగా మంత్రాలోచన జేయుచున్నారు భిక్షా నిరోధము చేయుదమా వద్దా అని మనము ఇంగ్లాండులో పూర్ లా (బీదవారి శాసనము) అనునది చేసిన 300 ఏండ్ల తర్వాతను భిక్షాశాసన మవసరమా లేదా అని యాలోచించుట మన సాంప్రదాయమున కేమియు విరుద్ధము కాదు

మన రాష్ట్రములో బీదవారుండున దెవరికి తెలియదు హిందుస్థానములో 7 కోట్ల మంది అన్నమో రామచంద్రా యనుచు ఉగాది పండుగ నాటి నుండి హోలీ పండుగ వరకును ఒక్కనాడును రెండు పూటలలో కడుపునిండ అన్న మెరుగక యున్నారని బ్రిటిషు, ఇండియా అధికారులే చెప్పియున్నారు ఇక హైదరాబాదు రాష్ట్ర విషయమేమి చెప్పవలెను.

అందుపై అజుడు అహమదుగారే కాక, రహబరువారే కాక, హెరాల్డే కాక, తుదకు మన ప్రభుత్వము వారును ముసల్మానులు బీదవారిని నిర్ణయించినారు వారికీ శాసనము చాలా సహాయము చేయును.

శాసనము చేసిన కేవలము భిక్షా నిరోధములో లాభము లేదు సర్కారు వారు భిక్షకులలో కుంటి గ్రుడ్డి ముదుసలిముతక, అనాది వారిని పోషించి తీరవలెను వారికి (బైతుల్ మాజురీన్) అనాథాలయములు కట్టి అందు వారిని బలవంతముగా నుంచవలెను వారికి మంచి భోజన వసతుల నేర్పాటు చేయ వలెను. తక్కిన మొండి బిచ్చగాండ్లను బిచ్చమెత్తనీయకూడదు మన దేశములో మంచి పైల్వానుల వంటివారును యువకులును, బిచ్చమెత్తుటయే ముఖ్య వ్యాపారముగాను, అందొక కులాచారముగాను నుంచుకొని యున్నారు. బుడుబుడుకల వారు బాలసంతువారును నాటకములలోని రాజాలవలె నానారంగుల బట్టలతో బిచ్చ మెత్తుదురు దొంగ సన్యాసులు, పక్కీరులు, జోగులు, జంగములు ఘుందిని

మోసము చేయుచుందురు కత్తులు మ్రింగువారు, పెద్దమ్మ భక్తులమని పెద్ద పెట్టెను మోసకొని కొరడాలతో శరీరమంతయు రక్తములుకార హింసించుకొనువారును పెద్ద బండల పొట్టలపై పెట్టుకొని యుండువారును, రోడ్లపై త్రాగుబోతువలె దొర్లుచు శరీరమంతయు భూతముల రీతి రంగురంగుల పట్టెలతో చిత్రించుకొని బిచ్చమెత్తు వారును వేలకు వేలు గలరు మొండి బిచ్చగాండ్రు తమకిచ్చిన సరే లేకున్న తిట్టిపోవువారును వేలకుగలరు ఇక పాముల వారు, కోతులాట వారు, గంగిరెద్దుల వారు, ఎలుగుబంటు వారు, జంతువులబట్టి ఆడించి బ్రతుకు వారొక కొందరు, వీరందరును శరీరదార్ఢ్యము కలిగియు బిచ్చమెత్తుట వలన దేశ సంపదకు నష్టము ఈ సరుకు పనికిరాని సరుకు (Un Prodective) వీరందఱిరి ప్రభుత్వమువారు పనిచూపవలెను ప్రభుత్వము వారి కంట్రాక్టు పనులును చెరువుల పనులును, ఇట్టి యితర పనులును మొదలు వీరితో పని తీసుకొనుస ట్లేర్పాటు చేయవలెను వీరట్లు చేయకుండిన వీరిని జైయిలున పెట్టి యుంచి వీరినుండి పనితీసుకొనుచు ఎన్నడు వీరికి బుద్ధివచ్చి పనిచేయుట కొప్పు కొందరో ఆనాడు వదలవలెను

ఈ శాసనము కేవలము నగరమునకే కాక రాష్ట్రమంతటికి గావించిన చాల మేలుగా నుండును. మేము మూడు సంవత్సరముల క్రిందటనే యీ విషయముగ మాయభిప్రాయ మిచ్చియుంటిమి. ఇప్పుడైనను కేవలము అభిప్రాయములతో తప్తిపడక మా పురపాలకసంఘము వారీ శాసనమును వెంటనే గావింతురని నమ్ముచున్నాము.

——

# మన ప్రభుత్వము వారి పాఠము

**30-3-1932**

రెండు వారముల క్రితము శ్రీ ప్రభువుగారు లక్నోలోని బాలికా పాఠశాలలో నిచ్చిన యుపన్యాసము వేరుచోట ప్రకటించుచున్నాము. శ్రీవారెంతటి ఘనమైన సంస్కారులో దానివలన విశదమగును. శ్రీవారి యాదర్శము కేవలము ముసల్మానులకే కాక హిందువులకును అనుకరణీయము. మన రాష్ట్రములో ముసల్మానులలో పరదా పద్ధతి విశేషము ఈ పరదా ఘోష అనుపదములు ఉర్దూలో నెట్టి యర్థములున్నవో సంస్కృతములో మాత్రము తగిన యర్థములే కలవై యున్నవి. పరద యనగా నితరులకిచ్చుట, ఘోషయనగా శంఖము పూరించుట ఈ యవస్థలు రెండును పరిహార్యములే

పరదా వలన స్త్రీలకేకాక పురుషులకును చాల ఇబ్బందులు కలుగుచున్నవి మన రాష్ట్రములో పరదా పూర్తిగా ముదరిపోయియున్నది ముసల్మానులను జూచి హిందువులును పరదాలోనికి దిగినారు ముఖ్యముగా మన ఆంధ్రులలోనే యీ ఆచారము ప్రబలిపోయినది మహారాష్ట్రులలో లేదనవచ్చును ఆంధ్రులలోను అందరిలో లేదు ముఖ్యముగా శ్రీమంతులగు రెడ్లు అనగా దేశముఖులు, జాగీర్దారులు, వెలమదొరలు గోల్కొండ వ్యాపారులు ఈ గోషాపై పట్టుదల చాలా కలవారు

శ్రీ నిజాం ప్రభువంత మహామహులే గోషాను వదిలి యుండ యిక తక్కిన వారికీ యభిమానమేల? యథారాజా తథాప్రజా యనునట్లు ప్రజలును ఈ యుత్తమాదర్శమును గ్రహించి యాచరించుకొందురు గాక

ఈ పర్దాపోయిన హిందూ ముసల్మానుల యైకమత్యము కూడ చేకూరు ననిన అనేకుల కాశ్చర్యము కలిగింప వచ్చును. కాని దూరముగా ఆలోచన చేసిన యథార్థమని విజ్ఞులు గ్రహింప గలరు. మనదేశములో దురాచార

ములు త్వరగా పట్టుబడుటయు, నవి వదిలింపుట దుర్ఘటమగుటయు చారిత్ర కానుభవము చెప్పగలదు తుర్కీవంటి పరదా రాజ్యమే సంపూర్ణముగా నొక్క దినములో పరదాను గాలికి విసరి వైచెను మన రాష్ట్రములో సహితము శ్రీ ప్రభువుగారి యుపన్యాసానుసారము హిందూ ముసల్మానులందఱును త్వరలో పర్దా ఘోష వదులు కొందురు గాక

పరదా వదులుట మంచిదా ఉంచుట మంచిదా యను విషయములో మౌల్వీలును, దొరలును, ఉంచుటయే మంచిదని వాదింప వచ్చును. పాశ్చాత్య దేశములో పర్దా లేనందున స్త్రీలు చెడిపోవు చున్నారనియు, ఎక్కడ జూచిన విడాకులే జరుగుచున్నవనియు వ్యభిచారములు జరుగుచున్నవనియు అజ్ఞులు కొందఱు పాశ్చాత్య స్త్రీలపై నిందలు మోపుచున్నారు కాని వారు యథార్థము తెలియక తమ దురభిప్రాయములను వెల్లడిచేసి కొనుచున్నారు. ఏ జాతిలో వ్యభిచారము హెచ్చుగా నుండునో యా జాతికి గౌరవము గాని ఔన్నత్యము గాని యుండనేరదు ఇంగ్లీషు వారిలో అనేక అనుకరణీయములైన ఉత్తమ గుణ ముండుట చేతనే వారు మనదేశములో 3 లక్షల మందియే యున్నను 3500 లక్షల జనులమైన మనలను సునాయాసముగా లోబఱచుకొని పరిపాలనము చేయు చున్నారని అట్టి ఇంగ్లీషు వారిని, మరియు నితర పాశ్చాత్యులను మనము బాగుగా నెఱుగక వారి సాంఘిక మర్యాదలు మనకర్థము కాకను, మన సాంఘిక మర్యాదలకు విరుద్ధముగా కనిబడినంతనే మనకవి సరిపడకుండుట చేతను మనలో ప్రబలిన సంకుచితాభిప్రాయములచే మన సోదరులు అనేకులు వారిని దూషింతురు........

---

# మన రాష్ట్రమందలి కాగిత పరిశ్రమ

**27-4-1932**

ఇంతవరకును మనరాష్ట్రములో కాగితముల పరిశ్రమలు పూర్తిగా లేవని భావింప జనదు. మనరాష్ట్రములో నేటికిని రెండుమూడు తావులందు కాగితములు తయారు చేయబడుచున్నవి. ఔరంగాబాదు నగరమునకు 10 మైళ్ళ దూరములో ఎల్లోరా గుహల సమీపమందు ఒక గ్రామము "కాగజ్‌పూర్" అని అన్నది. దాని పేరును బట్టియే దాని సంగతి తెలియును. కాగజ్ అనుపార్సీ పదమె నుండియే మన తెలుగులో కాగితము లేక కాగిదము అని యేర్పడినవి సంస్కృతమందు పత్రము అని యందురు. పత్రమనగా ఆకు. ప్రాచీన కాలము నుండి మొన్న మొన్నటివరకు మన పూర్వులు దక్షిణమున తాటి యాకులపైనను, ఉత్తరమున భూర్జపత్రములపైనను వ్రాయుచుండిరి. అందుచేతనే పూర్వవాసనా విశేషముచేత నేటికిని కాగిదములను సంస్కృతములో పత్రములని యందురు

కాని కాలము మారినది పాశ్చాత్య దేశములో అచ్చు పనులు వృద్ధియైన కొలదియు, గ్రంథములసంఖ్య హెచ్చైనకొలదియు, కాగిదముల యవసరము విశేషమయ్యెను. అందుచేత పాశ్చాత్య దేశములలో కాగిదముల యంత్రాలయ ములు వేలకొలది గలవు

మన హిందూస్థానములో బెంగాలులోను మద్రాసు రాజధానిలోను మొత్తముపై మూడే కాగితముల యంత్రాలయము లుండినట్లు కనబడుచున్నది. అందుచేత మన దేశములో నీ పరిశ్రమ యొక్క యవసరము చాలగలదు. ఈ యంశమును దృష్టి యందుంచుకొనియే మన రాష్ట్ర ప్రభుత్వము వారు మన రాష్ట్రములో నీ పరిశ్రమను స్థాపించవచ్చునా లేదా స్థాపించిన లాభముండునా లేదా యను విషయములను నిర్ణయించుటకై కొందరి శాస్త్రజ్ఞులను నియమించిరి వారు తమ పరిశోధనా ఫలితముగా నొక నివేదికను సిద్ధము జేసిరి అట్టి

నివేదిక యొకటి యీ యభిప్రాయార్థమై మాకు ప్రకటనశాఖ ద్వారా పంప బడినది

ఈ నివేదికలో హిందూస్థానములో ప్రతి సంవత్సరము 1 లక్ష టన్నుల తూకముగల కాగితము బయటనుండి దిగుమతి యగుచున్నదనియు నిప్పుడుండు హిందూస్థానపు యంత్రాలయములలో 45 వేల టన్నుల కాగితమే తయారగు చున్నదనియు, తెలిపినారు మన రాష్ట్రములో ప్రతి సంవత్సరము 1600 టన్నుల కాగితము దిగుమతి యగుచున్నదని 1335-1340 ఫసలీల లెక్కల నుండి చూపించినారు.

ఈ కారణములచేత మన రాష్ట్రములో కాగితపరిశ్రమ యవసరమని తోచినది. దీనికి తగిన స్థలము తగిన ధనము తగిన యితర సౌకర్యములన్నియు గావలసి యున్నది కాగితము సిద్ధము జేయుటకు వొంగులు (వెదురు లేక గోవా కట్టెయని కొందరందురు) ఆదిలాబాదు జిల్లాలో విశేషముగా కలవు. ఈ జిల్లాలో నేలబొగ్గుగనుల సామీప్యమునుబట్టి బొంగుల సమృద్ధినిబట్టి నీటి వసతినిబట్టి, కూలీల యవసరమునుబట్టి మంచెరియాలయును సిరిపురమును చాలా తగిన స్థలములనియు నీరెంటిలో సిరిపురమే పైచేయి యగుననియు నివేదికలో నిర్ణ యించినారు.

నివేదికలో సంవత్సరమునకు 5000 టన్నుల కాగిదమును తయారుచేయుట కంచనా వేయబడినను 10 వేల టన్నులవరకును తయారు చేయుటలో నిబ్బంది యుండదని చూపియున్నారు. 5000 టన్నులు సిద్ధమైనను మన రాష్ట్రముయొక్క అవసరములు పోగా బ్రిటిషు హిందూస్థానమునకు 3000 టన్నులకు పైగా ఎగుమతి జేయవచ్చును.

ఈ యంత్రాలయమునకై 50 లక్షల ధనము అవసరమని నివేదికలో చూపియున్నారు. ఇట్లు ఖర్చుపెట్టి స్థాపించిన దానిలో ప్రతి టన్నుకాగితములకై 366 రూపాయలు ఖర్చగునని యంచనా వేసినారు ఇపుడు మార్కెట్‌లో ఒక టన్ను కాగితములు 500 రూపాయలప్రకార మమ్ముదురనియు ఈ లెక్కప్రకారము ప్రతి టన్నుపై రూ. 134 లాభము దొరుకుననియు యీ ప్రకారము లెక్కించిన

నూటికి రూ. 5-11-0 ప్రకారము లాభము కలుగగలదనియు జూపినారు. ఇది మంచి లాభమే

ఇంతవరకు వేదికలోని ముఖ్యాంశములను జూపినారు ఇక నీ యంత్ర స్థాపన యవసరమా లేదా యను విషయమాలోచింతము. మన రాష్ట్రములోనికి వచ్చు కాగితములకై ప్రతి సంవత్సరము మనము 6 లక్షలకన్న హెచ్చుగా ఖర్చు పెట్టుచున్నాము మరియు ప్రభుత్వమువారే బహుశ యీ మొత్తములో నాల్గవ మొత్తము ఖర్చుపెట్టుచుండవచ్చును మన రాష్ట్రములో నీ పరిశ్రమకయి కావలసినన్ని సౌకర్యములుండినపుడెందులకు దీనిని ప్రారంభింపకూడదు. ఈ కార్యమును ధనికులెవ్వరయిన చేయుదురేమోయని ప్రభుత్వమువారూరకుండిన లాభములేదు ధనికులెవ్వరును క్రొత్తక్రొత్త మార్గములలో లక్షలు వ్యయము చేయుటకై సంసిద్ధులుగా నుండరు ప్రభుత్వమువారే దీనిని స్థాపించవలయును లేదా ప్రభుత్వమువారు హెచ్చుభారము వహించి మిగత భారమునకై వాటాల పద్ధతిపయి ప్రజలను భాగస్థులను జేర్చుకొనవచ్చును. మొత్తముపై ప్రభుత్వము వారే యీ కార్యాలయమును స్థాపించుట సమంజసము దానికి అనుకూలమైన సమయముకూడ నిదే సమయము!

---

# స్వ విషయము

**7-5-1932**

ఎటులో నొకరీతి యీ పత్రికకు ఆరవ సంవత్సరము సంపూర్ణ మయ్యెను ఈ సంవత్సర కాలమందు మా కార్థికపు చిక్కులు విశేషమయ్యెను నిజాం రాష్ట్రము వారికే ప్రత్యేకముగా నిదొక్కటియే వార్తా పత్రికయుండినను ఆరు సంవత్సరములుగా దీని విలువను ప్రజలు గమనించుచుండినను ఆదరము మాత్రము హెచ్చుటకు మారుగా తగ్గుచున్నది ఇది మా దురదృష్ట విశేషము. ఈ పత్రిక నేదేని బాల జాడ్యముల చేతనో, భూతములు సోకుట చేతనో క్షయ రోగము చేతనో, పుటుక్కున ప్రాణము గోల్పోయి నిలచిపోయిన తర్వాత అది మా దుదృష్టమగుటకు మారుగా నిజాము రాష్ట్రాంధ్రుల దురదృష్ట మనుటలోనేమియు సందేహముండదు ప్రకృత పరిస్థితులలో క్రొత్త పత్రికలకు సెలవు దొరకుట నభః పుష్పమువంటిదే! కావున నికముందు ఆంధ్రులు దేనిమూలమున నిజాము రాష్ట్రాంధ్రోద్యమమును, నిజామాంధ్రుల యభివృద్ధియు, నార్తిచే హాహాకారములుచేయు నోరులేని పల్లెటూరి జనుల త్రాణణ్యతయు, దుర్మదాంధుల దౌష్ట్య దౌర్జన్యముల క్షైణ్యతయు, నీ రాష్ట్రమందు జరుగుచున్నదో యట్టి గోలకొండ పత్రికను నిలుపుటయా? నీల్గించుటయా? యీ సమస్యను పరిష్కరించు భారము ఆంధ్రులదై యున్నది. మేమెన్నడును ప్రత్యేక కులము జాతికి సంబంధించిన పద్ధతిపై పత్రికను నడపకుండిన మేమెన్నడును స్వార్థలాభము గోరి మా ఖజానాను వృద్ధి చేసికొన గోరకుండిన నిజాము రాష్ట్రాంధ్రులు తప్పక మాకు సహాయము చేయవలెను.

నిజాం రాష్ట్రాంధ్రులకే కాక ప్రజలకంతయు సంబంధించిన సమస్యలను గురించి చర్చించునదీ గోలకొండ పత్రిక యొక్కటియే యని యందరు గుర్తెరుగుదురు గాక! బ్రిటిషాంధ్ర పత్రికలు తమ సంపాదకీయమందు సంవత్సరమున కొకనాడైనను మన సమస్యలు చర్చించునట్లు కానరాదు గష్తీ నిషాన్ 53 అనునదేమి పురాణమో, వారికి తెలియదు. 1334 ఫసలిలోని ఖాస్గి పాఠశాలల గష్తీ వారి కెరుకలేనట్లే మన అజీజహ్మదుగా రెవరో వారికి

తెలియదు. మన రహబరుగారును, సహీఫాగారును నేమేమి వ్రాయుచుందురో యీ పత్రికల స్వరూపమెట్లుండునో పాపము వారెన్నడును చూచినవారు కారు, మొన్న మొన్న మన ప్రభుత్వమువారు ప్రకటించిన కమ్యూనిక్ విషయమై అనుకూలముగనో ప్రతికూలముగనో తమ తమ యభిప్రాయములను బ్రిటిషు ఆంధ్రదేశమందలి పత్రికలో నొక్క పత్రికయైనను వర్ణించరాదా? ఏ మూలనో నున్న అమృతబజారు పత్రికయు, నెందోకల బొంబాయి క్రానికల్, లీడర్ మాడరన్ రెవ్యూ వంటి పత్రికలు చర్చించియుండ 70 లక్షల ఆంధ్ర సోదరుల కును నితరులవలె సంబంధించిన యీ నేటి సమస్యపై పెదవులపై ఆంధ్ర సోదరా అని యుచ్చరించుచు సోదరులే లకో మౌనముద్ర వేసికొని కూర్చుని యున్నారు మన రాష్ట్రములో చందాదారులు మాత్రము విరివిగా మన "సోద రులకు" దొరికిన చాలునేమో!

ఇట్టి క్లిష్టసమయములందు స్థితి యెట్లున్నదో పాఠకులేమి యెరుగుదురు. ఆర్థికపు చిక్కు లొకప్రక్క, ప్రజాహిత మొకప్రక్క, ప్రభుత్వ భయ మింకొక ప్రక్క అన్నియు పెనగొనియుండినను మా "కలమును" నేరాళ్ళపై చెడకుండ నడిపించుకొనుచు వచ్చియున్నాము

మా యారవ సంవత్సరమున ప్రజలకు చాల ఆర్థికపు కష్టనష్టములు కలిగెను. ఈ కారణముచే మేము చందాను సహితము నష్టమైనను తక్కువ చేయుదమా అని ఆలోచించితిము కాని మా కిదివరకే నష్టములు కలిగినందున మా యభిప్రాయమును మానుకొనవలసివచ్చెను.

మాలో లోపము లేమైన నుండిన పాఠకులు మాకు సూచించగలరు. పాఠకుల సూచనలు మా పత్రికలో ప్రకటించుటకును సంసిద్ధులముగానున్నాము. అట్లు ప్రకటించి బహుజనుల సమ్మతమైన నా ప్రకార మాచరించుకొందుము. మా యుద్దేశము ప్రజల యొక్కయు, శ్రీ ప్రభువు యొక్కయు మనదేశము— అనగా నిజాము రాష్ట్రము యొక్కయు సేవజేయుటయే యని మేము పలు మారులు చెప్పియుండినను జ్ఞాపకార్థము మరల యిప్పుడు సూచించుచున్నాము. ప్రభుత్వము యొక్క యుద్దేశములను ప్రజలకు తెలుపుటయు, ప్రజల యాశయ ములను ప్రభుత్వమునకు ఎఱిగించుటయు మా ముఖ్యోద్దేశము.

గత సంవత్సరము మేము చేసిన ప్రజాసేవ చాల కొలదియే యని మేమెరుగుదుము. ఈ సంవత్సరము మా పాఠకులును, ప్రభుత్వమువారును మాకు తోడ్పడి ఇతోధిక సేవ జేయుటకు ప్రోత్సహింతురని కోరుచున్నాము.

———

# మన రాష్ట్ర పరిశ్రమలు

**25-6-1932**

బహు కాలమునుండి మన రాష్ట్రాభివృద్ధిని, తద్వారా ప్రజల యభివృద్ధిని గోరునట్టి పూజ్యులైన మ॥ఘ॥వ॥ మన ప్రభువుగారు మన రాష్ట్రములో పరిశ్రమ శాఖను నేర్పాటుచేసియున్నారు ఇదెంతయు సంతోషింపదగిన యంశము ఇంతియే గాక శ్రీ ప్రభువుగారు మూడు సంవత్సరముల క్రింధట పరిశ్రమాభివృద్ధి కని 1 కోటి రూప్యములను ప్రత్యేకించుట కాజ్ఞాపించిరి. ఈ యొక్క యంశమే మన యజమానులకు తమ ప్రియమైన ప్రజలందుగల ప్రేమను జాటుటకు తగి యున్నది. ఆర్థికశాఖా మంత్రులగు సర్ హైదరు నవాజుజంగు నవాబుగారును తమ యపూర్వ శక్తి సామర్థ్యములను ప్రకటించి పరిశ్రమల కింత గొప్ప మొత్తమును సంపాదించియుంచిరి కాలిన్సుగారును ఈ పరిశ్రమ శాఖాధ్యక్షులై తమ యావచ్ఛక్తిని వినియోగించి, యీ రాష్ట్రమందు దినదినము పరిశ్రమలే గాక వ్యాపారమును, సహకార సంఘములును, వ్యవసాయమును సత్వరాభివృద్ధి పొందుటకై చాల పాటుపడుచున్నారు.

మన రాష్ట్రములో ప్రాచీనమునుండి కొన్ని పరిశ్రమలు చాల యభివృద్ధిలో నున్నవి కేవలము నిజాము రాష్ట్రమందేకాక బ్రిటిషిండియాకును మన సరకులు దిగుమతి యగుచున్నవి. బీదరు, పెంబర్తి, ఔరంగాబాదు, ఒరంగల్, అలం పూరు, వంటి స్థలములు, లోహపు పనులకును, నేత పరిశ్రమలకును చాల ప్రసిద్ధి చెందినట్టివి. ఇప్పుడిప్పుడు గాజు పనులును, సబ్బు పనులును, మిల్లు బట్టలును, సిగరేట్లును, మన రాష్ట్రములో తయారగుచున్నవి. సిగరేట్ల కొరకై శాక క్రొత్త పొగాకు నిపుణుని పిలిపించియున్నారు. వ్యవసాయులకై జాతర లందేకాక ప్రతి సంవత్సరము రెండుమారులు జిల్లాలలో వ్యవసాయ ప్రదర్శన ములు చేయుచున్నారు

GPS-9 (I)

ఇన్ని సౌకర్యములుండియు ప్రజలు దీనివలన లాభము, పొందకుండిన అది ప్రజల తప్పే యనవలెను ప్రజలకు పరిశ్రమల విషయమై సహాయము కాని, సలహాలు కాని కావలసి యుండిన పరిశ్రమ శాఖాధ్యక్షులగు కాలిన్సుగారికి వ్రాసికొనిన వెంటనే వారికి తగు సహాయము చేయుచున్నారు

ప్రభుత్వము వారికిని నొక సూచన గావింపదలచుచున్నాము. మన రాష్ట్రములో సిద్ధమగు వస్తువులను మొదలు ప్రభుత్వ కార్యాలయములును, తర్వాత అధికారులును, కొనునట్లు ప్రోత్సాహము చేయవలెను. మన రాష్ట్రపు సబ్బులను మన రాష్ట్రమందలి వైద్యాలయము లన్నింటికి సబ్బులపై కరోడిగిరి హెచ్చుగా తగిలించిననేగాని మన సబ్బులు వృద్ధికి రావు. అదే ప్రకారము మన కచ్చేరీలకు కావలసిన "సాదర్" మన రాష్ట్రములో తయారైనవే తీసికొనవలెను

రెండవ సూచన యేమన మన జనులు సాధారణముగా బీదవారగుట చేత పెద్ద పెద్ద కార్ఖానాలు పెట్టించిననవి కొలది మంది ధనికులకే పనికి వచ్చును కావున నట్టి వానికన్న విశేషముగా గృహ పరిశ్రమలకే సహాయము జేసిన బీదలకు చాల లాభము కలుగును. నేత మగ్గములలో డేనిష్ యంత్రము వంటి మంచి యంత్రములను నేతగాండ్ర కిచ్చి వారికాపని నేర్పించిన బాగుండును అదే విధముగా సర్. పి. సి. రాయిగారు "దేశీరంగ్" అను గ్రంథములో వ్రాసినట్లుగా స్వదేశీ రంగులను తయారుచేయుటకు జనులకు నేర్పవలెను

ఇప్పుడు నేయనట్టి తివాసీలు, జంపుఖానములు (పత్రంజీలు) మేలైనవి శీఘ్రముగా అగ్గువగా నేయు పరికరముల చూపించవలెను

ఇట్టివే తక్కువ ఖర్చుతో నెక్కువ లాభము కలిగి బీదవారు సహితము కొద్ది మొత్తముతో జీవించగలుగు పరిశ్రమలను వృద్ధి చేయుదురని గోరుచున్నాము.

——

# బాలికల ఉన్నత పాఠశాల

## 2-7-1932

శుక్రవారము నాడు రెడ్డి బోర్డింగులో బాలికల ఉన్నత పాఠశాల యొక్క బహుమాన ప్రధానోత్సవము జరిగెను ఆ సభకు వచ్చిన ప్రేక్షకులు అనేకులు స్థలము జాలక వాపసు పోవలసివచ్చి బాలికల విద్య యందిప్పుడు మన ఆంధ్రు లందు గాఢమైన అభిమానము కలుగుచుండినందులకు చాల సంతోషము పాఠ శాలలో విద్యార్థినుల సంఖ్య కూడ రెండింతలైనది. ఈ పాఠశాలను నింతటి పట్టుదల తోడను, అభిమానము తోడను, శ్రద్ధతోడను దినదినాభివృద్ధి గావించినట్టి శ్రీయుతులు మాడపాటి హనుమంతరావు గారును, వడ్లకొండ నరసింహారావు గారును చాల ప్రశంసింపదగినవారు ఆంధ్రులందరును వీరు చేయుచున్న కృషికై గర్వింపవలసినది. ఇట్టి యుద్యమము మహారాష్ట్రిలందును లేదు. వారు బాలురకు వివేకవర్ధనీ సంస్థను నడిపించుచున్నను మన హనుమంతురావు గారు తదితరుల సహాయముచే నీ బాలికల సంస్థను నడిపించుట నంతకన్న హెచ్చైన పని.

కాని ఈ పాఠశాలకు ధనికుల యాదరణ లేదు ప్రభుత్వమువారి యాద రణ అంతకు తక్కువయ్యెను. ఉస్మానియా విద్యా పీఠము యొక్క ఉద్దేశము లలో మొదటి యుద్దేశము జనుల మాతృ భాషలో విద్య నేర్పించుటయై యున్నది. అది యట్టిదనియే భావించి మాలవ్యా వంటి గొప్పవారు దానిని శ్లాఘించిరి మన బాలికల పాఠశాల పూర్తిగా మన విద్యా పీఠము యొక్క యాదర్శములనే అమలు నందుంచుచున్నవి మన ప్రభుత్వము వారు దీనినికముందైనను ఉస్మా నియా విద్యా పీఠములో చేర్చికొని, దీనికి ద్రవ్య సహాయము చేసి తోడ్పడుదు రని తలచుచున్నాము.

మొన్నటి సభను జయప్రదముగా జరుపుటకు కారకులైన అధ్యక్షురాలగు శ్రీరాణీ కుముదినీ దేవి గారిని, శ్రీ రాజా వేంకటరామరెడ్డి బహద్దరు గారిని, శ్రీ మాడపాటి హనుమంతరావు గారిని శ్రీ వడ్లకొండ నరసింహారావు గారిని, మేము మనఃపూర్వకముగా ప్రశంసించుచున్నాము

---

# రెడ్డి విద్యార్థి గృహము

## 20-8-1932

గత వారములో రెండు దినములు రెడ్డిహాస్టలు యొక్క వార్షికోత్సవము జరుపబడినది వ॥ లుత్ఫోద్దౌలాగారి యుపన్యాసమును, రెడ్డిహాస్టలు నివేదికను వేరుచో ప్రకటించియున్నాము. రెడ్డి హాస్టలు 1327 ఫసలీలో స్థాపింపబడెను. ఈ కొలది కాలములో హాస్టలు భవనములు, గ్రంథములు మున్నగునవి సుమారు రెండు లక్షల విలువగలవగుటయు గ్రంథాలయములో 9000 గ్రంథములుండుటయు, విద్యార్థులు 163 గ్గురు ఉండుటయు చూడ దీని యభివృద్ధిని గూర్చి ఆంధ్రు లందరును సంతోషింపవలసి యున్నది. ఇట్టి సంస్థ హైదరాబాదు రాష్ట్రములో మరొక్కటి లేదనవచ్చును రెడ్డి హాస్టలు అధికారవర్గ మీ విషయమై ప్రశంసా పాత్రులుగా నున్నారు నవాబు లుత్ఫోద్దౌలాగారు సెలవిచ్చి నటుల రాజ బహద్దరు వేంకటరామారెడ్డి ఓ బి. ఇ గారు ముఖ్యముగా ప్రశంసాపాత్రులు. ఈ వసతి గృహ పక్షమున వ్యయసాయమున కనువగు భూమి సంపాదించు టయు, నందు హాస్టలున కవసరమగు కూరగాయలు పండించుటయు, విద్యార్థులే యెక్కువగా దీనిలో శ్రద్ధ వహించుటయు చూడ నీ వసతి గృహము యొక్క భావిదశయింకను ప్రశంసా పాత్రముగా నుండగలదని నమ్ముచున్నాము

ఈ వసతి గృహమునకు ఈ 14 సంవత్సరముల నుండి ప్రభుత్వ సహాయము లేదని వినుట మాకాశ్చర్యము కలిగించు చున్నది అన్ని సంస్థల కన్న నీ సంస్థ ప్రభుత్వ సహాయము పొందుటలో నగ్రస్థానము వహింపగలిగి నది ఏలన నవాబులుత్ఫోద్దౌలాగారు సెలవిచ్చినటుల రెడ్లు నిజమైన ముల్కీలు ఇతరులవలె వీరు ఇతర ప్రసంగములలో జిక్కుకొనువారుకారు వీరికి భూమి తప్ప వేరే యాధారము లేదు. కావున వీరు ప్రాచీనము నుండియు నీరాష్ట్రమందే నివసించి ఈ రాష్ట్రములో సుఖ దుఃఖముల ననుభవించిన వారు. వీరిలో [illegible] జాగీరులు, మక్తాలు సంస్థానములు కలవారు కలరు. అనగా వీరి పూర్వులు

ప్రభుత్వమునకు అపారమైన సహాయము చేయుటచే ప్రభుత్వ వారును కృతజ్ఞతా సూచకముగా వీరికిట్టి యినాముల నిచ్చినారు రెడ్లు మన రాష్ట్రపు జనసంఖ్యలో నూటికి 15 వంతుననున్నారు ఇట్టి బహు సంఖ్యాకుల వలన సర్కారీ మాల్గుజారీలో వీరివంతు అగ్రస్థానము వహించుచున్నది ఇట్టి సంఘములో బాలుర విద్యాభివృద్ధికి ప్రభుత్వమువా రవశ్యము తోడ్పడవలసియుండెను ప్రభుత్వము వారును నీ హాస్టలునకు సహాయము చేయువిషయములో నాలోచించు చున్నారని వినుటకు సంతసించు చున్నాము.



# హైదరాబాదు స్త్రీల యుత్సాహము

**1-10-1932**

హైదరాబాదునందు, తక్కిన భారత రాష్ట్రములయందువలె ప్రజల సేవకై స్త్రీలు ఉత్సహించుచుండుట యెంతయు హర్ష సంజనకముగానున్నది. గత బుధవార పత్రికయందు, సెప్టెంబరు నెల 24 వ తేదినాడు సమా వేశ మున హైదరాబాదు మహిళా మహాసభ యొక్క కార్యక్రమము వర్ణితమై యున్నది. ఈ మహాసభ అఖిల భారత మహిళా మహాసభతో సంబంధము గలదై దానికి ఇరువది మంది ప్రతినిధులను ఎన్నుకొని పంపుచుండుట ప్రశంసింపదగిన విషయము గాంధి మహాత్ముడు గుర్తించినటుల యిది స్త్రీల యుగము స్త్రీలు సంకుచిత దృష్టి వదలి సోదరీ వర్గముతో కలసి లోక కళ్యాణమునకై పాటుపడినచో ప్రపంచమునకంతయు త్వరలో శాంతి చేకూర కలదు శాంతము లేక సౌఖ్యము లేదు. ఇందు వారి సహజ కోమల హృదయ మెంతయో యుపకరించును. ఈ విషయము ప్రస్తుత మహాసభ యొక్క ఉపన్యాస నిర్ణయములయందు స్పష్టమగుచున్నది.

శ్రీమతి శ్రీకిన్‌గారి సతీమణి యధ్యక్ష స్థానమలంకరించి యుపన్యసించుచు, ధనవంతులు అజ్ఞానులగు దాసీలకు తమ బిడ్డలను సంరక్షణార్థమై ఒప్పగించుట వలన జ్ఞానశూన్యుల దురాచారములు పసితనమందే పట్టుబడుట సంభవించుచున్న దనియు, కాబట్టి శిశువులను పెంచు పని జ్ఞానవంతులై జాగరూకులగు వారి యధీనమందుండవలెననియు చెప్పెను ఈ మాటను తల్లిదండ్రులు అనుస రించినచో సంఘమునందు ఆరోగ్యము, ఐశ్వర్యము, శాంతియు తప్పక వర్ధిల్ల గలవు ఈ మూడును ఆచారశీలములపై నాధారపడియున్నవి. ఆచార శీల బీజము పసితనమందు నాటి మెలకువతో కాపాడినగాని చక్కగా ఫలింపదు.

ప్రస్తుత మహాసభ గావించిన నిర్బంధ ప్రారంభ విద్య తీర్మానము కార్య రూపమున పరిణమించుట అధిక భాగము విద్యాగంధ హీనమైన మన

హైదరాబాదు రాష్ట్రమునందు యెంతయో అవసరమై యున్నది రాష్ట్రము యొక్క భావిసౌఖ్యమంతయు యిప్పటి బిడ్డల విజ్ఞానముపైననే కదా ముఖ్యముగా నాధారపడియుండును

సభయందు గావింపబడిన రెండవ తీర్మానము గమనింపదగియున్నది. ఈ కాలమున, మన దేశమునందంతయు బాలబాలికల పాఠశాలలయందు ఉపాధ్యాయులును వేత్రధారులగుట యొక దురచారమైయున్నది. ఈ వాడుక యిప్పటి యుపాధ్యాయు లందధికయయ్యెను. ఆ సామర్థ్యమును అనర్హతను సూచించుచున్నది. దెబ్బ తగులనిచో పిల్లలు తామడిగిన ప్రశ్నలకు సరియగు ఉత్తరముల నీయరనియు సరిగా చదువరనియు అనేకులు ఉపాధ్యాయులు మొఱ పెట్టుదురు. అట్లయిన దెబ్బపడినప్పుడంతయు సరియగు సమాధానమును పిల్లలు యిచ్చుచున్నారా? అవును, యిచ్చుచున్నారు, అని చెప్పుటకు సాహసింపగల ఉపాధ్యాయుడెవడైననున్నాడని మేము తలచము. పిల్లలు తగిన యుత్తరముల నీయకపోవుటకు ప్రధానమైన కారణములు రెండు గలవు దాలురకు మొదట బోధించిన విషయము అర్థము కాకయైన నుండవలెను. లేదా, వారికా విషయ మందభిరుచియే లేకుండియుండవలెను సామాన్యముగా అభిరుచి లేని విషయము నందు అభిరుచిని గల్గింపగల్గుట ఉపాధ్యాయుని సామర్థ్యాతిశయమును దెల్పును. మొదలే యభిరుచి లేని విషయమును దెబ్బలు కొట్టియైనను విద్యార్థి మనస్సు లోనికి బలాత్కారముగా తురుముట గురు శిష్యుల కిద్దరికి బాధను గల్గించును. కాబట్టి ముఖ్యముగా బాలుని ప్రకృతియే విద్య అనుకూలించుచో దానినే నేర్పుట పరమోత్తమము. అర్థము కానప్పుడు కొట్టుటవలన లాభమేమి ? మరల బోధించ వలెను పంతులు సమర్థుడైననో విషయము తెలియునట్లు చేయుటకు దెబ్బల యవసరమే యుండదు ఈ బాధంతయు ఉపాధ్యాయులు బాలుర మనస్సులను సహజ శక్తులను గ్రహింపగల్గినచో తొలగగలదని మా యభిప్రాయము

రెండవ తీర్మానము తర్వాత రుస్తుంజి ఫరీదూంజిగారి సతీమణిగారిచే ఉపపాదింపబడిన తీర్మానము ఒక చిన్న క్లిష్ట సమస్యను దెచ్చెను. బాలబాలికలకు జాతిమత ద్రవ్యభాషా భేదములు లేక ఏకముగ పాఠశాలలుండవలెనని యీ తీర్మానము చెప్పుచున్నది. దీనిపై నుపన్యసించుచు ఫరీదూంజిగారి సతీమణి యేక భాష సాధారణము కానప్పుడు విభేదముల కవకాశముండని నిరూపించి అందరికిని

పాఠశాలలు సమానముగా నుండవలె ననెను. "మాతృ భాషయందు విద్య"యను నభిప్రాయము యిపుడు బలమైయున్నను, భారతీయులందరికినీ సమానముగా సులభమైన హిందీ భాష దేశభాషయైననేగాని మన దేశమందు జాతీయ భావము వృద్ధికి రాదు. అని మేము తలచెదము. జాతీయ భావమనునది యెఱుగక అంతర్జాతీయత యని ఘోషించుట మొదటి మెట్టునుండి కడపటి మెట్టుపై అడుగు పెట్టి నటులుండును. విద్యను భేదములను సమసిపోవునటుల నేర్పుటకు తగిన సౌకర్యములు విద్యా ప్రవీణులు చేయవలయును. అట్లేర్పరచబడిన విద్యా విధానము దేశమందంతయు అనుసరింపబడవలయును.

హైదరాబాదు మహిళా సభవారు కట్టకడపట "పట్టణమందు వ్యాధులచే బాధపడుచుండు వారి స్వార్థ త్యాగులై సాంఘిక సేవ చేయవలయును" అని గావించిన తీర్మానము సభకు చక్కని ముగింపుగా నున్నది. భావి రాజ్యాభివృద్ధి విషయమున తంత్రులకంటె తల్లులయందే యెక్కువ బాధ్యత కలదు. కావున, హైదరాబాదు మహిళా సభవారు తమ యుదారాశయములను త్వరలో సత్యము గావించుకొనగలరని యాశించుచున్నాము.

——

# మన ప్రభువుగారి హృదయ వైశాల్యము

**26-10-1932**

మ॥ఘ॥వ॥ నిజాముగారు, పూనాలో భండార్కారు పండితుడు స్థాపించిన "ఓరియన్టల్ యిన్స్టిట్యూటు వారికి నైజామ్సుగెస్టుహౌస్" అను పేరుతో ఒక అతిథి భవనమును నిర్మించుటకు 25000 రూపాయల మొత్తమును, మహాభారతమును సవరించి ప్రకటించుటకు సంవత్సరమునకు 1,000 రూపాయల వంతున పది సంవత్సరముల వరకు యిచ్చుట కనుగ్రహించుట వారి యౌదార్యమునే గాక విశాల హృదయత్వమును కూడ తెలియజేయుచున్నది. వారి దానములు జాతి మత దేశ భేదములను దాటి పోగల్గుట యిప్పటి విరాళములవల్ల మరియొకసారి కనుగొన గల్గుచున్నాము సత్యజ్ఞానాన్వేషణ ప్రయత్నములు ఎచట నున్నను వారి దృష్టికి సమానములే

శ్రీ ప్రభువుగారు పరమతద్వేషములేని మహమ్మదీయ శ్రేష్ఠులు. లేనిచో హిందువుల యుద్యమమగు ఓరియన్టల్ రీసర్చి యిన్స్టిట్యూటు వారి కార్యములకు వారు ధనసహాయ్యము చేయుట పొసగదు అందులోను మహమ్మదీయుల కన్న హిందువులకు ముఖ్యముగా గౌరవనీయమగు మహాభారతమును అచ్చువేయుటకు అగు ఖర్చులను వారుదయచేయుట ప్రశంసనీయము వాస్తవమే, యిట్టిధర్మములకు వారికిది మొదలుగాదు మహమ్మదీయులకు సంబంధములేని భద్రాచల రామాలయము యొక్క ఖర్చులను వారు దయచేయు చుండుట చాల కాలము నుండి ఎరిగిన విషయమే.

ఈ శ్లాఘనీయ కార్యములను తెలిసికొనియైనను హిందూ ముసల్మానులు పరస్పర వైరమును విడనాడుట మంచిది శ్రీ॥మ॥ఘ॥వ॥ నిజాముగారిని మహమ్మదీయులు ఆదర్శపురుషునిగా యెంచవలెను దేశాభిమానమన్న పరదేశ ద్వేషమెట్లుకాదో స్వధర్మపాలనకై పరధర్మముల యెడల అట్లు ద్వేషమును పూనబని లేదు పరమతద్వేషమును బోధించు మతము మతమే కాదు అని అందరును గుర్తింపవలయును ఒక మతమును మరియొక మతమువారు ద్వేషించుటవలన పూర్వము ఎన్నియో ఉపయుక్తములును, మనోహరములు నగు విజ్ఞాన గ్రంధములు నశించినవి విశ్వకళ్యాణ దీక్షితులగు మహాపురుషులు ఎందరో హింసలకు లోనై యీ ప్రపంచమును వదలవలసి వచ్చెను ఒక్కొక్క మతమున అందరును గ్రహించదగిన కొన్ని కొన్ని మంచి విషయములుండును. మతద్వేషము వలన అట్టి వానిని నిరసించుట సరిగాదు.

---

# రాజకీయములు నిజాం రాష్ట్ర ప్రజలు

**9-11-1932**

మన రాష్ట్రములోని ప్రజలందు విద్య చాలా తక్కువగా నున్న సంగతి అందరకును విదితమే. అందును విద్యాధికులనబడు వారిలో కూడ ఇతర విషయక విజ్ఞానము ఎంతయో యున్నను రాజకీయవిషయములను గూర్చిన జ్ఞానము చాల లోపించి యున్నది ఇందునకు అనేక కారణములు చూపవచ్చును అయినను, ముఖ్య కారణము మా దృష్టి కొకటి కానవచ్చుచున్నది అది యేమి? రాజకీయ విషయములను కష్టించి బాగుగా దెలుసుకొందమను ఉత్సాహమును, దానికొరకు శ్రమ చేయు పట్టుదల లేకపోవుటయే యని చెప్పవచ్చును. బ్రిటిషు ఇండియాలో విశేషముగా రాజకీయ విషయక జ్ఞానమున్నది కదా అది పత్రికల ముఖమునను, గ్రంథముల రూపమునను వచ్చుచున్నది కదా అట్లుండియు మన రాష్ట్ర వాసులకు రాజకీయ విషయముల జ్ఞానము అలవడుటకు కారణమేమని ఎవరైన ప్రశ్నించవచ్చును కాని యథార్థమేమనగా, బ్రిటిషు ఇండియా రాజకీయములకును, మన రాజకీయములకును హస్తిమశకాంతరమున్నది అచ్చటి ప్రతి రాజకీయ తత్వమునకు ఉపయోగించజాలదు.

మన రాష్ట్రపు రాజకీయముల స్థితి మొదటి నుండియు వేరు విధమైనది. కనుక దీని క్రమ వికాసము చాలవరకు భిన్నము కనుక మొదటి మన రాష్ట్రము యొక్క పాలన నిర్మాణము ఎట్టిదో, దానిని బట్టి పాలించు మంత్రి మండలము యొక్క అధికారము లెట్టివో పాలనా విధానమున మంత్రి మండలము, అధికారమునకు మించి మ॥ఘ॥వ॥ ప్రభువుగారి అంగీకారము పొందవలసిన విషయము లేవియో' శాసన నిర్మాణ సభకు ఎంతవరకధికారములు కలవో, శాసన నిర్మాణ సభలో ప్రవేశపెట్టకయే ఏయే విషయములలో ప్రభుత్వము వారు నియమము లేర్పాటు చేయుటకు వీలు కలదో, మహా ఘనత వహించిన శ్రీ ప్రభువుగారు స్వయముగ ఫర్మాను ద్వారా ఆజ్ఞ ఇచ్చిన మీదట శాసన నిర్మాణ సభలో

చట్టముల చిత్తులు ప్రవేశపెట్టవచ్చునో కూడదో, ప్రభుత్వమునందు ఏయే శాఖలు కలవో, దేని కర్తవ్యము లెట్టివో ఇట్టి సూక్ష్మ విషయములు తెలిసి కొనినదే రాజకీయ విషయములలో వాద వివాదము సల్పబూనుట అపాయహేతువగును ఈ విషయమును దృష్టి యందుంచియే కాబోలును మన ప్రభుత్వమువారు ప్రతి సందర్భములోను రాజకీయ విషయములలో జోక్యము పుచ్చుకొనవలదని హెచ్చరించుచు రాజకీయ విషయికమైనట్టిదిగాని, రాజకీయములగు ఫలితములు కలిగించునట్టి గాని సభలను సమావేశపరుప అనుజ్ఞ నీయకున్నారు. ఇటీవల ఆంధ్ర జన కేంద్ర సంఘ కార్యదర్శి పేర వ్రాసినట్టి లేఖలో ప్రభుత్యమువారీ విషయమునే ప్రకటించియున్నారు.

మా యభిప్రాయన ప్రభుత్వము వారి లేఖ యొక ముఖ్య తత్వమును ప్రతిపాదించుచున్నది. అదేదన రాజకీయ విషయిక జ్ఞానము బాగుగా సంపాదింపకయే రాజకీయ సభలు జరుపవలదను నదియే యా తత్వము. కనుక దేశీయులు రాజకీయములను పరించవలయును. ప్రభువుగారి యాజ్ఞలను, మంత్రిమండల నిర్మాణ విధానమును, కార్య పరంపరను, పరిపాలనా నివేదికలను, అప్పుడప్పుడు ప్రభుత్వము వారు ప్రకటించుచుండు ప్రత్యేక గ్రంథములను, విద్యా విధానమును, ప్రజారోగ్య సమస్యలను, ఎగుమతి దిగుమతులను గూర్చి నట్టియు అంకెలను, భూమ్యాదాయ విషయములను బాగుగా దెలిసికొనవలయును మన శాసన నిర్మాణ సభయొక్క అధికారములను, సభ్యుల నెన్నుకొను పద్ధతియును, కార్యక్రమ విధానమును సవివరముగా నెరుంగవలయును గొప్ప విద్యాధికులు కూడ ఇట్టి యంశముల దెలసికొనకపోవుట చాల విచారకరము ఇట్టి జ్ఞానము సంపాదించినచో మనము రాజకీయ విషయములను చర్చించ నర్హుల మగుదుమా? ముమ్మాటికి కాము!

ఇట్టి పరిజ్ఞానము లభించవలయు నన్న, ప్రస్తుతము రాజధాని నగరమున నిట్టి గ్రంధ సంగ్రహము గల భాండాగారము కావలెను నిదివరకు ఉన్న గ్రంథాలయములలో దాదాపుగా అన్నియు ఇతర విధమైన పుస్తకములే కాని పై విషయముల గ్రహించుట కుపయోగించునవి లేవు. ఈ భాండాగారము నందు మన రాష్ట్రపు రాజకీయ గ్రంథములకు ముఖ్య స్థానముండవలయును. అవసర

మైన సందర్భములలో పోలిక తెలిసికొనుటకై ఇతర రాష్ట్రముల నివేదికలు మున్నగునవి తెప్పించి యుండవచ్చును. రాజకీయ విషయముల విజ్ఞానమునకుగల ప్రాముఖ్యతనుబట్టి, ఇట్టి గ్రంథ సంగ్రహము చాల అవసరమైనది కీ శే కేశవ రావుగారిట్టి గ్రంథ సముదాయము అవసరమని తలంచి యుండిరి. కాని వారి జీవిత కాలమునందు ఈ పని జరిగి యుండలేదు ఇట్టి పని ఇప్పుడు సమర్థులగు దేశాభిమానులును ప్రారంభించిన యెడల మన భవిష్యత్సంతానములకు చాల లాభకారియగును. ఈ విషయము దేశీయులు ఆలోచించి కార్య రూపమునకు తెత్తురని విశ్వసింపుచున్నాము.

---

# పరిశోధక మండలి

## 8-2-1933

"ప్రాచీన శాసనములకు ప్రతులను దీయుట, ముద్రితా ముద్రిత గ్రంథ ముం సేకరించి ప్రత్యేక కార్యాలయమున జేర్చి పరిశోధకులందుబాటులో నుంచుట, పరిశోధనోద్యమము నిర్వహించుట, లోనగు నిబంధనలతో, హనుమ కొండలో నొక పరిశోధక మహామండలి స్థాపించబడుట సంతోషావహము. ప్రారంభోత్సవము జనవరి 21వ తేదినాడు జరిగెను. కార్యాలయమింకను ఏర్పడ లేదు రంజాను సెలవుల యనంతరము ప్రత్యేక గృహమున సంఘము నెం కొల్పబడును ఆనాడు జరుపబడు మహాసభలో సంఘాభివృద్ధికరముంగు సూచన లామోదింపబడును, అని తెలియుచున్నది ఇప్పటికి హైదరాబాదులోని లక్ష్మణ రాయ పరిశోధక మహామండలికి యీ సంఘము వారు గడించు ప్రతి శాసనము నకును బ్రతి పంపుటకును అముద్రిత తాళపత్ర గ్రంధములకు ప్రతి వ్రాయించి యొసంగుటకును," కార్యమండలి యొక్క కార్యనిర్వాహక వర్గము వారు ఆమోదించిరి.

నిజాం రాష్ట్రమందు ఎక్కువభాగము ఆంధ్రదేశమై యొప్పుచున్నది. సుమారు అఱువది లక్షల ఆంధ్రులు ఈ రాష్ట్రమందు గలరు. ఇంత విస్తీర్ణమగు ఆంధ్రదేశ భాగము యొక్క చరిత్రను ఆంధ్రులు తెలిసికొనకుండుట సరికాదు. ఈ ఆంధ్రదేశమున నుండు ఓరుగల్లు ఒకప్పుడు కాకతీయుల సామ్రాజ్యమునకు రాజధానిగ నుండెను. కాకతీయుల తర్వాత పశ్చిమ చాళుక్యులు రాష్ట్రకూటులు మున్నగువారు రాజ్యము చేసిరి. ఈ చరిత్రనంతయు, తదేక దీక్షతో పరిశోధనలు జరిపి సంపూర్ణముగా ప్రకాశమునకు దెచ్చి పురాతనాంధ్రుల యౌన్నత్యమును వెల్లడింపజేయుట వలన యిప్పటి నిజాం రాష్ట్రాంధ్రులు అభివృద్ధికి ప్రోత్సహింప బడిన వారగుదురు

మరియు కొందరు గొప్పగొప్ప ఆంధ్రకవులు నిజాం రాష్ట్రపువారు, వారి గ్రంథములు ప్రకాశమునకు రావలసినవి ఇంకా నెన్నియో గలవు. చక్కగా

పరిశోధన సల్పుటచే యిట్టి గ్రంథముల నన్నింటిని ఉద్ధరించి ఆంధ్ర శారదకు సేవజేసిన వారగుదురు మానవుని జీవితమందు ఆత్మోన్నతికిని, ఆనందమున కును సారస్వతమొక సాధనము ఆంధ్ర సారస్వత సేవ చేయుటచే ఆంధ్రుల యభివృద్ధికి మరియొక మెట్టు గట్టినట్లగును పూర్వకాలమందు పంచలక్షణములై వంశానుచరిత మొక భాగముగా గల పురాణములు బయలుదేరినది మానవుని నైతికాధ్యాత్మికాద్యభివృద్ధికే గదా ఇప్పటికిని మన భారతదేశమందు పురాణ చరిత్రము అభివృద్ధికి తోడ్పడుమనే యున్నవి

సారస్వతము అభివృద్ధికి మార్గమగుట గాకయే అభివృద్ధికి సూచనము సైతమగును కాబట్టి బ్రిటిషు యిండియాలోని ఆంధ్రులు ఆంధ్రసారస్వతమును పోషించుటకై విరివిగా కృషిచేయుచున్నారు ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారు ఆంధ్రుల పాఠశాలలో ఆంధ్రమును నిర్బంధ పఠనీయముగ జేసి ఆంధ్రాభి వృద్ధికి సాయము చేయుచున్నారు మన రాష్ట్రమందు మహాఘనత వహించిన నిజాము దొరతనమువారు శాసన పరిశోధనము గావించుటకును పూర్వ వస్తువుల గాపాడుటకును యేర్పాట్లు గావించి ఆంధ్ర పరిశోధకులకు మంచి యుత్సాహము కలిగించుచున్నను, ఆంధ్రుల విద్య ఆంధ్రభాష ద్వారాగా నేర్పబడుటకు అను కూల వసతుల గల్పించుటలో ప్రభుత్వము వారు తగినంత శ్రద్ధ జూపెడు పక్షమున ఆంధ్రుల యభివృద్ధికి గల యొక గొప్ప ఆటంకము తొలగినదగును నిజాం రాష్ట్రములో సర్కారు పాఠశాలలో చదువు ఆంధ్ర విద్యార్థులందరు ఆంధ్రమును తమ రెండవ భాషగా గ్రహించి అభ్యసించుట మంచిది.

ప్రస్తుత పరిశోధక మహామండలి వారు తమ యవ్యాజకృషిచే ఆంధ్ర భాష యొక్కయు ఆంధ్రజాతి యొక్కయు వ్యక్తిత్వపు ఔనత్యమును ప్రకాశింప జేసిన వీరాంధ్ర యువకుల హృదయములలో ఆత్మ గౌరవము నెలకొనుటకు సాయపడగలరని యాశించెదము ప్రస్తుతము మండలి కొద్ది మంది యొక్క అభిమానోత్సాహములచే స్థాపించబడినదైనను మండలియొక్క కార్యములనేక ములు సరిగా నిర్వహింపబడవలెనన్న ధన సహాయ మవసరము. నిజాం రాష్ట్రాంధ్ర సేవ నొనర్చుట బూనుకొని ఆంధ్రులు అభిమానము చూపరాయను ధైర్యముతో మండలి స్థాపకులు కార్యరంగమున దిగుచున్నారు. వీరి ధైర్యము నకు రాష్ట్రాభిమాను లెల్లరును తమ శక్తికొలది తోడ్పడుటకు వెనుదీయరని నమ్ముచున్నాము.

---

# రామను గారిచ్చిన సనదు

**1-3-1933**

There could be no question of the beauty of Telugu language, its poetry and mellifluous music The last alone was sufficient to include in the definition of an Andhra everyone from Cape comorin to the banks of the river Tapti - Tamilions Canarese and Malayalese no less than the Andhras themselves - because Telugu was the divine language which Thyagaraja used. Telugu is justly known as the Italian of the East

form Sir C. V. RAMAN'S Lecture
in Nizam College 21-2-1922.

ఇంత పొడవుగా ఇంగ్లీషు ఉదాహరణమేమని యింగ్లీషు తెలియని పాఠకులు ఆశ్చర్యపడవచ్చును. దాని యర్థమిది

"ఆంధ్ర భాషయొక్క సౌందర్యము, దాని కవిత దాని మనోహరమగు సంగీతము వీని విషయమై యేమియు సందేహింప నవసరము లేదు. ఈ కడపటి గుణమగు గానమాధుర్య గుణ ముక్కటే ఆంధ్ర పద నిర్వచనములో కన్యకుమారి నుండి తపతీనదీ తీరము వరకు నివసించు జనులందరిని చేర్చుటకు తావిచ్చుచున్నది. తమిళులు, కన్నడీలు, మళయాళీలు వీరును ఆంధ్రులే యగుదురు. ఏలన త్యాగరాజు గానము చేసిన దీ దేవభాషయగు నాంధ్రమందే. తెలుగుభాషను ప్రాచ్యపు నిటలీ భాషయనుట న్యాయముగా నున్నది".

అని సర్. చంద్రశేఖర వేంకటరామన్‌గారు గతవారము నిజాం కాలేజీ ఆంధ్ర విద్యార్థులు తనకు సమర్పించిన సన్మాన పత్రమునకు జవాబిచ్చుచు ఆంధ్రమును ఆంధ్రులను గొనియాడిరి. ఒక యాంధ్రుడు తన యాంధ్రభాషను స్తోత్రము చేసికొనుటలో విశేషము లేదు కృష్ణదేవరాయలు శ్రీనాథుడు తన వీథి నాటకములు చెప్పిన "దేశభాషలందు తెనుగు లెస్స" అను వాక్యములనే మరల తన యాముక్తమాల్యదలో వ్రాసెను కాని మాయభిప్రాయమున సార్వభౌమ కవిగాని కవిసార్వభౌముడు గాని చెప్పిన వాక్యముల కన్న నేటి నోబిలు బహుమాన మందిన శాస్త్ర సార్వభౌముని వాక్యములే ఆంధ్ర భాషకు గౌరవము నిచ్చుచున్నది.

శ్రీనాథుడు "ఏదియెట్లున్న నాభాష కన్నడంబు" అన్నట్లు మన రామను గారు "ఎవరేమన్నను సరే నేను ఆంధ్రుడను" అని అభిమానించుచున్నారు. వీరి మాతృభాష అరవమైనను వీరు ఆంధ్రమందే మంచి పాండిత్యము సంపాదించి ఆంధ్రుడనని చెప్పించుకొనుచున్నారు. ఇట్టి వీరు ఆంధ్రమునకై యిచ్చిన సనదును ప్రత్యాంధ్రుడు అందు ముఖ్యముగా ప్రతి నిజాము రాష్ట్రాంధ్రుడును చిత్రించికొనగలరని కోరుచున్నాము ప్రత్యేకముగా నిజాం రాష్ట్రీయుల విషయమై సూచించుట కొకటి కాదుకదా నూరు కారణములు కలవు

ఎట్లనగా మన రాష్ట్రములో నూటికి 50 వంతు జనులు ఆంధ్రులేయైనను కంటికి కలికము వేసికొని పగటి దివ్వటీలు పట్టుకొని రాష్ట్రమందలి కచ్చేరీ కచ్చేరీలో మూలమూలలందును వెదకి వెదకి వేసారినను ఒక తహసీల్దారుగాని, ఒక తాలూక్దారు గాని, ఒక మున్సిఫీ గాని తుదకు కార్కూనులుగాని అంతయేల కనిష్ఠము వ్యవసాయ శాఖలో గాని అది లేకున్న పశువుల డాక్టర్లుగాని దొరకుట లేదు యథార్థముగా జూచిన ఒక హైకోర్టు న్యాయాధిపతి, బాబెహుకుమతులో నిద్దరు ముగ్గురు మెంబర్లు, తుదకు ప్రధానమంత్రి ఆంధ్రులుగానే యుండవలసి యుండెను. ఇది మొదటి యవస్థ.

ఇక రెండవది ఉస్మానియా యూనివర్సిటీ వచ్చిన తర్వాత ఆంధ్ర భాషకు ప్రాముఖ్యత లేనే లేకపోయెను. లాపన ఇర్విన్ ప్రభువుగారు (వారికి పరమేశ్వరుడు దీర్ఘాయుర్భాగ్యము లిచ్చుగాత) మన రాష్ట్రమునకు వేంచేసి

నప్పుడు మన ఉర్దూ యూనివర్సిటి యితర భాషల వారికిని అట్లా అందరికిని ప్రీతి పాత్రముగా నుపయోగకారిగా నుండవలెనని సెలవిచ్చియుండిరి కాని వారి మాట యరణ్యరోదనమై పోయెను

ఇక మన రాష్ట్రీయ సోదరుల దృక్పథమెట్టిదో కనుగొందము హాష్మీ గారు ఇటీవల బుల్లెటిను పత్రికలో ప్రఖ్యాతికి వచ్చిన తమ ఉర్దూ హిందూ దేశ చరిత్రలో ఆంధ్ర వాఙ్మయము కన్నడ, అరవ వాఙ్మయ మంతటి ప్రాచీనము కాదని యింకయు నేమేమో వ్రాసిరి వారి కన్నులు తెనుగు ఓనమాలైనవచ్చునో లేదో కాని వాఙ్మయము విషయములో గొప్ప యభిప్రాయమిచ్చిరి. ఇచ్చినను తప్పులేదు. వారి పుణ్యము వారాంధ్రమును త్రొక్కండి ధ్వంసించండి అనక పోయిరి.

మా సోదరులు రహబరు పత్రిక సంపాదకులు 4-5 ఏండ్ల క్రిందట ఉర్దూ తప్ప తక్కిన భాషలను పాతములో (అఖ్బిజమీన్) నికి త్రొక్కి నుసిజేసి తూరుపెత్తి బూడిదచేసి గంగలో కలిపిరండని ముద్దు ముద్దుగా హితబోధచేసి యుండినది మా యాంధ్ర సోదరులు - అభిమాన లేశమైన యుండిన కదా- మరచిపోయినట్లున్నది ఇట్టి ప్రేమకల వాతావరణములో నిజాం రాష్ట్రాంధ్రులు మృతప్రాయులగుచుండ పూజ్యులైన సర్ చంద్రశేఖరుగారు అమృతసేచనము చేసి జీవము నిచ్చిరి

ఇచ్చటి యాంధ్రులు జీవచ్ఛవంబులై తళదక్కి దినదినము క్షీణించి బోయీలై మూటలు మోయుటలో ఆదిహిందువులై అయాలు, గౌండాలగుటలో పాచకులై గరిటెత్రిప్పుటలో గుమస్తాలై కలము సాము చేయుటలో యపూర్వ పాండిత్య ప్రకర్షను జూటుచున్నారు దీనికి కారణము వారే కాని యితరులు కారు వారికి తమ భాష రోత ఇంత ఉర్దూ డొక్కు శుద్ధియైన రెడ్డి దేశముఖులు, వెలమదొరలు గోలకొండ వ్యాపారీ దేశ పాండ్యాలు తమలోతాము కలసినప్పుడు ఆంధ్రమందు మాట్లాడుటకు సిగ్గు-ముగ్గరున్నంతటి సిగ్గు-ఉర్దూలో మాట్లాడుటలో "సరదా" చూపించెదరు. ఇక ఆంధ్రభాష "కాటిక కంటె నీరు చను కట్టు పయింబడ నేల యేడ్వదో" యోచింపుడు

మన రాష్ట్రీయాంధ్రులకు ఆంధ్రము రోత ఆంధ్ర పత్రికలు చెత్త, ఆంధ్రులందరు చెంచులుగా తోచుచున్నట్లున్నది. నిన్ననే రెడ్డి విద్యాలయములో ఆసేతు శీతనగర పర్యంతముగా ప్రఖ్యాత పాండిత్యముచే వికాశించుచున్న హిందూ విద్యాపీఠ మహాధ్యక్షులైన "ధ్రువ" గారిట్లు సెలవిచ్చిరి. "మాతృభాష యందభిమానముండవలెను. మాతృభాషలో నాలోచింపవలెను - మాతృభాషలో చదువవలెను. అట్లు చేసిననే గాని జాతి వృద్ధి పొందజాలదు."

ఇటీవల గాంధీ మహాత్ములు సహితము "ఆంధ్ర భాషను నేను నేర్వ గోరుచున్నాను గాని యీ ప్రభుత్వమెప్పుడు జూచినను నన్ను జైలులో నిర్బంధించుచున్నది. ఏమి చేయుదును" అని సెలవిచ్చిరి. కావున నెవ్వరిని బోయి విచారించినను తుదకు రహెబరు దక్కనులో గూడ విచారించి చూచినను మంది భాషల "అఖ్నిజమీను"లో వేయండి గాని మా భాష విషయములో నోరెత్తివా ఖబడ్దార్ అందురు గాని యదేమి గ్రహచారమో యదేమి కాలవైపరీత్యమో, యదేమి కర్మ పరిపాకమో యెవరికి తెలివివచ్చినను మన నిజాము రాష్ట్రాంధ్ర సోదరులలో నెన్నడు భాషాభిమానము నెన్నడు ఐకమత్యము, ఎన్నడు సర్వతోముఖాభివృద్ధి కలుగవలెనో యా దయ్యమునకే యెరుక.

# సత్యమును మెచ్చిన మంత్రి

**12-4-1933**

ఉదకమండలములో గణేశ దేవాలయమునకు శంకుస్థాపన జేయుటకై హిందువు లాహ్వానింపగా ఆదరముతో వారి కోరికను దీర్చిన సర్ మీర్జాయిస్మాయిల్ మహాశయుని దివానుగా నుంచుకొనిన మైసూరు సంస్థానము గొప్ప అదృష్టముగలదని చెప్పవచ్చును. సర్ మీర్జా యిస్మాయిల్‌గారి యందు విద్య నిజముగా ప్రయోజనము గలదైనదని చెప్పవలయును. శంకుస్థాపనోత్సవ సమయమున మైసూరు దివానుగారు గావించిన యుపన్యాసము శ్రోతల హృదయము లనేగాక పాఠకుల హృదయములను కూడ ప్రేమరసముచే పరిపూత మొనర్ప జాలియున్నదని మా విశ్వాసము సత్యమును మెచ్చగల క్షమాగుణము నీయని విద్య సంస్కారఫలహీనమైనది. సర్ ఇస్మేలుగారు సత్యమును సహించుటయే గాక మెచ్చను గూడ మెచ్చినారు. సత్యము మెప్పుపొందిన చోటు ప్రేమకు స్థాన మగును

కొందరికి గాంధీ మహాత్ముని మొదటినుండి కొంతవరకు గూడ ద్వేషించుట గుణమైనది. మైసూరు దివానగు ఇస్మేలుగారు మహాత్ముడు హరిజనుల నుద్ధరించుటకై చేయు సేవను మహాదరముతో ప్రశంసించిరి. హరిజనోద్ధరణ ముచే హిందూమతము యొక్క ఉత్తరక్షేమము స్థిరమగుననియు, హిందూ మతము క్షేమముగ నుండుటవలన ఇండియా అంతయు క్షేమముగ నుండు ననియు చెప్పినట్లు మీర్జాగారిని ప్రేరేపించిన ఉదారభావము అద్భుతము ఈ మతము ప్రతి భారతీయుని ఆవేశించు నెడల, భారత భూమి అచిరకాల ములో మహోత్కర్షమును పొందగలదనుటకు సంశయము లేదని మా అభి ప్రాయము. తక్కిన మతములను దూషించి తన మతమునే నమ్మకపోయినను, అందరిచే బలాత్కారముగ అవలంబింపజేయ జూచువారికి మీర్జాగారి మహా వాక్యము పశ్చాత్తాపము కలిగించవలయును.

సర్ మీర్జా ఇస్మేయిల్‌గారు మహమ్మదీయులేయైనను హిందూమతమును గూర్చి వారు గావించు సంస్తవమును చూడుడు. విద్యాసంస్కృతబుద్ధులై సత్యమును గౌరవించుటకు తగినంత సహనభావముగల ఎవరుగాని మీర్జాగారి అభిప్రాయమును ఎదిరింపరు హిందూమతము పరమతస్థులను తన వంకకు త్రిప్పుకొనుటకై వారిని బలాత్కరించునదికాదు. హిందూమతమును విశ్వసించువారు పరమతములను దూషింపక గౌరవింపగల్గుటయే హిందూమతము యొక్క విశేషము తన మతమును నమ్మి పరమతస్థులను సహింపవలసినదని బోధించు మతమేదైనయున్నచో అది గౌరవమునకు అనర్హమైనది అది మతమని అనిపించుకొనుటకే తగదని మైసూరు దివానుగారి నమ్మకము. వాస్తవమీరీతిగనుండ దేవాలయముల పేరు పెట్టియు, మసీదుల పేరు పరస్పర రక్తపాతములకు కర్తలగు హిందువులుగాని, మహమ్మదీయులుగాని చదివినవారైనను చదువువలని ఫలమును పొందనివారే యని చెప్పవలసియున్నది మహమ్మదీయుల మసీదుల ఎదుట హిందువులు వాద్యములు మ్రోయింపకూడదు. అను విధిని వారి మతము చేయుచున్నదని మేము తలపజాలము. అది ఎటులున్నను హిందూమతము దేవాలయములవద్ద మహమ్మదీయులు తమ వాద్యములను మ్రోయింపరాదని విధించుటలేదు. ఒక మసీదు ఎదుటగాని, దేవాలయము ఎదుటగాని వాద్యములు వాయించుటను గూర్చిన విషయములలో ప్రభుత్వము వారి చర్యలకు న్యాయశాస్త్రము ఆధారముగ నుండవలెను. ప్రజలు ఎవరుగాని ఉపయోగించుటకు హక్కుగల వీథిలో వారు సాధారణముగ ఉత్సవములను జరుపుకొనుటకు అభ్యంతరము కలిగింపబడరాదు. అట్టి యభ్యంతరము కలిగించువారినుండి ప్రభుత్వమువారు శాంతిని కాపాడవలసియున్నది అట్లుగాక బలవంతులమని చెప్పి ప్రజల హక్కులకు భంగము కలిగించినవారికే అనుకూలముగ ప్రవర్తించుట వలన ఆ ప్రభుత్వము యొక్క శక్తియందు ప్రజల విశ్వాసము నశించును

అట్లనుటచే ఉపద్రవమును సూచించుట మా తలపు గాదు. సర్ మీర్జా ఇస్మేయిల్‌గారి నిష్పక్షపాతబుద్ధి ప్రతి ప్రభుత్వమును ఆవేశింపవలెను. మహమ్మదీయుల మసీదుల దగ్గరకు బోయి తమ వాద్యములందలి నేర్పును జూపవలెనని హిందువులకు అభిప్రాయమే లేదు. కాబట్టి గతమును గతమునుగ తలచి హిందూ ముసల్మానులు ఒకరొకరి మతముల యందలి గుణముల గ్రహించి పరస్పర

ప్రేమతో భావిభారతీయాభివృద్ధికి యత్నించెదరుగాక ఉపకమంచలములలో సర్ మీర్జా ఇస్మాయిల్ మహాశయుడు శంకుస్థాపన చేసిన గణేశ దేవాలయము నుండి "మనము ఈ మతములో ఈ పరిస్థితులలో పుట్టవలెనని మొదట కోరి యుండలేదు. మనము పుట్టినపుడు మనకు ఏర్పడిన ప్రకృతిసిద్ధ గుణములు మనము కోరినవికావు. మంచిగాని, చెడుగాని అవి తర్వాత ఎప్పుడో మనపై వేయబడినవి అందువల్ల వేర్వేరు మతముల నవలంబించిన వారైనను మనము ఒకరి నొకరు సోదరునివలె జూచుట ముఖ్యము కాదా!" అను హిందూ ముసల్మాను ప్రేమసందేశము నాల్గు దిక్కులకు పోయి నిర్విఘ్నముగా జయించు గాత!



# 21 రోజుల ఉపవాస దీక్ష

## 10-5-33

గాంధిమహాత్ముడు మే 8 వ తేది సోమవారంనాడు మధ్యాహ్నము 12 గంటలైన తరువాత బంధు మిత్రుల మధ్య భగవన్నామ కీర్తనముతో 21 రోజుల ఉపవాస దీక్షను ప్రారంభించినాడు. మహాత్ముడు ఉపవాసమును నిశ్చయించుకొనిన సందేశము తెలిసిన వెంటనే భారతదేశము యొక్క అన్ని భాగములును గజ గజ వణకసాగెను. అన్ని మూలల నుండియు మహాత్ముని భక్తులును, మిత్రులును మహాత్ముని ప్రాణవిషయమున సంశయ భీతిగ్రస్తులై ఉపవాసమును మానుడని ప్రాధేయ పడజొచ్చిరి. కొందరు ఎరవాడకేగి కన్నీళ్ళతో మహాత్ముని హృదయమును కరిగింపజూచిరి. కాని ఆ హృదయము మొదట కఠినమైయుండినకదా కన్నీటికి కరుగుననుమాట. మహాత్ముడు తన నిశ్చయమును మానుటకు వీలులేదని చెప్పిన తన ప్రాణ విషయమున ఎవరును భీతిజెంద నవసరములేదని నచ్చజెప్పెను

ఇచటనే మహాత్ముని పూర్వోపవాసమునకును ప్రస్తుతోపవాసమునకును గల భేదము ఒకటిగోచరించు చున్నది. ఇదివరకు సెప్టెంబరులో మహాత్ముడుపవసించుకప్పుడు తాను జీవింప గల్గునో లేదో అను విషయము వారికే తెలిసి యుండలేదు. ఇప్పుడన్ననో అట్లుగాక తాను అన్నిరోజులు కూడ ఉపవాసముండి జీవింపగల్గుదునని గట్టి విశ్వాసముతో నున్నాడు. అందరికిని అదేధైర్యము చెప్పు చున్నాడు. కాని సామాన్య జనులకు ఆ ధైర్యముండునా? వారు ప్రేమించు వస్తువు యొక్క వినియోగమును తలచి భయపడుటయు దుఃఖించుటయు సామాన్య మానవునికి ప్రకృతి మహాత్ముడో ప్రకృతిని నియమించువాడు.

మరియొక భేదమేమనగా పూర్వోపవాసమందు మెక్డానల్డుగారి సాంఘిక సమస్యా పరిష్కారమువల్ల శాశ్వతమై యుండవలసిన సవర్ణాస్పృశ్య విభాగమును లేకుండ చేయుటకై సదరు పరిష్కారమునే తీసివేయించు నుద్దేశ్యముతో

మహాత్ము డుపనసింపవలసి వచ్చెను. ప్రస్తుతమన్ననో అట్టివి విశేషోద్దేశ్యమేదిగాని లేదు. 21 రోజులను క్రమముగా ఉపవాసము జరిగియే తీరవలెను.

మరి యీ యుపవాస మెందుకు? హరిజనుల యభివృద్ధిని దలచియేయని మహాత్ముడు వ్రాసుచ్చినాడు. హరిజనుల యభివృద్ధికి ఈ ఉపవాసమెట్లు దోడ్పడును? తక్కిన కారణ విశేషములను మహాత్ముడు గోప్యములైనంత పవిత్రములని తెలియజేయలేదు అయినను సూక్ష్మముగా హరిజనోద్ధరణమునకై ఉద్యమించుచున్న తన యొక్కయు తన తోటివారి యొక్కయు ఆత్మసంశుద్ధికియని మహాత్ముడు తెలుపుచున్నాడు

దీని యర్థమేమి? ఇప్పటికే ఈ పవిత్రోద్యమమును కొన్ని కళంకములు ఆవహించియున్నవని మహాత్మునికి గోచరించి యుండవలెను. కాబట్టి మహాత్ముని ఉపవాస సమయమున హరిజనోద్యమములో పనిచేయువారేమి చేయదగినదియు దీనినిబట్టి గ్రహింపవచ్చును. వారు బాహ్యాంతశ్శుద్ధిని రక్షించుకొనుటయందు బహు జాగరూకులుగా నుండవలసి యున్నది. హరిజనోద్ధరణోద్యమము పవిత్ర కార్యము. పవిత్రకార్యములన్నింటియందు చూపదగిన శుద్ధినే యిందును అవలంబింపవలెను. కాబట్టి ఇంతవరకును హరిజనోద్ధరణోద్యమమందు చేరియున్నవారు మహాత్ముని యుపవాసకాలమున తమ యంతరాత్మలవైపు దృష్టిని మరల్చి తమ లోపములను పరిశోధించి పశ్చాత్తాపశుద్ధ మనస్కులయ్యెదరు గాక. అంతేచాలదు. భవిష్యత్తులో అటు వంటి దోషములు లేకుండ తమ ప్రవర్తనమును రక్షించుకొనుటకు నిశ్చయించుకొనెదరుగాక

ఏ వి ఠక్కరుగారు హరిజనోద్ధరణోద్యమమునందు కొన్ని ప్రాంతముల జడత్వ దోషమును సూచించుచున్నారు. వారు తమ మాంద్యమును వదల వలసి యున్నది. భారతదేశమందనేక భాగములలో హరిజనోద్ధరణ సంఘములే యేర్పడ లేదట. ఇది యిటుండ కొందరు సనాతనులు హరిజనులను దేవాలయ ప్రవేశార్హత గలవారినిగ జేయు చిత్తుశాసనములను ప్రారంభము నుండియు ఎదిరించు చున్నారు. ఇదంతయు మహాత్ముని మనస్సును కలవరపెట్టి యుండునని తలచెదము మొదట మహాత్ముని యుపవాసమును మాన్పుటకై సవర్ణ హిందూనాయకులు అస్పృశ్యతను నిర్మూలించుటకై వాగ్దాన మిచ్చునపుడు ఏ అభ్యంతరమును తెలుపక మహాత్ముడు ఉపవాసమును విరమించువరకు తూష్ణీంభావము వహించిన

వారు ఆ వాగ్దానమును నెరవేర్చబోవు సరికి అడ్డుతగిలిరి ఈ ప్రతికూలుర కందరికి ఈ రెండవ ఉపవాసము ఆత్మపరీక్షకు తగిన సమయము. వారు ప్రాచీనమైన పద్ధతియనెడు ఒక్క హేతువుచేత మాత్రమే ఏ ఆచారమునైనను గౌరవించుటకు సిద్ధులుగ నుండకూడదు తత్వమును మనస్సులో ఏ పక్షపాతములేక విచారించి తదనుసారముగా వర్తించవలెను. హరిజనోద్ధరణోద్యమమునకు అనుకూలురుగ నున్నవారు మాంద్యమును మాని చురుకుగా పని చేయవలెను.

ఇట్లంతయు తప్పక జరుగుననియే మా నమ్మకము మహాత్ముని మనోబలము అప్రతిహతమైనది. మహాత్ముడు తలపెట్టినంత దానిలో ముప్పాతిక వంతైనను ఈ 21 రోజుల ఉపవాసదీక్షలోగా నెరవేరవలెను. లేనిచో మరియొక సారి మహాత్ముడు ఇటువంటి ఉపవాసమును పూనవలసి వచ్చును. ఆ మాటను యిప్పటి నుండియే మహాత్ముడు సూచించుచున్నాడు ప్రస్తుతోపవాసము యిక మీద రాబోవు అటువంటి యుపవాసములలో మొదటిది యని మహాత్ముడు చెప్పుటలో అదే అభిప్రాయమని మాతలంపు ప్రస్తుతోపవాసమునే అంత్యోపవాసమునుగ గూడ చేయగల శక్తి భారతీయుల చేతిలో నున్నది వారు మాంద్యమును ప్రాతికూల్యమును వదలి మహాత్మునికి ప్రియులగు హరిజనుల నుద్ధరించుట యందు శ్రద్ధాభక్తులతో పని చేయుదురేని మహాత్మునికి అటువంటి మరియొక ఉపవాసముతో పనియుండదు

ఈ సమయమున మహాత్ముని విడుదలయు భారతీయులందరికిని సంతోషము కలిగింపక మానదు వారు ప్రభుత్వమున కిందులకై కృతజ్ఞులు, కాని ఇది దుఃఖములో సంతోషము భగవంతుని నమ్మి మహాత్ముని యాత్మోత్సాహమునకై భారతప్రజలు ద్విగుణీకృత శ్రద్ధతో అస్పృశ్యతా నిర్మూలనోద్యమమున పని చేయుటకన్న యిప్పుడు వేరు మార్గమేదియు కన్పడదు. అది యే మహాత్ముడును సూచించిన మార్గము.

———

# నిజాం రాష్ట్రమందు ఖద్దరు

## 17-6-1933

ఈ సంచికయందే మఱి యొక చోట పొందుపరపబడిన హైదరాబాదు ఖాదీ వస్త్రాలయము యొక్క రెండవ సంవత్సరపు నివేదిక మ ఖ. వ నిజాం రాష్ట్రమందు ఖద్దరు వృద్ధిచేయుటకుగల ఆశను, అవకాశమును సూచించుచున్నది ఈ ఖాదీ వస్త్రాలయము 'అఖిల భారత తంతు కారక సంఘము' (ఆల్ ఇండియా స్పిన్నర్స్ అసోసియేషన్) యొక్క శాఖగా 1931 జూన్ 14 వ తేది స్థాపింపబడెను 1932 జూను 14 వ తేది మొదలుకొని 1933 జూన్ 14 తేదితో అంతమగు సంవత్సరములో ఈ సంస్థ చిల్లరగానేమి, ఏజంట్లకేమి అమ్మగల్గిన ఖద్దరు మొత్తము విలువ రూ. 34043-5-11లు. 1931 జూన్ 14 వ తేదితో అంతమగు సంవత్సరములో ఈ సంస్థ రూ. 15166-7-7 లు విలువగల ఖద్దరును అమ్మగల్గెను. అనగా మొదటి సంవత్సరములో కన్న రెండవ సంవత్సరములో సదరు సంస్థ అమ్మగల్గిన ఖద్దరు రెండింతలకుపైబడియేయున్నది. మొదటి సంవత్సరములో వస్త్రాలయము రూ 29000 ల సరకును కొనియుండెను. రెండవ సంవత్సరములో రూ 50000 ల సరకు కొనబడెను ఈ విధముగా ఈ రాష్ట్రమందు ఖద్దరును ప్రేమించువారి యందు వృద్ధి కనబడుచున్నది.

దీనికి అనేక కారణములు గలవు భారతదేశమంతటను క్రొత్తగా వ్యాపించియున్న స్వదేశీయ వస్త్రాభిమానము కొంతమట్టుకు ఒక కారణము. అయితే ఇది ఈ రాష్ట్రమందు అంత ప్రధానమైనదని తలచబనిలేదు. ఇక్కడ ఖద్దరు వ్యాప్తిని పెంచగల్గిన ముఖ్య కారణము సామాన్యులగు గ్రామ జనులు మొదలుకొని నాజూకు కోరు పెద్ద నాగరకులవరకు ఎన్నెన్ని రుచులుగలవో వాటికన్నిటికిని సరిపోవు ఖద్దరు సరకును వస్త్రాలయము అమ్మగల్గుటయే అని నివేదికలో తెలుపబడినది ఈ సందర్భములో నిజాం రాష్ట్రీయులు గర్వింపదగిన విషయమేమనగా, వస్త్రాలయమువారు అమ్మగల్గిన పలు రకముల ఖద్దరు

సరకులో ఉన్ని అల్లిక సరకులు తప్ప తక్కిన ఎక్కువ భాగము తమ రాష్ట్రమందే ఉత్పన్నమైనదని నివేదికలో తెలుపబడియుండుట. మొదటి సంవత్సరము రాష్ట్రము వెలుపల నుండి తెప్పించిన సరకు వస్త్రాలయము వారు కొనిన మొత్తము సరుకులో సుమారు 5వ వంతు మాత్రమే యుండెను. రెండవ సంవత్సరములో ఈ దిగుమతిలో సగము తగ్గెను ఖద్దరు విషయమున ఓర్పును, ప్రోత్సాహమును, పట్టుదలయు హెచ్చినచో ఈ రాష్ట్రమందు ఖద్దరు ఎట్లు వృద్ధి చెందగలదో దీనివలన సూచితమగుచున్నది. శ్రీమతి సరోజినీదేవి హైద్రాబాదులో నున్న ఖాదీ వస్త్రాలయమును సందర్శించినప్పుడు కరీంనగరములో తయారగు ఖద్దరును గూర్చి గావించిన ప్రశంసయు ఈ రాష్ట్రమందు ఖద్ధరు వ్యాప్తికి ఆశను కల్పించుచున్నది. "కరీంనగర్ జిల్లాలో తయారు చేయబడిన ఖద్దరు భారతదేశమందు తక్కిన భాగములలో చేయబడు అటువంటి రకములతో సరిగా తూలతూగుచున్నదని" దేవిగారు చెప్పిరి.

మ ఘ వ. నిజాం ప్రభువుగారి రాష్ట్రమందు ఖద్దరు వ్యాప్తికి అనుకూలించు ముఖ్య విషయము మరియొకటి గలదు. ఇచ్చట ఖద్దరు సరకు ధరను తగ్గించిన కారణములలో ప్రత్తి ధర తగ్గుటతోపాటు వడకు వారి యొక్కయు నేయువారి యొక్కయు పనితనపు నేర్పు వృద్ధియగుటయు, వారి పరస్పరానుకూల్య భావమున్ను చేరియున్నవి ఇవి శాశ్వతముగ నుండగల విషయములు, నిజాం సంస్థానము గర్వింపదగిన విషయములు ఈ కారణములు పై జెప్పబడిన యితర కారణములతో కలిసి స్థానిక ఖాదీవస్త్రాలయము వారిని వివిధ సంస్థలలో ఏజంట్లనేర్పరచి ఖద్దరు వాడుకను ఎక్కువజేయ ప్రోత్సహించినవి. ఇప్పుడు ఔరంగాబాదు, నాందేడు, జాల్నా, అంబాజోగల్, హింగోలి, నిజామాబాదు - ఈ చోట్లలో ఏజన్సీలు గలవు

ఒక్క ఖాదీ వస్త్రాలయము యొక్క ప్రయత్నమువలన ఈ రాష్ట్రమందు ఖద్దరు వ్యాప్తి యింతవృద్ధియై నప్పుడు, ప్రభుత్వమువారి ప్రోత్సాహమున్నచో ఇంకెంత వృద్ధిగావచ్చునో సుళువుగా ఊహింపగలము కాబట్టి యే నివేదికలో మ ఘ.వ నిజాం ప్రభుత్వమువారి ప్రోత్సాహము ఖాదీ వస్త్రాలయమువారిచే అపేక్షింపబడినది. ఇప్పుడు మన ప్రభుత్వమువారు అక్ట్రాయిపన్నును దీసివేసి

ఖద్దరు సరకును ఈ రాష్ట్రమందు ఒకచోటి నుండి మరియొక చోటికి అదనపు ఖర్చేమియు లేకుండ గొనిపోవుటకు వీలుగల్గించి యున్నారు. ఇది ఖాదీ వస్త్రాలయము వారి ప్రయత్నములకు చాల తోడ్పడినది అయినను ప్రభుత్వమువారు తలచుచో తమ రాష్ట్రమందు ఖద్దరు వ్యాప్తికి ఇంకను ఎక్కువగ తోడ్పడ వచ్చునని సూచింపబడుచున్నది మైసూరు సంస్థానమందు మునిసిపాలిటీ వైద్యాలయములు మొదలగు ప్రభుత్వ సంస్థలు ఆ సంస్థానమునందు చేయింపబడిన ఖద్దరును ఉపయోగించుచు ప్రోత్సాహ మొదగుచున్నవి మైసురు దివానగు సర్ మీర్జా ఇస్మేయిల్‌గారుకూడ మైసూరు ఖద్దరు ధరించి రెండవ గుండ్రబల్ల సభకుపోయి మార్గదర్శులైనట్లు తెలుపబడినది. ఈ విధముగ మన ప్రభుత్వము వారు గూడ ఈ రాష్ట్రమందు ఖద్దరుకెందుకు ప్రోత్సాహ మీయరాదు?

ఖద్దరన్న ఈ రాష్ట్రమందు ప్రభుత్వోద్యోగులు అనుమాన దృష్టితో చూచునట్లు తెలుపబడినది. ఇందుకు కారణమేమి? బ్రిటిషిండియాలోనన్నచో కాంగ్రేసువారు శాసనోల్లంఘనోద్యమములో చేరినవారందరు ఖద్దరు నియతముగా ధరించుటచే, ఖద్దరు ధరించు వారు శాసనోల్లంఘనమునకు ప్రోత్సాహమిచ్చుచున్నారను అనుమానము అచటి ప్రభుత్వమువారి కుండవచ్చును. మన రాష్ట్రములో కాంగ్రేసువారు అవలంబించు శాసనోల్లంఘనమే లేదు. మొదలులేని శాసనోల్లంఘనము ఖద్దరు ధరించుటచే పుట్టవచ్చునని తలచుటకు గూడ వీలులేదు బ్రిటిషు ఇండియాలో శాసనోల్లంఘనము ప్రారంభింపబడుటకు కారణములు వేఱు, ఖద్దరు ధారణమేమాత్రము దానికి పులిగొల్పి యుండలేదు

ఈ విధముగ ఖద్దరు వలన ఉపద్రవము కలుగక పోవుటయేగాక దాని వలన ప్రభుత్వమునకే ఎక్కువ సుఖము గల్గును. యంత్రముల సహాయముతో గుడ్డలను తయారు చేయుచోట్ల పనివాండ్రకును యజమానులకును ఏర్పడు సంఘర్షణలును, పనివాండ్ర యొక్క దుర్భర కష్టములును ఆ చోట్లలోని ప్రభుత్వములను ఏవిధముగ చిక్కుబెట్టుచున్నవో మనము చూచుచునే యున్నాము. సంఘర్షణంలో మధ్యవర్తిత్వము చేయుట పెద్ద చిక్కు. యంత్రవృద్ధివలన తుదకు పనివాండ్ర అవరసరము నానాటికి తగ్గుచుండినచో వారిలో నిరుద్యోగ మేర్పడును. అప్పుడు వారి ప్రాణరక్షణార్థమై ప్రభుత్వమువారు ఇతర దేశములలోవలె

'అనెంప్లాయమెంటుడోల్సు' వంటివాటితో సాయము చేయవలసిన చిక్కు వచ్చును పలువురు ఆర్థిక శాస్త్రవేత్తలు చెప్పిన విషయములను క్రోడీకరించి ఆలోచించి నచో, యంత్ర పరిశ్రమలకన్న చేతిపనులవల్లనే సుఖమెక్కువయని స్పష్ట మగును. కాబట్టి మన ప్రభుత్వము వారు ఈ రాష్ట్రములో నూలు నేత విషయ మున యంత్ర పరిశ్రమలకు ప్రోత్సాహము నిచ్చుటకు బదులు చేతిపనులకే ప్రోత్సాహమిచ్చుట మంచిదని మా అభిప్రాయము అందులో, అనేక విధముల ఖద్దరుపరిశ్రమ వృద్ధిపొంది అధిక ప్రశంసాపాత్రమగుటకు అనుకూల పరిస్థితులు ఈ రాష్ట్రమందుండ, ఇట్టి అవకాశమును త్రోసివైచుట యుక్తముగాదు. మన ప్రభుత్వమువారు యంత్రముల స్థాపింపదలచకున్నను,ఖద్దరును ప్రోత్సహించుట వల్ల మన రాష్ట్రమందు విశేషముగా పైరగు ప్రత్తి యిచ్చటనే అధికముగ ఉప యోగింపబడి, యిచటి పనివాండ్రకు పనిగల్పించి ఇచట దారిద్ర్యాధిక్యము వలన కలుగు అశాంతిని లేకుండజేసి సుఖమును నెలకొల్పగలదు. కావున మ. ఘ వ నిజాం రాష్ట్రమందు ప్రభుత్వమువారును తదితరులును త్వరలో వృద్ధిదశ యందున్న ఖద్దరుకు హృదయ పూర్వకమగు ప్రోత్సాహము నిచ్చుట యిపుడు కోరదగినది

---

# సంస్థాన ప్రజల ఘోష

## 26-7-1933

భారత సంస్థాన ప్రజల స్థితిని జూడ దిక్కులేనట్లున్నది. వారు తమ రాష్ట్రములో తమ కోరికలను తెలుపుకొనజాలకుండుటచే రాష్ట్రాంతరమునకు బోయి అచటనుండి తెలుపవలసి వచ్చుట సంతాపకరము. వారి కోరికలు అందరిచేతను దూషింపబడునంత నింద్యములైనచో వానిని గూర్చి ఏ వాదము అక్కరలేదు. తమ పాలనకు తామే బాధ్యులమై యుండవలెనను ప్రజల కోరిక యింతవరకును అర్థశాస్త్రవేత్తలచే దూషింపబడలేదు. అంతేగాక ఈ కాలమున నేటికిని "ఏ రాజ్యమందుగాని ప్రభుత్వము ప్రజలదే" యనుభావము ప్రతి నాగరిక రాజ్యమందును అంగీకృతమై యున్నది. ప్రజాస్వామిక పాలన కాలము అంతరింపలేదనియే మా నమ్మకము. కొందరు ఇటలీ, జర్మనీ మొదలగు ప్రాశ్చాత్య దేశములందు నియంతృత్వపాలన (Dictatorship) యున్నది గనుక ప్రజాస్వామిక ప్రభుత్వములంతరించినవని వాదింతురు. అచటనైనను ప్రజలు సమ్మతించినందువల్లనే వారు నియంతలకు అవసరమగు స్థితి యేర్పడినది గనుకనే ప్రజలు సమ్మతించిరి. అమెరికాలో రూజ్వెల్టుగారి అధికారము ఈమధ్య ప్రబలమైనదియు నీ కారణముచేతనే కావున ప్రజాస్వామిత్వమునకు భంగము రాలేదు. ఇట్లు ప్రపంచమందు చుట్టుప్రక్కల రాజ్యములలో ప్రజలు స్వాతంత్ర్యమును రుచి చూచుచుండ భారత సంస్థాన ప్రజలు దానిచే ఆకర్షింపబడకుండజాలరు. రుచిచూచుచున్న వారికి తమ రాజ్యములో అది లభింపదాయెను. మాకది కావలెనని తమ ప్రభువుగారికి తెలియునట్లు చెప్పుకొనకూడదాయెను. చెప్పుకొన్న చోటనైనను వారు మనుష్యులవలె వారి కోరికలు కోరికలవలె అనరింపబడవాయె. ఇంక వారేమి చేయగలరు? తమ కోరికలు సాధించుకొనుటకై యితర రాష్ట్రముల యొక్క శరణుజొచ్చుచున్నారు.

బొంబాయిలో ఈ జూలై నెల 22-28వ తేదులలో జరిగిన సంస్థాన ప్రజా మహాసభ యొక్క చతుర్థ సమావేశమునందు ఆమోదింపబడిన తీర్మాన

ములు ఈ విషయమును అన్నిటికంటె ఎక్కువ స్పష్టముగా సూచించుచున్నవి ఆ తీర్మానములలో నేమి కలదు? సంస్థాన ప్రజలు 8 కోట్లమంది యున్నను అఖిలభారత సమాహారము (ఆలిండియా ఫెడరేషను)ను గూర్చిన చర్చలలో వారి ప్రతినిధులకు తావీయలేదను కోపమును ఒక తీర్మానమును తెలుపుచున్నది. సంస్థాన ప్రజల ప్రతినిధులను శాసనసభలలో చేర్చుటకు ఏర్పాటులేనిది గనుక తెల్లకాగితపు సమాహార (ఫెడరలు) పద్ధతి యిష్టము కాదని యింకొక తీర్మానము చెప్పుచున్నది మరికొన్ని తీర్మానములలో వ్యక్తి స్వాతంత్ర్యము, సంఘముగ చేరుటకు హక్కు మొదలగు హక్కులు కోరబడినవి మరియొక తీర్మానము భావి రాజ్యాంగమందు ప్రభుత్వమనునది ప్రజల సొత్తుగా నుండవలెనని చెప్పుచున్నది. తీర్మానములలో సంస్థాన ప్రజల యనుమాన బుద్ధిని తెలుపునట్టివి కొన్ని గలవు ఆ అనుమాన మేమన సంస్థానాధిపతులకు తమకు బాధ్యతాయుత ప్రభుత్వము నిచ్చు కోరికలేదు అనునది అందుకై ప్రతి సంస్థానము ఫెడరేషనులో విధిగా చేరవలసినట్లు నియమింపబడవలెననియు, అట్లు చేరు ప్రతి సంస్థానములోను బాధ్యతాయుత ప్రభుత్వము విధిగా స్థాపింపబడవలెననియు మహాసభవారు తీర్మానించిరి ఇంతజేసినను ఆఖరుకు చర్యలలో సంస్థానాధిపులు ప్రజా స్వాతంత్ర్యమునకు భంగము కలిగించిన గతియేమి అనుసంశయముతో, ఫెడరలు చట్టముల నుల్లఘించిన సంస్థానాధిపతులపై ఫెడరలు కోర్టులో దావా చేయుటకు సంస్థానాధికారులకు హక్కుండ వలెననియు, ఎక్కడ దుష్పరిపాలనము జరుగునో ఆ సంస్థానము యొక్క ప్రజలు కోరిన వెంటనే అచటి అధిపతిని సార్వభౌముడు తొలగింపవలెననియు మహాసభ తీర్మానించెను. ఈ తీర్మానములను సంస్థాన ప్రజల కోరికలను సాధించుటకై ఇండియాలోను ఇంగ్లాండులోను ప్రచారము చేయబడవలెనను తీర్మానమును సంస్థాన ప్రజలకు తమ అధిపతులపై విశ్వాసమెట్లు నశించుచున్నదో తెలుపుచున్నది

సంస్థానప్రజల యనుమానము రెండు విధములుగ నున్నది. పై జెప్పినట్టిది మొదటిది. ఇక రెండవదానిని గూర్చి విమర్శించెదము. తమ కోరికలను సాధించుకొనుటకై సంస్థాన ప్రజలు పరప్రభువు ( బ్రిటిషు ప్రభుత్వము )ను, శరణుజొచ్చుచున్నారు ఇద్దరికి అనుకూల్యము లేనప్పుడు - పిల్లులు కొట్లాడుటచే కోతివలె - మూడవ వానికి లాభమను నీతికూడ వారి హృదయములను బాధించు చున్నది. ఆఖరుకు సంస్థానాధిపతులను, సంస్థాన ప్రజలను కూడ తక్కువ జేసి ఎవరు శరణముగా వేడబడుచున్నారో వారి వారి లాభమును జూచుకొని ఊరకున్నచో గతియేమి ? కనుక సంస్థాన ప్రజల యభిమతము లేనిదే వారి

యధిపతిని సింహాసనము నుండి తొలగింపరాదనియు, తొలగించుచోట్లరో బ్రిటీషు యిండియా నుండి ఎగుమతిచేసిన సివిలు సర్వీసు ఉద్యోగులనుగాక సంస్థాన ప్రజల ప్రతినిధులతో నేర్పడబడిన ఒక కమిటీని పరిపాలక స్థానమున నియమింప వలసినదనియు తీర్మానింపబడినది కాశ్మీరము, ఆల్వారు సంస్థానముల నిదర్శనమును మనసు నందుంచుకొనియే ఈ తీర్మానమును గావింపబడెను మహాసభకు అధ్యక్షతవహించిన యన్ సి కేల్కారుగారు చెప్పినట్లు సంస్థానములలో బ్రిటిషు మంత్రులను నియమించుటచే బ్రిటిషు యిండియాలో భారతీయులకు ఉద్యోగము లియబడుచుండుట వలన పోయిన స్థానములు బ్రిటిషువారికి సంస్థానములలో భర్తియగుటయేగాక, ఫెడరేషన్ ఒకవేళ యేర్పడినచో అందులో సంస్థాన ప్రతినిధులమను పేరుతో ఈ విదేశీయులుచేరి ప్రజల కోరికలతో సంఘర్షణ యున్నప్పుడు బ్రిటీషు ప్రభుత్వమువారి కోరికలనే సాధించుటకు సాధన భూతులై యుండగలరు.

ఇట్లు మొత్తముమీద భారత సంస్థాన ప్రజామహాసభవారి తీర్మానములు సంస్థాన ప్రజలకు ఇటుజూచినను అటుజూచినను అనుమానమేయను స్థితినితెల్పుచున్నవి సంస్థానములలో రాజులుండియు తమ ప్రజలను రంజింపజేయక వారి నిట్టిస్థితిలో పెట్టుట ఎంతమాత్రము గర్వింప దగినదిగాదు కొడుకు తండ్రిని అనుమానించి ఇతరుల సహాయమునాశించుట తండ్రికా లేక కొడుకునకా అపకీర్తి కరము? రాజైనవాడు ప్రజల కందరికి తండ్రివంటివాడు అను అభిప్రాయము నిల్చునుగాని ప్రజలను ప్రాణములేని తన సొంత సొత్తువలె రాజుపయోగించు కొనుటకు హక్కుగలదు అను అభిప్రాయమును ఎవరును వివేకవంతులు మెచ్చజాలరు అట్టి అభిప్రాయమునకు తావుండిన చోట్లలో నెల్ల ఉపద్రవమే ఫలితమైనది కాబట్టి సంస్థానాధిపతులు తమ ప్రజల జ్ఞాన సామర్థ్యములను బట్టి క్రమక్రమముగా బాధ్యతాయుత ప్రభుత్వమును హెచ్చించుచు పూర్తి జేయుటకు శాసనములను జాగుచేయక ఏర్పరుపవలెను ఇంటిలో పెద్ద పెరిగిన కొడుకునకు ఇంటి పెత్తనమంతయు ఒప్పజెప్పినట్లే రాజ్యపద్ధతియు నుండవలెను. ఇంటి విషయములో వలెనే రాజ్య విషయమును పరస్పరానురాగ నిబద్ధమై యుండవలెను. అనగా తమ ప్రజలకు ఏమి బాధలున్నను సంస్థానముల ప్రభుత్వము వారు సంతోషముతో తీర్చుచు వారికి మనఃక్లేశము గలుగనీయకుండ పాలింపవలెను. అట్టి రాజ్యములను ప్రజలెన్నటికిని విడువగోరరు ఈ బుద్ధిని భగవంతుడు కలిగించుగాక!

---

# నిజాం రాష్ట్ర వాణిజ్యము

## 4-9-1933

1341 ఫసలీలో నిజాం రాష్ట్రముయొక్క ఎగుమతి దిగుమతు లెట్లుండినది వివరించు ప్రభుత్వ పరిశీలనము మాత్రము మాకు పంపబడినది ఆ పరిశీలనమై కొంత వ్యాఖ్యానము గావించుటకు ముందు మేమొక మొఱను తెలుపవలసి యున్నది. పరిశీలన మొదలునుబట్టి చూడగానే ఆ పరిశీలనకు ముందు ఎగుమతి దిగుమతుల సంఖ్యలను మాత్రము ఇచ్చు నివేదిక ఒకటి యుండవలెనని గోచరింపగలదు. అట్టి నివేదిక ఏదియు మాకు పంపబడలేదాయెను. ఇట్లే మ ఘ.వ. నిజాం ప్రభుత్వము నందు మాకు నివేదికలను పంపక ప్రభుత్వ పరిశీలనను మాత్రమే పంపునట్టి శాఖలు ఇంకను కొన్ని కలవు. ఎట్లో మాకు లెక్కల శాఖవారి నివేదికయు సహకార శాఖవారి నివేదికయు చేరినవి. ఇదివరకు ఆర్థశాఖా నివేదిక విషయమునకూడ ఈ సంగతినే మేము మొఱపెట్టి యుంటిమి

ఇంక ప్రస్తుతాంశమునకు వచ్చెదము నివేదన సంవత్సరములో- పరిశీలన సంవత్సరములో ననుటయే మాకు సరియని తలచెదము- వాణిజ్యము అంతకుముందు సంవత్సరముకంటె సుమారు నూటికి 3 లేక 4 లెక్కన తగ్గెను ఆర్థిక దుస్థితి- అనగా డబ్బు పుట్టకపోవుట అందువల్ల ధరలు తగ్గుట అనులక్షణములు గల పరిస్థితి- ప్రపంచమునంతయు బాధించినటులే నిజాము రాష్ట్రమును గూడ బాధించి యుండినందువల్ల ఈ తగ్గుదల ఫలితమయ్యెను ఎగుమతులకంటె దిగుమతులు 3 కోట్ల 22 లక్షల 47 వేల రూపాయలు హెచ్చుట మన రాష్ట్రమునకు అనుకూల విషయముగ నుండవచ్చును

కొన్ని ముఖ్యమగు వస్తువుల విషయమున ఎగుమతి దిగుమతుల సంఖ్యలు సూచించు విషయములను పరిశీలింతము మన రాష్ట్రపు ఎగుమతులలో ముఖ్యమైనవి ప్రత్తియు, వేరు సెనగయు అవియేమో పడిపోయినవి 1340 ఫసలీలలో 1454079 మనుగులది మాత్రము ఎగుమతియైనది వేరుసెనగల ఎగుమతులు

53,4000 మణుగుల నుండి 40,80,000 మణుగులకు పడెను ఆముదాలు 2414673 మణుగుల నుండి 1898653 మణుగులకు పడెను ఈ వస్తువులను పండించు రైతుల గతి ఏమో దీనినిబట్టి తెలిసికొనవచ్చును గతము ఈ విధముగానుండ వర్తమానము కూడ ఎటువంటి ఆశకు తావీయక యున్నందువలన వివిధ గ్రామముల నుండి భూమిశిస్తు రకం తగ్గించిననేగాని బాగుపడజాలమను రైతుల మొరలు మాకు ఒకటి వెంబడి నొకటి వచ్చుచున్నవి మ ఘ వ నిజాం ప్రభుత్వమువారు కరుణామయులన్న సంగతి పూర్వపు బరాయిందాలు మాఫీల వలన రూఢమైనదే గనుక ఇపుడును వారు రైతుల స్థితిపై జాలిగొని వారి నుద్ధరించుటకు వారి భారమును తగ్గించు యత్నము ఆలపింపక చేసెదరని నమ్ముచున్నాము. పై జెప్పిన వస్తువుల విషయమున మాత్రమేగాక ధాన్యములన్నిటి విషయమున గూడ ధరలు లోపించినందువలన రైతుల భారము ఎక్కువైనది.

ఎగుమతులలో హెచ్చిన వస్తువుల విషయము చూచి సంతోషింపదగిన దొకటి కలదు ఈ రాష్ట్రమందు మిల్లులలో తయారైన గుడ్డల ఎగుమతులు 1340 ఫ లో రూ. 5000 ల విలువగలిగి యుండినవి. ఇపుడు ఒక లక్ష 42 వేం వరకు హెచ్చినవి రాష్ట్రమందు చేతితో తయారు చేయబడిన గుడ్డలు నివేదన సంవత్సరములో 15 లక్షల 48 వేల రూపాయల విలువగలిగియుండ పూర్వము 7 లక్షల 44 వేలు మాత్రమే యుండెను. అదే విధముగ నూనె మొదలగునట్టి చమురు ఎగుమతులు 1340 ఫ. లో 31 లక్షల 79 వేల నుండి 1341లో 33 లక్షల 46 వేలకు పెరిగెను. ఇట్లు ఈ సంస్థానములో వస్త్రపరిశ్రమయు, నూనె సంబంధమగు పరిశ్రమయు వృద్ధిగాంచుట గర్వింపదగిన విషయమే

వస్త్రముల విషయమున ఎగుమతి దిగుమతులను రెంటిని పోల్చిచూచినను మన రాష్ట్రమునకు అనుకూలముగనే యున్నది మిల్లు గుడ్డల ఎగుమతుల విలువలో పూర్వముకంటే నివేదన వత్సరములో నూటికి 2740 వంతున ఎక్కువగా దిగుమతులు నూటికి సుమారు 7 వంతున మాత్రమే ఎక్కువయ్యెను. చేతిపనులవలన తయారగు వస్త్రముల విషయములో ఎగుమతులు నూటికి 108 వంతున హెచ్చగా, దిగుమతులు 100 కి 41 వంతున మాత్రమే హెచ్చును. ఈ అంకెలలో మ ఘ.వ నిజాం రాష్ట్రమందు ప్రభుత్వ వాణిజ్య పారిశ్రామిక శాఖవారు ఇంతవరకును చేసిన అభివృద్ధి ప్రయత్నముల ఫలమును కొంతవరకు కనుగొనవచ్చును.

---

# గాంధీమహాత్ముడు—సంస్థానములు

## 5-10-1933

నేడు సాధారణముగా సంస్థానములు మహాత్మునిగాని, మహాత్ముని అనుసరించుచున్నవారినిగాని అనుమానదృష్టితో చూచుచుండుట రహస్యవిషయము గాదు. ఈ అనుమానముగుండా లోతుకు చూడగలిగినచో కనబడు మూలకారణ మేమి? గాంధీ మహాత్ముడు బ్రిటిషు ఇండియాలో ప్రజలకు స్వాతంత్ర్యము సంపాదించు తలంపుతో శాసనోల్లంఘనము చేయువారికి నాయకుడై యున్నాడు సంస్థానాధిపతులకు ఈ గాంధీ మహాత్ముని, వారి అనుచరులను చూచి తమ ప్రజలు కూడ పరిపాలన చేయు హక్కులను కోరుచు ఎదురు తిరుగవచ్చునేమో యను భయము కలదని ఊహింపవలసియున్నది. అనగా అప్పటికి సంస్థానపతులకు పరిపాలనలో తమ ప్రజలకు హక్కులను, అధికారమును ఇచ్చుట ఇష్టముకానిదని తేలుచున్నది ప్రజాభిప్రాయమునకు లోబడి ప్రభుత్వము చేయుట ఇష్టమైన పక్షమున సంస్థానాధిపతులు గాంధి గారిని ద్వేషింపవలసిన అవసర ముండదు.

ఈ వివరించిన కారణములచే సాధారణముగా అనేక సంస్థానములలో గొప్ప అధికార పదవులందుండు వారు గాంధీ మహాత్ముని పద్ధతులను మతమును ఇష్టపడనట్లున్నను, వారిలో అనేకులు విధిలేక తమ అంతరాత్మకు విరుద్ధముగానే అట్లుచేయుచున్నారని ఎంచవచ్చును. సత్యమును బహిరంగముగా చెప్పబడు పక్షమున మహాత్ముడు దేశమును అల్లరితో నిందించుటకై కష్టపడుచుండుట లేదనియు దేశశాంతికై వారికున్నంత హృదయావేగము మరి యెవరికిని ఉండజాలదనియు చెప్పవచ్చును. 'సెప్టెంబరు 30వ తేదినాడు మైసూరు శాసన సభను ప్రారంభించునపుడు సభ్యులకు స్వాగతమిచ్చి ప్రస్తుత దేశస్థితిని గూర్చి చర్చించినపుడు సర్ మీర్జా ఇస్మెయిల్, మైసూరు దివాను గారు ఈ విషయమునకు నిదర్శనమైరి. వారు ఏ మోమోటముగాని లేక మన దేశము స్వరాజ్యసుఖమును పొందుటకు అభ్యంతరములుగానున్న విరోధములను బాపుటకు గాంధీ మహాత్మునివలె అర్హుడైనవారు మరియెవరుగాని లేరని చెప్పిరి. గాంధీ మహాత్ముడు ప్రస్తుతము రాజకీయరంగమునందు ఉండుటవల్లనె క్రియా

శూన్యులగు స్వయంకృత నాయకులచే దేశముముండ్లకంపలలోగాని గట్టులలో గాని బడక సురక్షితముగా స్వరాజ్య మహా సౌధము జేరుటకు అవకాశము నిలిచియున్నదను భావమును సర్ మీర్జా గారు సూచించిరి.

సర్ మీర్జా ఇస్మెయిలుగారికి గాంధీ మహాత్ముని పొగడవలసిన అవసరము సత్యముజెప్పుట తప్ప వేరొండుగలదని తలంచుటకు ఆధారము ఏదిగాని లేదు. సాధారణముగా సంస్థానాధిపతులు నిరంకుశాధికార ప్రియులగనుకను క్రమ విరుద్ధమగు నిరంకుశత్వమునకు గాంధి గారు దూరులగనుకను సంస్థాన ప్రభువుల కొలువులో నుండు అధికారులు తక్కువ వారైననేమి గొప్పవారైననేమి అధమ పక్షము బహిరంగముగానైనను గాంధి మహాత్ముని మతమునెడ విరోధ భావము చూపవలసియుండగా మైసూరు సంస్థానపు దివానుగారు గాంధి గారిని ధైర్యముతో కొనియాడుటవలన ఇతర సంస్థానములకును మైసూరునకును గల భేదము సూచితమగుచున్నది. మైసూరులో ప్రభుత్వము ప్రజాభిప్రాయము ఏర్పరచు హద్దులను గమనించుచు ప్రవర్తించునట్లు ఇతర సంస్థానములలో లేదు. గాంధి మహాత్ముడు ఆఖరుకు కోరునది ప్రజాసామాన్యము యొక్క లాభక్షేమము లను గూర్చిన వివిధాభిప్రాయములను విని విచారించి ప్రభుత్వము అధిక సంఖ్యాకులకు మేలగురీతిని వర్తింపవలయుననియే ఈ అభిప్రాయమందు దోషమేమియు లేకుండుటయేగాక తదనుసారము ఆచరించుటవలన మేలుగలదు

సంస్థానప్రభువులు తమ ప్రజల సౌఖ్యమే తమ సౌఖ్యముగా నెంచు ఉదారా శయులగుచో తమ ప్రభుత్వమునకు ప్రజాభిప్రాయపు ఒత్తిడి తగులుటకు అంగీక రింపవలెను ఈ కాలమున ఏ రాజ్యములోగాని, ముఖ్యముగా, మన హిందూ దేశమందలి రాజ్యములలో ఒక దానికి నొక దానికి సంఘర్షణ కలుగుటకు అవకాశముతో గూడిన అనేకములగు తరగతులు లేక తెగలు గలవు. మొత్తము మీద రాజ్యమంతటికిని క్షేమాభివృద్ధులు కలుగవలయునని నీ విధములైన తెగల విరోధములను సరిపెట్టవలసియున్నది. అందుకు ఏఏ తెగలవారికి ఏదేది ఎక్కువ లాభకరమో ఏదేని చెరుపో కనుగొనుట ముందు ముఖ్యావసరము వాటిని బట్టిప్రభుత్వము వారి తీర్మానము ఉండవలసియుండును. ఈ విషయ మునే 'ప్రజాభిప్రాయము కనుగొనుట అవసరమని' అందురు దీనినే మిర్జా గారిట్లు చెప్పిరి. "అది (క్రొత్త రాజ్యాంగము) వివేకవంతులగు ప్రజలకు యిష్ట మగు గాక, న్యాయబద్ధ పరిపాలనము అయిష్టము పైననే ఆధారపడి యున్నది."

---

# గష్తినిషాన్ - 53

**30-11-1933**

విఖ్యాతమగు నీ గష్తీ జారీ అయిన దినము 17 దై 1339 ఫసలి కనుక గత 17 దై నాటికి దీని యాయువురో నాల్గువత్సరములు గడచి అయిదవ సంవత్సర మారంభమైనది.

ఈ గష్తీ వలన దేశీయుల వాక్స్వాతంత్ర్యమునకు కలుగుచున్న యాటంకములు పలుమారు పత్రికాముఖమున వివరింపబడినవి. దీని మూలమున ఆపబడిన గొప్ప ప్రజాసమావేశములలో ఆంధ్ర మహాసభయు, ప్రజాపక్ష విద్యా మహాసభయు చెప్పదగియున్నవి.

గడచిన నాల్గువత్సరములలో నీ విషయమున పత్రికాముఖముననే కాక మహాసభల యందెన్నియో మారులు ఖండనములు జరిగినవి. ప్రత్యేకముగా హైద్రాబాదు నగరమున ప్రథమ వత్సరాంతమున బ్రహ్మాండమగు ఖండన సభ జరిగి యుండెను రెండవ వత్సరాంతమున మరల నట్టి సభయే సమావేశమై గష్తీని రద్దుచేయుటకు ప్రభుత్వమువారు ప్రార్థింపబడిరి మూడవ వత్సరాంతమున సభా సమావేశమునకై వేడగా ప్రభుత్వమువారు సభకు అనుజ్ఞనీయక ప్రభుత్వమువారి వద్దకి గష్తీ కమిటీ సభాసదులను రాయబారము (డిప్యుటేషను) తీసికొని వచ్చుట మంచిదని సూచించిరి. కమిటీవారందులకంగీకరించి, ప్రభుత్వ దృక్పథము మారినదని యాశించి శ్రీయుత రామచంద్రనాయకుగారి అధ్యక్షతతో విఖ్యాతులగు హిందూ మహమ్మదీయ నాయకులుగల యొక రాయబారము నంపి లిఖితమగు నొక విజ్ఞప్తిని అర్పించుకొనుచు, ఈ గష్తీ దేశాభివృద్ధి నెట్లడ్డగించుచున్నదియు వివరించిరి. అట్టి విజ్ఞప్తితోబాటు అనుజ్ఞ నిరాకరింపబడిన పవి సభల పట్టికను దాఖలుచేసిరి ఈ రాయబారమును రెవిన్యూ పోలీసు శాఖా మంత్రి వర్యులు ఆహ్వానించి, శ్రద్ధగా వారి విన్నపము నాలకించి, ప్రభుత్వమువారి యెదుట ప్రజాభిప్రాయమును విశదీకరించి సాధ్యమైన తోడ్పాటు సల్పెదమని సెలవిచ్చిరి తాని తర్వాత గష్తీ కాఠిన్యమున మార్పు కలిగించుటకు బదులుగా దానిని సమర్థించుచు ప్రభుత్వము వారొక

"కమూనికు" ప్రకటించిరి దీనిలో రాయబారము వచ్చిన సంగతిగాని, వారి విజ్ఞప్తియుల్లేఖనముగాని కనుపడదు పత్రికలలోనీ గష్తీ విషయమున నేవో సంగతులు ప్రకటింపబడినవనియు, అవి ప్రభుత్వమువారి దృష్టికి తేబడినవనియు కమునిక్యులోని యుపోద్ఘాతము, "మా రాయబారము యొక్క పర్యవసానమైన" దని కమిటీవారు ప్రభుత్వము వారిని విచారించిరి, నెలలు గడచినవట కాని దానికి ప్రత్యుత్తరము రాలేదు. "ఇక వచ్చును, ఇక వచ్చును" అని ఎదురు చూచుచుండగనే నాల్గవ సంవత్సరము పూర్తియైనది. నాల్గవ వర్షాంతమున సభ సమావేశమునకై దరఖాస్తు పెట్టదలచిరట కాని మూడవ వార్షిక సభకే దొరకని యనుజ్ఞ నాల్గవ వార్షికమునకు దొరకునా యను నిరాశచే నుపేక్షించిరట! దరఖాస్తు పెట్టియుండినను నిరుపయోగమయ్యెడిదేమో!

ఎట్లయినను, ఈ విషయము చాలా ముఖ్యమైనదని మా తలంపు కమిటీ వారు ముందేమి చేయదలచిరో తెలియదు కాని, ఒక కోటి నలుబది లక్షల ప్రజల వాక్స్వాతంత్ర్యమును నిరోధించుచున్నట్టియు, శాంతకాలమున ప్రపంచమందలి ఏ నాగరక రాష్ట్రమునందును అమలులో నుండనట్టియు, శాసన నిర్మాణ సభ యుండగా వేరొకమార్గమున ప్రజలనైసర్గిక హక్కులను మితపరచునట్టియు -నీ గష్తీమహాఘనత వహించిన మన ప్రభుత్వము వారికి కీర్తి తేజాలదని మా విశ్వాసమును సవినయముగ మనవిచేయుచున్నాము. ఎంత తెలివి తక్కువ వారైనను ఈ రాష్ట్రములోని ప్రజలందు విద్య, విజ్ఞానము, ఆత్మగౌరవభావము హెచ్చుచున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రుల వార్షిక సభయందు అంగీకరింపబడిన తీర్మానముల యొక్కయు, ఇటీవల సమావేశమైన "ముల్కీ యుద్యమ" సభల యొక్కయు వైఖరి ప్రజాదృష్టిని ప్రభుత్వమువారికి తెల్పుటకు చాలియున్నది, పైన నుల్లేఖింపబడిన సభలు కేవలము హిందువుల దృక్పథము దెల్పునవి కావు వానిలో పాల్గొనినవారు నూటికి 75 మంది మహమ్మదీయ సోదరులు. దేశీయుల హక్కులకై ఇదివరకు ఎక్కువ యుత్సాహము చూపని మతము వారగు యువకులు ఆందోళనము నారంభించియున్నారు ఈ పరిస్థితులు ప్రభుత్వమువారు గమనించి, గష్తీని పూర్తిగ రద్దుపరచుటయో ప్రధాన విషయములందు కాఠిన్యమును తగ్గించుటయో, యుత్తమ రాజనీతికి లక్ష్యముగ నుండగలదని సూచించుటతో ప్రస్తుతము తృప్తినొందుచున్నాము

---

# ఆంధ్రభాషాపోషణం

## (11-1-1934)

కొన్ని రోజులక్రిందట మన ప్రభుత్వమునందు అర్థికశాఖలో మంత్రి వర్యులగు సర్. అక్బర్ హైదర్‌నవాజ్‌జంగ్ బహదర్‌గారు హనుమకొండ ఇంటర్మీడియేట్ కళాశాలకు ఆహ్వానింపబడి అచట కళాశాల సభలో ఉపన్య సింపుచు ఆ కళాశాలలో సంస్కృతాంధ్రపోషణకై ప్రత్యేకముగ ఉపన్యాసకుల నేర్పరుచుట చాలా ముఖ్యమైన అవసరమని కలాశాలాధ్యక్షులవారు గావించిన సూచనతో ఏకీభవించి యుండిరి. సర్ అక్బర్ హైదరిగారి యొక్కయు, కలాశాలాధ్యక్షులగు అజీజుఖానుగారి యొక్కయు ఈ గొప్పబుద్ధి మతభేదములను దాటియున్నది. కళాశాలాధ్యక్షులవారు మొదట పారసీక అరబ్బీ భాషలనుకూడ చేర్చిరి. కాని తర్వాత "ఆ భాషలకన్నిటికి ఏర్పాట్లు చేయుట సాధ్యము కాకున్నను అధమపక్షము తెలుగు సంస్కృతములకైనను అట్టి ఏర్పాటు అవసరము." అని చెప్పియుండిరి. వరంగల్లు ప్రాచీనమునుండి సంస్కృతాంధ్ర విజ్ఞానములకు పోషణస్థానముగా గణనకెక్కి యుండినది కాబట్టి ఆ ప్రాచీన విజ్ఞాన సంరక్షణార్థమీవిధమగు ఏర్పాటు అవసరమని ఇరువురు మహాశయుల యొక్కయు అభిప్రాయము కాబట్టి త్వరతో వరంగల్లు కేంద్రమున సంస్కృ తాంధ్రోపన్యాసకుల ఏర్పాటు జరుగగలదని నమ్మవచ్చును

ఈ సందర్భమున సర్ అక్బర్‌గారి మరియొక మాటకూడ ముఖ్యముగా మనసున నుంచుకొనదగియున్నది. వారు ఇంటర్మీడియేటు కళాశాల స్థానిక భాషలను వృద్ధి చేయవలయుననిరి ఈ అభిప్రాయముతో కళాశాలాధ్యక్షులగు అజీజుఖానుగారి మాటను చేర్చుదము. అజీజుఖానుగారు వరంగల్లు తెలంగానా ప్రాంతపు విజ్ఞాన చక్రమునకు కేంద్రమనిరి కాబట్టి వరంగల్లు ప్రాంతములో ఇంటర్మీడియేటు కళాశాల ముఖ్యముగా తెలుగు భాషను వృద్ధిచేయదగియున్నది, అనుమాటను కలాశాలాధ్యక్షులవారును అర్థికమంత్రి వర్యుడును ఒప్పుకొనక తప్పదు. తెలుగుభాష వృద్ధిజెందుటకు బాల్యమునుండి అన్ని విషయములను తెలుగుద్వారా బోధించుటకంటె శ్రేష్ఠతరమార్గము వేరొకటిగలదా? కాబట్టి సర్ అక్బరుగారు నిజముగా ఇంటర్మీడియేటు కళాశాలలు స్థానికభాషల నభివృద్ధి చేయవలయునని హృదయపూర్వకముగా నమ్మెడు పక్షమున తెలంగానా ప్రాంతపు సర్కారి పాఠశాలలలో తెలుగుద్వారా విద్యనేర్పుటకు ఏర్పాటు చేయ వలసి యున్నది ఇదియే ఆంధ్రులు కోరునది. ఈ కోరిక ఎప్పటికి తీరగలదో?

---

# ఉర్దూభాష-విద్యావ్యాప్తి

**18-1-1934**

ఈ మధ్యమధ్య హిందూదేశ సంస్థాన ప్రజా మహాసభవారు సమావేశమై జవోరా సంస్థాన ప్రభువు ఆ సంస్థానమందు ఉర్దుభాష చదువను వ్రాయను నేర్చినవారు చాలా తక్కువమందియైనను ఉర్దునే సర్కారు వ్యవహార భాషగా నుంచుటకు ఏర్పాట్లు చేసినందుకు తమ ఆందోళనమును దెల్పిరి. చాలా కాలము నుండి ఆ సంస్థానములో హిందీభాషయే సర్కారు వ్యవహారభాషగా నుండె ననియు ఈ మధ్యనే ఆ సంస్థానపు నవాబుగారు హిందీస్థానమును ఉర్దుభాష కిప్పించుటకు పట్టుబట్టి యుండెననియు తెలియుచున్నది

ఈ పరిస్థితులు మన రాష్ట్ర పరిస్థితులను మనస్సునకు దెచ్చుచున్నవి. మన రాష్ట్రములో 1931 వ సంవత్సరపు జనాభా ప్రకారము మొత్తము జన సంఖ్య 14436148 మందిలో 192039 మంది మాత్రమే ఉర్దుభాష చదువను వ్రాయను నేర్చియున్నవారు 1327 వ ఫసలీలో ఉస్మానియా విశ్వవిద్యాలయము స్థాపింపబడెను అది మొదలుకొని ఉర్దుభాష మనరాష్ట్ర విద్యావిధానమందు అగ్ర స్థానము వహించియున్నను ఇప్పటికి ఉర్దు చదువను వ్రాయను నేర్చినవారు (సామాన్యముగా ఒకరికొకరు వ్రాసికొను జాబుల నను గ్రహింపవలెను) 100కి ఇద్దరైనను బయలుదేరలేదని తేలుచున్నది. విద్యాశాఖకై చేయబడు వ్యయమా అంతకంతకు ఎక్కువగా యున్నదేగాని తగ్గుట లేదు అంత అధికమగు ఖర్చుతో ఇంత తక్కువ సాధింపబడుటకు మాతృభాషా మూలమున విద్య నేర్పుటకు ఏర్పాటులు చేయకపోవుట ఒక ముఖ్యకారణమని మా అభిప్రాయము.

స్థలాంతరమున ముల్కీ ఉద్యమనాయకులు కొందరు స్థాపింపదలచిన "నిజాం ప్రజాసమితి" యొక్క ఉద్దేశ్యములును, విధానమున్ను తెలుపబడినవి. వాటిలో ముఖ్యమైనది ఒకటి ఏమనగా నిజాం రాష్ట్ర ప్రజలకందరికి సామాన్య

ముగా నుపయోగపడుటకు వ్యవహారభాష హిందీగా నుండవలెనను మతము. అనగా ఈ రాష్ట్రమున సైతము వివిధ భాషలవారికి సామాన్య వ్యవహార భాషగా నుండుటకు ఉర్దుకంటె హిందీయే ఎక్కువ తగినదని ముల్కీ ఉద్యమము యొక్క అభిప్రాయము. ఎటు జూచినను రాష్ట్రీయులలో పదిమందికిని ఎక్కువ లాభకరము కాని ఉర్దులో మాత్రమే అన్ని స్థలములలోను విద్యనేర్పు ఏర్పాటు వలన వృధా ధనవ్యయము తప్ప మరియొక లాభముండదు.

జవోరా సంస్థాన ప్రభువు చేసిన మార్పు-అది నిజమేయైనచో-ప్రశంస నీయము కాదు. మన ప్రభుత్వమువారును ఎంత త్వరలో మాతృభాష ద్వారా విద్య నేర్పించు ఏర్పాటుల అవసర ప్రాముఖ్యములను గ్రహింపగలరో అంత మంచిది.

——

# ఇతర సంస్థానములు

## 30-4-1934

ఇంతకు పూర్వము మేము మన రాష్ట్రమందు తయారుచేయబడు అగ్గిపెట్టెలపైన మనప్రభుత్వము వారు విధించిన పన్నును గూర్చి మా అభిప్రాయము నిచ్చుచు దానివలన ఇప్పటికిని ప్రారంభ దశలోనే యున్నదన దగిన మన రాష్ట్రీయమైన అగ్గిపుల్లల పరిశ్రమ యొక్క అభివృద్ధికి ఈ పన్ను గొప్ప ఆటంకమగునని చెప్పి "వీలుండిన వెంటనే ఈ నూతన శుల్కములను రద్దు చేయవలయు"నని కోరి యుంటిమి ఈ పన్నును విధించు విషయమున ఇతర సంస్థానములను చూడుడు మన సంస్థానమును చూడుడు మన సంస్థానమువారు ఒక విధముగా అనవసరమైన తొందర జూపిరని మాకు తోచుచున్నది. ఎట్లనగా ఈ అగ్గిపెట్టెల పైని యక్సైజు పన్నును అమలు పరచుట యందు మన ప్రభుత్వము వారు మొట్టమొదటి వారైరి అంతేకాక పన్ను మొట్టమొదట బ్రిటిషు యిండియా శాసనసభలో ఇండియా ప్రభుత్వమునందలి ఆర్థిక సభ్యుడు కోరినంత విధింపబడినది.

సంస్థాన ప్రభుత్వములు తమ రాజ్యములందు తయారుచేయబడు అగ్గిపెట్టెలపై పన్ను అమలు పరుచవలసి వచ్చినది ఇండియా ప్రభుత్వమువారు కోరుట వలననే ఇండియా ప్రభుత్వము ఇట్లు కోరుటకు కారణము వారు బ్రిటిషు యిండియాలో తయారుచేయబడు అగ్గిపెట్టెలపై పన్ను వసూలు చేయదలచుటయు సంస్థానములలో ఇటువంటి పన్ను లేనిచో బ్రిటిషు ఇండియా వారు అగ్గిపెట్టెల పరిశ్రమలను సంస్థానములలో స్థాపించుకొని పన్నును తప్పించుకొందురను భయమున్ను అయియున్నది ఈ కారణమును తృప్తి పరచుటకు ఇండియా ప్రభుత్వము వారు తమ రాజ్యమందు తయారుచేయబడు అగ్గిపెట్టెలపై ఎంత పన్ను విధింతురో చూచి అంత మాత్రమే విధించిన చాలదా? మొదట ఇండియా ప్రభుత్వము యొక్క ఆర్థిక సభ్యుడు కోరియుండునట్టియు, ఈ ఏప్రిలు 1 వ.

తేది నుండి మన రాష్ట్రమందు అమలుపరుపబడుచున్నట్టియు పన్నురేటు బ్రిటిషు ఇండియాలో, అమలు పరుపబడుటకు ముందే, శాసనసభ వారిచే మార్చ బడినది. ఇండియా ప్రభుత్వము వారును ఈ మార్పు నంగీకరించినారు ఈ మార్పు ప్రకారము అగ్గిపెట్టె 1 కి 40 పుల్లలు గల అగ్గిపెట్టెలపై 144 కి ఒక రూపాయి వంతునను, ఈ లెక్కన 60 పుల్లల పెట్టెలపై వాటికి తగినట్లును 80 పుల్లల పెట్టెలపై వాటికి తగినట్లును పన్ను అమలు పరుచబడును. ఈ విధముగా నున్న అమలుపరచిన తర్వాత గూడ కల్దారు మూడు పాయిలకొక నిప్పుపెట్టె బజారులో అమ్మబడు పోవునట్టిది ఉండగలదని ఆశింపబడు చున్నది ఈ మార్పు అగ్గిపెట్టెల పరిశ్రమ యొక్క అభివృద్ధి క్రొత్త పన్నువలన తగ్గకుండునందులకై చేయబడినది. ఈ మార్చిన రేట్లవల్లనే ప్రభుత్వము వారును తమకు ఎక్కువ ఆదాయము వచ్చునని ఆశించిరి

మన రాష్ట్రమందలి అగ్గిపెట్టెల పరిశ్రమ బ్రిటిషు యిండియాలో దానికంటే ఎక్కువ అభివృద్ధి జెందినదికాదు గదా॰ అట్టి సందర్భములో బ్రిటిషు యిండియాలో పరిశ్రమ అంగీకరింపజాలని పన్నును మన రాష్ట్రీయ పరిశ్రమ మాత్రము భరింప జాలునా॰ నిప్పు పెట్టె ప్రతి బీదవాడును ఉపయోగించునట్టి వస్తువు. ఈ క్రొత్త పన్నువలన ధనవంతులగు కొద్దిమందికి ఏ బాధయు అనిపించకున్నను అనేకులగు బీదలకు ఖర్చు హెచ్చును పన్నువలన నేర్పడు క్రొత్త పరిస్థితులు వారికి భారముగా నుండవలయును మన ప్రభుత్వమువారు తమ తొందరలో కొనువారినిగాని అమ్మువారినిగాని మనస్సులో నుంచుకొననట్లే యున్నది

బరోడా ప్రభుత్వమువారిని జూడుడు. వారును అగ్గిపెట్టెలపై పన్ను విధించుటకు నిశ్చయించినను ఇండియా ప్రభుత్వము వారు ఏ రేటును అమలు పరచిన ఆ రేటునే తమ రాజ్యములో అమలు పరచవలెనని వారు ఉత్తరువు చేసిరి పుదుకోట్ట సంస్థానములో ప్రభుత్వము వారు పన్నును అమలు పరచుటకు ముందు తమ శాసనసభవారి అభిప్రాయమును గైకొనిరి ఈ ఏప్రిల్ నెల 19 వ తేదినాడు పుదుకోట్ట శాసనసభవారు అగ్గిపెట్టెలపై పన్నును అమలు పరచుటకు అంగీకరించిరి. పన్ను ఏ రేటు ప్రకారము అమలుపరుచబడునో

తెలియుటలేదు. మన రాష్ట్రమునకు గూడ శాసనసభ ఒకటి ఉన్నది గదా! మన ప్రభుత్వము వారు క్రొత్త పన్ను విషయమై శాసనసభ వారి ఆమోదమును బడసిరా? అధమ పక్షము వారి యభిప్రాయమునైనను గైకొనిరా? ఈ విషయములు తెలియవచ్చుటలేదు ప్రభుత్వము వారు పన్ను అమలు పరచుటకు ఆజ్ఞ నిచ్చు సమయమును ఈ విషయములను ఒక ప్రకటనమూలముగానైనను తెలియజేసి యుండలేదు

రాష్ట్రీయుల అగ్గిపెట్టెలపై ఎంత పన్ను విధింపబడుచున్నదో ఇతర రాజ్యములనుండి దిగుమతి యగు వాటిపై అంతపన్ను విధించుటచే మన రాష్ట్ర మందలి పరిశ్రమకు భయము తప్పునని ప్రభుత్వమువారు తలచినట్లున్నది ఇది చూడగాబీదవారికి ధనము పుట్టని ఈ కాలములో ఆదాయము హెచ్చు అగుటకు తగినంత తోడ్పడకున్నను వారి ఖర్చుకు మాత్రము మరికొంత చేర్చబడినట్లైనది.

— —

# మా తొమ్మిదవ సంవత్సరము

**7-5-1934**

మా పత్రిక నేటితో ఏనిమిగి సంవత్సరములను పూర్తిచేసి తొమ్మిదవ సంవత్సరమునకు ప్రవేశించినది ఎప్పటివలెనే దాటింపవలసిన రాజకీయార్థి కాదులైన గండములు దాటింపబడినవి

గత సంవత్సరము మేము పీతైనంతవరకు, చేతనైనంతవరకు, పత్రికను ఎక్కువగా ప్రజలకుపయోగపడునట్లుగా నడిపితిమని తలచుచున్నాము ఈ సంవత్సరము అనేకములగు మార్పులు చేయబడుచున్నవి. పత్రిక యొక్క సంవత్సరపు చందా 7 రూపాయీలు బదులు 6 రూపాయీలే చేయబడినది. అర్ధ సంవత్సరము చందా రూ 3-12-0 లకు మారుగా 3 రూపాయీలే చేయబడినది విడి పత్రిక ఖరీదు 0-1-4 లకు మారుగా 1 అణాచేయబడినది చందా తగ్గించినను పత్రిక యొక్క పుటలు తగ్గింపుటకు మారుగా 12 పుటల నుండి 16 పుటల వరకు హెచ్చింపబడినవి. మా చందా దారులు కాని యాంధ్రులును ఈ విషయములను గమనింప ప్రార్థితులు.

స్థానికములగు నితర పత్రికలకన్న నీ పత్రిక యొందునను తీసిపోదని మా దృఢ విశ్వాసము. చందా అన్ని పత్రికల కన్న చౌక. విషయ బాహుళ్యము అన్ని స్థానిక పత్రికలలోకన్న హెచ్చు (స్థానిక ఉర్దు దిన పత్రికలలో కన్న హెచ్చె అని గట్టిగా చెప్పచున్నాము) అట్లుండియు మన యాంధ్ర సోదరులకు తమ మాతృభాషా పత్రికపై తమకై కష్టించునట్టి పత్రికపై అభిమానము తక్కువగా నుండుటకు కారణము దురూహ్యము

---

# మన స్వదేశీ ఉద్యమము

**21-6-1934**

మ ఘ వ నిజాం ప్రభువరేణ్యుడు తమదేవిడిలో గోల్కొండ సబ్బులనే ఉపయోగించుచున్నామని చెప్పి నెలలు, సంవత్సరములు గడుచుచున్నవి-అప్పడే ఉత్సాహముతో ప్రారంభమైన "బై-హైదరాబాదు లీగు" (హైద్రాబాదు వస్తువులనే కొనుడు అని ప్రచారము చేయుటకై పుట్టిన సంఘము) ఇప్పుడు ఎక్కడ నున్నది కూడ ప్రజల దృష్టికి వచ్చుట లేదు. గత దీపావళికి ముందు సంవత్సరపు దీపావళిలో నగరములో ప్లేగుండగా 'సదరు లీగు' సభ్యులు కొందరు తాము ప్రత్యేకముగా సాధ్యమైనంతవరకు కొన్ని కొన్ని ఇండ్లకుపోయి విదేశ వస్తువులను కొనకుండ ప్రబోధము చేసెదమని చెప్పి అట్లే చేసిరి. అంతటితో లీగులో చేరిన వ్యక్తులు గూడ మరల ఆ కార్యమువైపే దృష్టి మరల్చుట మాని నట్లున్నది. లీగు పని చేయుచున్నచో కొద్దికొద్దిగానైనను ఆ విషయము తెలియును కదా. ఈ విధముగా పనిచేసినచో ఏ రాష్ట్రమందుగాని స్వదేశీ అభిమానము ఎంత కాలమునకు ప్రజాసామాన్యమందు వ్యాపించగలదు· దయామయులు అగు ప్రభువుగారు ప్రోత్సాహమిచ్చి మార్గము చూపుచున్నను ఈ విధముగా ప్రజలు మాంద్యము చూపుచున్నపుడు ప్రభుత్వము వారి ప్రోత్సాహము లేకపోగా మీదు మిక్కిలి వారివలన ఆటంకము కలుగుచో-ఒక విధముగా చూచిన ఆ సందర్భములో ప్రభుత్వము వారిని అనవలసిన పని యేమి యుండదు.

ప్లేగువలన తమ ఉద్యమ ప్రచారమును ఆపవలసి వచ్చినది అను వారు ప్లేగు తగ్గగానె ప్రచారమునకు పూనుకొనియుండుట యుక్తము. అయితే యిపుడు ఆ ప్లేగు పోయినది-మరల ప్లేగు తగ్గినది స్ఫోటకము విజృంభించియుండి తగ్గుచున్నది ఈ విధముగా కాల పరివర్తనమే గాని క్రియ శూన్యముగా నున్నది

పశ్చిమ భారత ద్వీపకల్పములో అనేకములైన చిన్న చిన్న సంస్థానములు గలవు. ఈ సంస్థానములతో శాసనోల్లంఘనోద్యమ కాలమున స్వదేశీ ఉద్యమము

నిద్రలో పడెను దాని నిపుడు మరల కళకళలాడునట్లు చేయుటకై అచ్చటి యువకులు పూనుకొనినారు వారు తయారు చేసి అమలుపరచగోరునట్టి క్రొత్త విధానమువల్ల మంచి లాభము గలుగగలదు- ఈ విధానము స్థలాంతరమున సూచింపబడి యున్నది మన రాష్ట్రమందు అటువంటి మార్గములో ప్రయత్నములు చేయబడుచో త్వరలో ఇచట అనేక దరిద్రుల కుటుంబములకు వృత్తులేర్పడ గలవు మన జిల్లాలలో అనేక స్థలములందు యిప్పటికిని కొన్ని కళలు తమ స్థానమును నిలుపుకొనియున్నవి వీటికి తగు ప్రోత్సాహమున్నచో అవి చక్కగా వృద్ధిగాంచ గలవు స్వదేశీయాభిమానము రాష్ట్రీయ ప్రజలలో ఎక్కువగా వ్యాపించిననె గాని రాష్ట్రీయులు తయారు చేయు వస్తువులకు మంచి నమ్మకమైన మార్కెట్టు ఏర్పడజాలదు తీవ్రమైన ఉత్సాహముతోను పట్టుదలతోను నిరంతర కృషి సల్పిననే గాని ప్రజలలో తమ రాష్ట్రపు వస్తువులు అను అభిమానము వ్యాపించదు. దానికి తగిన సమయము ఎట్లు అనగా ముల్కి ఉద్యమము యిపుడు క్రొత్త ఉడుకులోనున్నది. ఇది యొక విధముగా "రాష్ట్రీయ" భావమును రంగమునకు తెచ్చినది - మన రాష్ట్రీయ నాయకులు ఈ అవకాశమును పోగొట్టుకొనక రాష్ట్రము యొక్క ఆర్థిక సౌష్ఠవాభివృద్ధికి తగిన స్వదేశి ప్రచార విధానమును తీర్మానించుకొని త్వరలో కార్యరంగమున దిగెదరు గాక

---

# తృతీయాంధ్ర మహాసభ

**21-6-1934**

సుమారు పదునేను సంవత్సరముల క్రింద ఈ రాష్ట్రమున నారంభమైన ఆంధ్రోద్యమము క్రమక్రమముగా వికాసము పొంది ఆంధ్ర మహాసభ రూపమున నిలుకడగాంచి, మొట్టమొదట మెదకు జిల్లాలోని జోగిపేట యందు ఆంధ్ర జనాశయములు వెలువడెను. ఈ మహాసభకు ప్రభుత్వము వారి వ్యవసాయ శాఖ నుండియు, పశు చికిత్సాశాఖ నుండియు, సహకారశాఖ నుండియు ప్రతినిధులువచ్చి తోడ్పడి ఆంధ్రుల ఆశయముం యెడ నభిమానమును ప్రదర్శించిరి తరువాత ద్వితీయాంధ్ర మహాసభ నల్లగొండ జిల్లాలోని దేవరకొండ యందు వైభవముగా జరిగెను. దీనికి పై ప్రభుత్వ శాఖలవారే కాక పారిశ్రామిక శాఖాధికారులుకూడ వచ్చి యుపన్యసించియు, ప్రదర్శనముల జరిపియు సహాయమొనర్చిరి. ఈ రెండు మహాసభలందును ఆంధ్ర జిల్లాల నుండి జనులు వచ్చి పాల్గొనిరి. ప్రేక్షకుల సంఖ్య రెండువేలుండెననిన అందతిశయోక్తి లేదు.

మూడవ వత్సరమున మహాసభ 1341 ఫర్వర్ది నెలలో విఖ్యాతమగు జటప్రోలు సంస్థానపు రాజధాని నగరమున జరుప నిశ్చయింపబడియుండెను. కాని ఏ దైవిక కారణములో ప్రేరేపించినందున మన ప్రభుత్వము వారు దీని కంగీకారమొసగక పోయిరి. అంతేగాక ఎచ్చటను ఈ మహాసభ జరగవలసిన పనిలేదని ఆజ్ఞ ఇచ్చిరి 70 లక్షల ఆంధ్ర పుత్రుల యభ్యుదయమునకిట్టి ఆజ్ఞ ఆటంకముగానుండునని తలచి, ఆంధ్ర జన సంఘము (మహాసభ యొక్క స్థాయి సంఘము) వారు ప్రభుత్వము వారికి వివరములదెల్పి మరెచ్చటనైనను సభ జరుపననుజ్ఞ కోరిరి కాని రాజకీయముల చర్చించెదరను అనుమానముచే ప్రభుత్వమువారు సెలవియ్య నిరాకరించిరి తరువాత పోలీసుశాఖా మంత్రివర్యులు కేంద్ర సంఘ కార్యదర్శి విన్నపమును వినిన మీదట రాజకీయములలో ప్రవేశించమని నమ్మకమునకుగాను కార్యదర్శిగా నుండియు ఇతర సమావేశకుల నుండియు నగదు జమానతుకోరిరి. అట్లు జమానతు ఇచ్చుటకు శక్తి కలిగి

యుండియు, ఆత్మగౌరవమునకు భంగమని తలచి మహాసభ సమావేశ సంకల్పమునె తాత్కాలికముగా వదలుకొనుట తప్ప కేంద్ర సంఘము వారికి గత్యంతరము కనిపించకపోయెను. కొంతకాలము గడచిన పిమ్మట గష్తినిషాన్ 53 యొక్క వివరణ యొకటి ప్రభుత్వము వారు జారిచేసిరి. దానిలో రాజకీయ సభలు, రాజకీయ విషయములు అనగా నెట్టివో ప్రభుత్వమువారు దిక్ప్రదర్శనముగా నిర్వచించిరి దీని వలన పరిస్థితులపైన వ్యాపించియున్న అంధకారము తొలగిపోవు మార్గము కుదిరినందున కేంద్ర సంఘమువారు మరల పోలీసుశాఖా మంత్రి గారిని సుమారు 3 మాసముల క్రింద దర్శించి తమ మహాసభ యొక్కయు, ఆంధ్రోద్యమము యొక్కయు ఆశయములను విశదబరచి రాజకీయములతో జోక్యము లేకుండ విధముననే మహాసభను సమావేశ పరచుటకును, ప్రభుత్వమువారి బహిరంగ సభల నియమములను, తద్విధానములను పాలించెదమనియు సమాధానము కలిగించిన మీదట శ్రీ మంత్రివర్యుడు ప్రభుత్వ సభయందు ఈ యంశమును ప్రవేశపెట్ట వాగ్దాన మొనర్చి యుండిరి శ్రీ మంత్రివర్యుల న్యాయ స్వభావ ఫలితమే ఇప్పుడు వెలువడిన అంగీకారము అని తెలియుచున్నది. దీని వలన తృతీయాంధ్ర మహాసభా సమావేశమునకే కాక ఆంధ్రోద్యమ వ్యాప్తికి మరల సదవకాశము లభించినది. కనుక నిర్వాహకులు రాజకీయ విషయములను వదలి తదితర ఆంధ్రాభ్యుదయ విషయములందు సభా సమావేశకులు శ్రద్ధ వహించి ప్రభుత్వమువా రొసగిన అంగీకార లాభము పొందెదరని మేము ఆశించుచున్నాము

మొత్తము మీద ప్రభుత్వమువారీ యంగీకారము నొసగి చాల ఉపయోగకార్య మొనర్చిరని మేము తలచుచున్నాము. గడచిన 15 వత్సరములలో జరిగిన ఆంధ్రోద్యమ ప్రచారము నిజాము రాష్ట్రములోని ఆంధ్ర జిల్లాలయందు విద్యాభిరుచిని, ప్రజాహిత జీవనమునం దుత్సాహమును కొంత వరకైనను కలిగించగలిగినదనుట నిర్వివాదాంశము. అట్లారంభమైన ప్రబోధమును, చైతన్యమును చల్లార్పక ప్రభుత్వము వారు ఉదార రాజనీతిని ప్రకటించినందుకు ప్రభుత్వము వారిని సమిష్టిగను, ముఖ్యులగు పోలీసు శాఖామంత్రి గారిని మేము అభినందించుచు తృతీయాంధ్ర మహాసభ జయప్రదముగా తగిన స్థలమునందు తగిన యధ్యక్షుని మార్గదర్శకత్వమున సమావేశమగునట్లనుగ్రహించ దైవమును ప్రార్థించుచున్నాము.

# గోలకొండకవుల సంచిక

**9-7-1934**

గోలకొండ కవుల సంచిక విషయమై భిన్నాభిప్రాయములప్పుడె బయలు దేరినవి. అది శుభసూచకమే! సంచిక పలువురి దృష్టి నాకర్షించినదని సంతోషించు చున్నాము ఒక్క విషయమున జనులలో నపోహలు కలుగునని మేమెరుగుదుము- అదే మన బ్రిటిషాంధ్రులు, నిజామాంధ్రులు అనుభేదము కల్పించుట - శ్రీయుత పి రమణయ్యగారు ఈ విషయమున తమ యభిప్రాయము ఇచ్చుచు ఇట్లు భేదభావమును చూపుట సంపాదకులకు పరిపాటికాదని సూచించుచున్నారు. బ్రిటిషు నిజామాంధ్రసమస్య సుమారు 7-8 సంవత్సరములనాటి ప్రతిధ్వనియే కాని క్రొత్తదిగాదు అనాడు రజతోత్సవ సంచికాసందర్భమున మమ్ము వృధా నిందలకు కొందఱు పాల్పేసిరి కాని యీ 8 సంవత్సరములనుండి మేము మా సర్వసమ బుద్ధిని ప్రతి విషయమునను వెల్లడి చేసితిమో లేదో పాఠకులే నిర్ణయింపగలరు మాకు భేదభావముల ప్రచారము చేయుటగాని బ్రిటిషాంధ్రులపై యసూయ కలిగించుటగాని నాడును నేడును ఆవంతయులేదని నొక్కి చెప్పు చున్నాము

అట్లైన నిదేమి, నిజాంరాష్ట్రకవులకు మాత్రమే సంచిక ప్రకటింపవలసిన యవసరమెందుకు? ఎవ్వరో యొకవ్యక్తి తెలిసియో తెలియకయో బుద్ధి పూర్వకముగానో లేక తలవనితలంపుగానో నిజాము రాష్ట్రములో కవులు పూజ్యమన్నంతనే మీకింతతొందర యెందులకు? ఇంత యభిమానమెందుకు? అనిపృచ్ఛ- ఈ యభిప్రాయమొకేవ్యక్తిదిగా నుండిన యది నిర్లక్ష్యముగా జూడవలసిందే కాని యట్టి యభిప్రాయము పలువురకుండునట్లు వినుచుంటిమి, వినుచున్నాము నిజామురాష్ట్రాంధ్రులు వలసబోయినవారనియే బ్రిటిషు ఇండియా లోని యాంధ్రులివరలో తీర్మానించుకొనలేదా? మఱియు నదేమి గ్రహచారమో

యెన్ని యో సంవత్సరములనుండి భారతి మున్నగు బ్రిటిషిండియా పత్రికలు నడుపబడినను నా పత్రికలలో నొక్క నిజాంరాష్ట్రియుని వ్యాసమైనను గాంచుట లేదు. అయితే వ్యాసములు పంపువారు లేకున్నవారేమి చేయుదురని చెప్పవచ్చును మంచిమంచి వ్యాసములను పేరొందినవారు పంపుటయు నయ్యవి ప్రకటింపబడక పోవుటయు మేమెఱిగిన విషయము కావున నీ కారణముచేతను నీరాష్ట్ర కవులకు ప్రోత్సాహము కలిగించుట చాలయవసరము

ముఖ్యముగా నాక్షేపకులొక్క విషయమును గమనింపవలసినది నేను వృద్ధియైన నా ప్రక్క ఇంటివానికి నష్టమని తలపకూడదు మా రాష్ట్రముపై మాకభిమానముండిన మాకితరులపై ద్వేషమున్నదని వాదింపగూడదు మా తల్లిని మేము ప్రేమించిన నితరుల తల్లులను నసహ్యముతో జూచితిమని తగవు పడకూడదు ప్రతి దేశమునను, తుదకు ప్రతి గ్రామమునను స్థానికాభిమానము మొదలు తర్వాత యిది వైశాల్యమందు హెచ్చుచు పోవును. కొంతకాలముక్రిందట నొక నెల్లూరుపత్రికలో కొందరు "నెల్లూరు గొప్పవారు" అను పలుమారు వ్యాసమున వ్రాసిరి "ఏమయ్యా మీరిట్లు వ్రాయుటచే నెల్లూరాంధ్రులు నెల్లూరేత రాంధ్రులు అను భేదము జూపుచున్నారని యా పత్రిక నెవ్వరును నాక్షేపింప లేదు" మొన్ననె ఆంధ్రభూమిలో "పడమటిసీమ కవులు" అను నొక వ్యాస ముండెను అదే పత్రికలో నాళం కృష్ణారావుగారు తూర్పు ఆంధ్రులకును పడమటి యాంధ్రులకునుగల భేదమును చాలా తీవ్రముగా (అయినను మెచ్చు కొను విధముగా) వర్ణించిన భాగమును ముద్రించిరి అది భేదభావము కల్పించు నది కాదాయని యెవ్వరును ప్రశ్నింపకపోయిరి వావిలికొలనువారికి ఒంటిమిట్టపై యభిమానముండుటచేతనే కదా అందరు పోతన ఓరుగల్లు కవియేయని నొక్కి చెప్పినను "కాదంటె కాదు అతడు నా ఒంటిమిట్టవాడే" యని కట్టలు కట్టలుగా వ్రాసిరి.

ఇప్పుడంతరించిన 'జయంతి' యను పత్రికలోనిట్లు సంపాదకులు వ్రాసిరి. "తెనుగు భాష కృష్ణా, గుంటూరు, గోదావరి, విశాఖపట్నం జిల్లాలలో మార్లేదేది అట్లాంటివి ఇతర భాషలతో కలసివుండే ప్రదేశాలల్లో ఈ మార్పునందు అంత సానుభూతివుండదు బరంపురము, హైద్రాబాదు, చిత్తూరు ఇటువంటి ఇతర భాషా సంపర్కం కలట్టి చోట్ల వాళ్ళకి గ్రాంథికభాష నిలబెట్టుకోటమో

కష్టం" ఈ వాక్యములవలన నా పత్రికకు తన ఉత్తర సర్కారు భాషయే నిజమైన తెనుగు భాషగను తక్కిన ప్రాంతముల తెనుగు భాషపైశాచ తుల్యము గను గనపడినట్లు దోచకమానదు కాని ఆ జయంతి పత్రిక నెవ్వరును మీరు హైద్రాబాదు భాషను వెక్కిరించుచున్నారు గాక మీరు నిజామాంధ్రులు ఉత్తర సర్కారాంధ్రులు అను భేద భావమును ప్రచారము చేయుచున్నారని యాక్షేపించిన పాపమున బోలేదు

శ్రీ శేషాద్రి రమణ కవులు "నిజాం రాష్ట్ర కవులు" అను నొక పెద్ద వ్యాసమును వ్రాసి పూర్వ కవుల పట్టీనె తయారుచేసిరి వారిపైయే నిందారోపణ చేయలేదేలకో ! దక్షిణమండల కవుల పట్టీలను వ్రాసి యా కవుల ప్రశంసించిన వారు కలదు వారిది గూడ తప్పగునా ?

ఒకవేళ మేము బ్రిటిషిండియాలో కవులు పూజ్యమనియో లేక తెలివి కలిగిన కవి గాని మెదడు కలిగిన పండితుడుగాని అక్కడ లేడు అనియో లేక యే విధమైన నిందారూపకమగు వాక్యములనో పలికిన మమ్మాక్షేపించుట కడుంగడు సమంజసమైయుండెడిది మేము బ్రిటిషు ఆంధ్రుల నెన్నడును నిరసింపము. వారిపై మాకు ప్రేమ మెండు మొత్తమాంధ్ర జాతిపై యితర జాతి వాడెవ్వడేని నిందా రూపకముగా పలికిన మా కలము ఖడ్గమై పనిచేయుటలో వెనుదీయదు

ఇంత దూరము మా మిత్రులగు వెంకట రమణయ్యగారికి తెలుపుట యే మన మేము ద్వేష బుద్ధితో నీ కార్యమునకు దిగలేదు. నిజాము రాష్ట్రము కవులకు పత్రికాధారము బ్రిటిషు ఇండియాలోనున్నట్లు లేనందున ననేకులు మారుమూలలందు తమ కీర్తిని నడచికొనియున్నారు అట్టివారి కవితా స్రవంతిని బయటి కుప్పొంగజేసి నిజాము రాష్ట్రాంధ్రుల యొక్క వాడిపోవుచున్న ప్రతిభాలతకు నూతన జీవకళ నాపాదించుటయే మా ముఖ్య కృషి - స్వకీయాభి మానమును పరకీయ ద్వేషముగా నిర్వచించుట అన్యాయము ఈ సమాధానమును మా పాఠకులు గమనించి మాకు బ్రిటిషాంధ్రులపై భేదముగాని, ద్వేషముగాని, దురభిప్రాయముగాని లేదని తెలుసుకొందురు గాక.

— —

# ఆంధ్రుల ఆయుర్వేద విద్య

**1-10-1934**

మన రాష్ట్రమందలి 14436148 మంది జనులలో ఆంధ్రులు 6972534 మంది అనగా దాదాపు సగము మంది ఆంధ్రులున్నారు ఈ సంఖ్యకు తగిన పలుకుబడి మాత్రము లేకున్నది నిజాం రాష్ట్రమందు ఆంధ్రులను వారు గలరు అనిపించవలయుననిన, ఆంధ్రులు అనేక విషయములయందు ముందుకు రావలసి యున్నది నిజాం రాష్ట్రాంధ్ర జన కేంద్ర సంఘము యొక్క కృషి వలన రాష్ట్రీయులగు ఆంధ్రులు నిద్రావస్థ నుండి మేల్కొనగల్గిరి కాని తమ యభివృద్ధికై వారు పట్టుదలతో ఉద్యమించవలసిన సమయము వచ్చినది- ఇతరులకు ఆంధ్రుల యభివృద్ధి పట్టనపుడు వారికి స్వయంకృషి తప్ప వేఱుగతిలేదు. సర్వ విధముల యభివృద్ధికిని విద్య పునాది గదా! అట్టి విద్య ఆంధ్రులకు అధమ పక్షము మాధ్యమిక ఘట్టము వరకైనను, ఆంధ్ర భాషలో ఒసగబడుటలేదు ఆదిలోనే ఆంధ్ర వ్యక్తిత్వమునకు గొప్ప కొరత ఇక తక్కిన విషయములను గూర్చి చింతపడిన లాభములేదు గాని సమయము వచ్చుటచే మన రాష్ట్రమందు ఆంధ్రులకు ఎక్కువ అనుకూలములగు వైద్య సౌకర్యముల విషయమై ఒకటి రెండు మాటలు చెప్పవలసి యున్నది

రానున్న డిసంబరు నెలలో మన రాష్ట్రమందలి మహారాష్ట్ర ప్రాంతముల ఆయుర్వేద మహాసభ పైరానులో జరుపదలచబడినదని యొక వార్త తెలుపు చున్నది మహారాష్ట్రులు ఆయుర్వేద విధానము యొక్క అభివృద్ధికై చేయు కృషి జూచి మన ఆంధ్రులును ఆ విషయమున కృషి చేయవలసిన అవసరము గలదు

ఆయుర్వేదమునకై మన ప్రభుత్వము వారేమి చేసినదియు స్పష్టముగా తెలియుటలేదు. 1341 వ ఫసలీ పరిపాలనా నివేదికలో లెక్కలను పరిశీలించి చూడగా ఆయుర్వేద నిమిత్తమై మన ప్రభుత్వము వారు ఏమి ఖర్చు పెట్టినట్లును

కానరాదు. ఆరోగ్య రక్షణ, చికిత్సా శాఖలకు కలిపి మొత్తము రూ 2137747 లు ఖర్చు అయి యుండెను. అందులో ఆరోగ్య రక్షణ శాఖకు మాత్రము రూ 262111 లు ఖర్చు అయ్యెను మిగిలిన రూ 1875636 లలో రూ. 1721410 లు ఇంగ్లీషు వైద్య భాగమునకును (మెడికల్ అనుదానికి అంతే అర్థమని తలంచెదము) రూ. 154226 లు యునాని భాగమునకును ఖర్చు అయినట్టు చెప్పబడియున్నది. ఇంగ్లీషు వైద్య శాఖకును యునాని వైద్య శాఖకును మాత్రమే కలిపి రూ. 1875636 లు కాగా, యిక ఆయుర్వేదమునకు ఏమి ఖర్చయినదని చెప్పవలెను. ప్రధాన నగరములో ఈ నివేదిక వత్సరములో యునాని, ఆయుర్వేద ఆసుపత్రులు కలిసి మొత్తము 29 యుండెనని ఆయుర్వేదము యొక్క పేరును వ్రాయుట మాత్రమేగాని, సర్కారువారికి ఒకటైనను ఆయుర్వేద వైద్యాలయము ఉన్నట్లు ఊహించ వీలులేకున్నది ఇక జిల్లాలలో యునాని ఆసుపత్రులున్నట్లు చెప్పబడినదే కాని ఆయుర్వేదము పేరైనను చెప్పబడలేదు. జిల్లాలలో ఆయుర్వేద మందు, చౌకదనముచే నైననేమి, సులువుగా అందుబాటులో నుండుటచే నేమి, సంప్రదాయమందు నెలకొన్నదగుటచే నేమి, విశ్వాసము గల వారగుటచే, అనేకులు బీదలు సహితము ఖర్చుకైనను ఓర్చి ఆయుర్వేద వైద్యము నాశ్రయించుచున్నట్లు వినుచున్నాము. అయినను ఆ దేశీయ విధానమును వృద్ధికి దెచ్చు విషయము మన సర్కారు వారికి పట్టినట్లులేదు.

కాబట్టి మేము చెప్పబోవునదే మనగా యిపుడు మన ఆంధ్ర జిల్లాలయందు ఆయుర్వేద వైద్యులు ముందుకు రావలసి యున్నది బ్రిటిషిండియాలో పండిత డి గోపాలాచార్యులు మొదలగు వారి కృషి వలననేకదా అక్కడ ప్రభుత్వము వారుగూడ ఆయుర్వేదమును ఒప్పుకొనినది అంతకు పూర్వము ఆయుర్వేద మనిన అచటి ప్రభుత్వముచే వెలివేయబడినట్లుండ లేదా? ఆయుర్వేద పండితులును వైద్యులును ఐకమత్యముతో ఆయుర్వేదమును వృద్ధి దశకు దెచ్చి దానికి మన ప్రభుత్వమువారి నుండి తగిన గౌరవమును సంపాదించునంతవరకు కృషి చేయవలసి యున్నది ఆంధ్ర ఆయుర్వేద వైద్య మహాసభ యొకటి అఖిల నిజాం రాష్ట్రీయుర్వేద వైద్య మహాసభకాక దానిని అనుబంధముగా నుండి కర్తవ్యమును విశదముగా నిర్ణయించుకొని తదనుసారముగ ప్రవర్తించిన లాభముండును.

# తృతీయాంధ్ర మహాసభ

**20-12-1934**

ఈ సారి ఖమ్మములో జరిగిన మన రాష్ట్రీయ తృతీయాంధ్ర మహాసభ విషయములో కల్పింపబడిన కొన్ని పరిస్థితులు నిర్వాహకులగు నాయకులకును, మన ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధియే ముఖ్యోద్దేశముగా గల యీ ఆంధ్ర మహాసభల యందు అభిమానాదరములు గల వారికిని కొంత మనస్తాపమునకు కారణములైన వనుటకు చింతిల్ల వలసి యున్నది మొదట మహోత్సాహముతో మహాసభలో చర్చించదలచి చిత్తు తీర్మానముల పట్టికలో చేర్చబడినట్టియు, నేడు భరత ఖండములో నంతటను గొప్ప విద్యాధికులచే భారతీయులందరి సాంఘికాభివృద్ధికి అత్యవసరములని తలచబడు విషయములు గల్గినట్టియు రెండు మూడు తీర్మానములు మహాసభ వారి యెదుట చర్చకు రాలేదు, ప్రవేశపెట్టబడను కూడా లేదు

మొదట యెవరు కాని యీ తీర్మానములందలి విషయములు మహాసభ వారికి - ఆమోదార్హములు గాక పోయిన పోనిమ్ము - అధమపక్షము ఆలోచించ దగినవి అని తలచి మహాసభా నిర్వాహకులకు తెలిపి యుండిననె గాని, అవి చిత్తు తీర్మానముల పట్టికలోకి యెక్కి యుండ జాలవు అట్టివారు తర్వాత తమ అభిప్రాయమును మార్చుకొని, సదరు తీర్మానములు మహాసభలో ప్రవేశ పెట్టుటకు కూడ తగనివను అభిప్రాయమునకు వచ్చిరా? లేక తీర్మానములను ఉపపాదింప దలచిన వారికి బలపరచువారు చిక్కక పోయిరా? ఈ రెండు వికల్పములలును సదరు తీర్మానములు మహాసభలో ప్రవేశపెట్టబడ కుండుటకు కారణములుగ అనిపించునంత చపల చిత్తులు మన మధ్య లేరనియే మా విశ్వాసము మఱి యితర కారణమేమి?

ఇట్లు విషయమును త్రవ్వుటవల్ల సంతాపకరములగు రహస్యములు బయట పడునేమో? సనాతులను వారి యాందోళనచే పై జెప్పబడిన తీర్మానములు

మహాసభలో ప్రవేశ పెట్టబడలేదని జనులందరు వాడుకొనుచున్నారు - తీర్మానములలోని విషయములు యిష్టము కాని వారు యెవరో మహాసభలోనికి వచ్చి ప్రతి కూల వాదము చేసి తమ అభిప్రాయమును మహాసభా జనులందరికి వెల్లడి చేసి, తీర్మానముల నోడించుటకు యెందుకు పూనుకోలేదు. మహాసభా నిర్వాహకులు నిస్సంశయముగ ప్రతికూల వాదములను, తమ కిష్టముగాకున్నను గౌరవించు వారేనే? నిజముగా ఆ తీర్మానములు కూడనివని నిరూపించదలచిన వారు అడిగినచో, వారివాదములు సభలో జనులందరికిని స్పష్టము చేయుటకు అవకాశము లభించి యుండునే! ఈ ప్రతికూలురు సదరు తీర్మానములను మహాసభలో ప్రవేశపెట్టనీయ వద్దని మహాసభా నిర్వాహకులను బలవంతము చేసిరా? బలవంతము చేసినను తీర్మానములను ప్రవేశ పెట్ట దలచినవారు గాని సభా నిర్వాహకులుగాని అట్టి దానికి లొంగి యుందురా? ఇట్లే ఎవరో కొందరు కొందరు వచ్చి తమ కీ తీర్మానము యిష్టము కాదు, యిది ప్రవేశపెట్ట వద్దు, అది ప్రవేశ పెట్టవద్దు అని అడిగినచో అట్టి ప్రతివారి మాటను మహాసభా నిర్వాహకులు గాని తీర్మానములను ప్రవేశపెట్ట దలచువారుగాని పాటింతురని మేము నమ్మజాలము. తీర్మానములు ప్రవేశపెట్టబడియే యుండును ప్రతికూలురు గౌరవము కలవారైనచో తమ వాదమును స్పష్టపరచియో నీచులైనచో తుంటరితనము చేసియో తమ ప్రాతి కూల్యము దెల్పియే యుందురు తుంటరితనమునకు భయపడి మహాసభా నిర్వాహకులు తీర్మాన ప్రవేశమును మానుకొని యుండరు తుంటరితనము జర్గునేమో యను భయమున్నప్పుడు ముందుగానె అట్టిది జరుగకుండ ప్రభుత్వాధికారుల రక్షణము కోరబడి యుండును రాజభక్తియు ప్రభుత్వాజ్ఞల యందు విధేయతయు ప్రకృతిగా గల మన రాష్ట్రీయులలో ప్రభుత్వాధికారుల ఆజ్ఞకు విరుద్ధముగా తుంటరి తనమును శరణువేడు వారు లేనేలేరని మా విశ్వాసము.

ఇంతదూరము విచారించగా యిపుడు వ్యాపించియున్న జనశ్రుతిలో బలము లేకుండదు అని ఊహించవలసి వచ్చునేమో. కొందరు మొదట తాము ఖమ్మము పురములో మహాసభయె జరుగగూడదని తాలుక్దారు సాహెబు మొదలగు అధికారులకు దరఖాస్తులను పంపుకొనియు, ఆ దరఖాస్తులు త్రోసివేయబడిన పిమ్మట చిత్తు తీర్మానములలోని నిమ్న జాత్యుద్ధరణము, వివాహసంస్కరణము, సాత్విక పూజా విధానములను గూర్చిన తీర్మానములను మహాసభలో ప్రవేశపెట్టబడ

కుండునట్లు చేయవలెనని అధికారుల వద్ద మొరపెట్టుకొనిరనియు, అటుపైన అధికారులే ఆ తీర్మానములను మహాసభలో ప్రవేశపెట్టనీయవద్దని మహాసభా నిర్వాహకులకు సలహా నిచ్చిరనియు ఇట్లు ప్రభుత్వాధికారి సలహా యగుటచే ఆ తీర్మానములు ప్రవేశపెట్టనీయబడలేదనియు వదంతిగా నున్నది ఈ చెప్పబడిన తీర్మానములలో యే ప్రభుత్వాధికారులకైన నేమి, లేక అసలు ప్రభుత్వమువారికైననేమి అనిష్టములైన విషయములున్నట్లు మేమనుకొనము, మరియెందుకు తీర్మానముల ప్రవేశము అధికారులకు యిష్టము కాలేదు. తీర్మానములు ప్రవేశపెట్టబడినచో అవి ఇష్టముకానివారలు గలభా చేయుదురేమో, అందువల్ల శాంతికి భంగము గల్గునేమో యని అధికారుల అనుమానమై యుండినచో, అదియు నిరాధారమే యని మా యభిప్రాయము మేమింతకుముందే చెప్పినట్లు అధికారుల యాజ్ఞకు వ్యతిరేకించి గలభాచేయు ప్రకృతి మన రాష్ట్రమువారికిలేదు, అందులోను గౌరవము గల మన రాష్ట్ర సనాతనులకు అంతకు ముందేలేదు. పోనీ, ఒకవేళ గలభా జరుగనే జరుగ వచ్చునని వాదమునకై ఒప్పుకొందము. అట్టిస్థితిలో సనాతనులకే గాని మరి యెవరికేగానీ గలభా చేయనీయకుండ తగిన భయము పెట్టుటకు మన ప్రభుత్వాధికారుల వద్ద శక్తి లేదా? ప్రవేశ పెట్టరాదనబడిన తీర్మానములలో ప్రభుత్వమునకు గాని, న్యాయదృష్టికి గాని, ప్రజాహిత దృష్టికి గాని విరుద్ధమైన విషయములు లేవుగదా? హిందూ మతమునకు విరుద్ధములైన విషయములున్నవనియు, అందువల్ల తీర్మానములు ధర్మ విరుద్ధములనియు వాదమా? అటైనచో తీర్మానములు హిందూమత విరుద్ధములు కావనియు, అందువల్ల ధర్మ సమ్మతములే యనియు వాదించు హిందువులే ఎక్కువ మంది యున్నారు ఇట్లు హిందువులలోనే రెండు భిన్నాభిప్రాయము లున్నపుడు దాని పరిష్కారమునకై శాంతముగా మహాసభవారు ఆలోచించుటకు అధికారులు తోడ్పడకపోయిరా? ఇప్పుడు అధికారులు తీర్మానములు ప్రవేశపెట్టబడరాదను వారి పక్షమును సమర్థించినట్లగుపడుటచే అధికారుల అధికార దౌర్బల్యమో లేక పక్షపాతమో ఊహింపబడుటకు అవకాశమేర్పడినదేమో యని సంశయము కలుగవచ్చును కాని, ఇటీవలనే మనరాష్ట్రమున కంతటికిని సంబంధించిన శాసన సభవారిచే ఆమోదింపబడిన వితంతూద్వాహ శాసనము కంటె సూచిత తీర్మానములు సనాతనుల భావములకు యెక్కువ అనిష్టమగు పరివర్తనను కోరుచున్నవా? సనాతనులకు వితంతూద్వాహము కంటె యెక్కువ కోపము గల్గి ప

నట్టిది యింకొకటి యుండునా? సనాతనుల భావములకు కోపముగల్గునేమో యను భయముచే సంఘ సంస్కరణలను గూర్చిన చర్చలను జరుగనీయరాదనుటయే మన ప్రభుత్వమువారి అభిప్రాయమైనచో, రాష్ట్రీయ శాసన సభలో వితంతూద్వాహమును గూర్చిన చిత్తు శాసనముపై చర్చను జరగనిచ్చి యుందురా? జరుగనిచ్చి యుండరు ఇట్లు ప్రభుత్వమువారు సాంఘిక విషయములలో తటస్థులు అని తేలినది. కాబట్టి ప్రభుత్వాధికారులను ఈ విషయములో సంశయించుటకెట్టి యాస్పదమును గనుపట్టదు.

ఈ యంశములును, మరికొన్నియు సూచింపబడిన తీర్మానములను ఆటంకపరచుటకై అధికారులను కోరిన సోదరులు నిజముగా సనాతనులు కాదేమో, మనసులో నేదో (మేము ఊహింపజాలని) క్రోధము నుంచుకొని యెట్లయినను సభకేదో యొక ఆటంకము పెట్టి కసి తీర్చుకొనుటకు బద్ధ కంకణులైన నట్టి స్వార్థపరులేమో యను అనుమానమునకు తావిచ్చుచున్నవి. అదెట్లో రాబోవు సంచికలో చర్చించెదము

# పత్రికలకు ప్రభుత్వాదరణము

**18-2-1935**

మన రాష్ట్రములో ఉర్దు పత్రికలు పెక్కుగలవు తెలుగులో నొకటే ఇంగ్లీషులో నొకటే - మరాటీలో నొకటె - కన్నడీ కిదియు లేదు ఉర్దూ పత్రికలు రెండు డజనులకు పైగా (దిన, వార, పక్ష, మాస, త్రైమాస వగైరాలు చేరి) ఉన్నను వానికార్థిక లోపము కానరాదు బులెటిన్ పత్రిక మూడు మారులు నాయకత్వము మార్చుకొనెను తెలుగులో రెండు మూడు వారపత్రికలు, రెండు మూడు మాసపత్రికలు ముచ్చటగా మూన్నాళ్ళుండి యంతర్హితమయ్యెను ఇక మినుకు మినుకు మనునది గోలకొండ పత్రిక యొకటె మహారాష్ట్రములో నిజాం విజయ కాలధర్మము నొందు సమయములో ప్రభుత్వమువారు సహాయముచేసి (నెలకు 100 రూపాయిల ప్రకారమని వినికిడి) దాని ప్రాణములు నిలుపు పుణ్యము కట్టుకొనిరి కనడికి దిక్కులేదు

ఇట్టి పరిస్థితులలో నెవ్వరినేని ఉర్దు పత్రికలకు ప్రభుత్వము సహాయము చేయు నవసరము కలదా లేక యీ యితర భాషా పత్రికలకు సహాయ మవసరమా అని విచారించిన రెండవ శాఖ వాటికేయని యెవరైన చెప్పుదురు కాని మన ప్రభుత్వమువారు ఉర్దు పత్రికలకే సహాయము చేయుచున్నారు. (నిజాం విజయ తప్ప)

ఉర్దూ పత్రికలలోను అన్నిటికి సాయముచేయుటలేదు అందుకొరకే యీ మధ్య "రహబరెదక్కన్, సుభేదక్కన్ పత్రికలలో వాదోప వాదములు జరుగుచున్నవి గోల్మేజు సభాకాలములో రహబరెదక్కను కిచ్చిన భృతి యొక్క వివరములివ్వియని సుభేదక్కన్ ఇట్లు వ్రాయుచున్నది.

| | | |
|---|---|---|
| ఒకేతడవ ఖర్చుకుగాను | రూ. 3450 | హాలీలు |
| 100 పత్రికల ఖరీదు పత్రిక ఒక్కంటికి రూ. 44 ప్రకారము | 4400 | ,, |
| పూర్వపు 150 పత్రికల ఖరీదు ఒకొ్కక్కటి 12 రూ వెల ప్రకారము హెచ్చింపు చేసినది | 1800 | ,, |
| మొత్తము | 9650 | |

ఇంచుమించు 10 వేల రూపాయీలు ఒక్క సంవత్సరములో ఒక్క రహబరె దక్కన్ ప్రతికకు ముట్టినవి ఆ పత్రిక యెంతటి మంచినోము నోచినదో

మన ప్రభుత్వము వారు చాల ఉదారులగుటచే మన రాష్ట్రి పత్రికలు విపరీతాచారము (ప్రపంచ మందెచ్చటను కనివినని యాచారము) నిర్ణయించు కొన్నవి. మామూలి చందాదారుల కొకధర ధనికుల కొకధర, సంస్థానాధిపతుల కొక చందా, ప్రభుత్వమువారి కందరికన్న హెచ్చు చందా అట్లే ప్రభుత్వమువారు కొనుచున్నారు ఇది సరియైనదికాదని మనవి చేయుచున్నాము

ప్రభుత్వమువారు పత్రికల కొనవలసిన పనిలేదు. కొనవలెనెందురా అన్ని పత్రికలను సమానముగా కొనవలెను అట్లుగాక సుభేదక్కన్‌ను వదలి రహబరెదక్కనుకు ఎక్కువ ప్రాముఖ్యత యిచ్చుటచే వీరిరువురి కిప్పుడు తగాదా యేర్పడినది ఇంతెగాక ప్రభుత్వమువారు రాయిటర్ అసోసియేటెడ్ ప్రెస్సు తంతీలు దామెకొని ప్రతి పత్రికకును ఉచితముగా సప్లై చేయుచున్నారు ఇదియు అనవసరమగు ఖర్చె కాని యేమియు లాభము లేదు.

ప్రపంచంలో పత్రికల కెందును ఇంతటి చంటిబిడ్డ పోషణ జరుగుట లేదు ఏ పత్రిక స్వతంత్రముగ నిలచి పాఠకులను తృప్తిపరుపలేదో అట్టిది జీవించియుండుటకు గాని సహాయము పొందుటకుగాని అర్హత నొందజాలదు.

దానికి వెంటనె శ్రార్ధకర్మ చేయవలసినదే ప్రజలను తృప్తి పరుపగల్గి వారి అదరణ పొందు స్థితిలోనుండు పత్రికలకు ప్రభుత్వ సహాయ మనవసరమని వేరె చెప్పబనిలేదు ఇట్లు రెండు విధముల పత్రికలకును సహాయము అనవసరము

ఇపుడు ఇంకో భయమేమనన, మన ప్రభుత్వమువారి ఔదార్యము వలన బైటి పత్రికలకు యెన్నింటికి మన రాష్ట్రి ద్రవ్యము పోవుచున్నదోయనునది మన ప్రకటన శాఖ వారి ద్వారా ప్రభుత్వము వారు ఏ పత్రికల కెంత సహాయము చేయునది, బయటి పత్రికలకు గూడ సాయము జరుగుచున్నదా యను విషయములను తెలుపగలరేని తెలుప ప్రార్థితులు ఇట్టి సహాయమువలన కేవలం పత్రికాధిపతుల ఇనుపపెట్టెలు నిండుటయు ప్రజల ద్రవ్యము నష్టమగుటయు వివిధ పత్రికల మధ్య నీర్ష్య ప్రబలుటయు సంభవించునని మనవి చేయుచున్నాము.

---

# నిజాంసాగరు ప్రాజక్టు

**8-4-1935**

నిజాంసాగరు ప్రాజక్టు నిర్మాణము జయప్రదముగా సంపూర్తి అయినందుకు హైదరాబాదు రాష్ట్రము గర్వించ వచ్చును 4½ కోట్ల రూపాయీల ఖర్చుతో ఏడెండ్లకాలము తీసుకొన్న ఈ ప్రాజక్టు ప్రపంచములోని గొప్ప చెఱువులలో నొకటియనియు, ఇండియాలో నిర్మింపబడిన గొప్ప చెఱువులలో రెండవదియనియు, ఇంతగొప్ప చెఱువు ప్రారంభమునుండి అంతమువరకు "మ-ఘ-వ-నిజాం 'ప్రభువుగారి విశ్వాస' పాత్రులు అగు ప్రజల చేతనే" నిర్మించబడెననియు చెప్పుకొనగల్గినందుకు నవాబ్ అలీనవాజ్ జంగ్‌గారు, వారి యనుచరాధికారులతోకూడ ఏల గర్వించరాదు? నవాబ్ అలీనవాజ్ జంగ్‌గారి రాష్ట్రాభిమానము ప్రశంసనీయమైనది - ఈ ప్రాజక్టు నిర్మాణ పరిపూర్తిచే నవాబ్‌గారు, తగిన అవకాశమిచ్చినచో నిజాం రాష్ట్రీయులు బ్రిటీషిండియానుదాటి ప్రపంచమందు నాగరికతలో బ్రిటీషు ఇండియాను మించియున్న యితర దేశములతో కూడ సరిసమానమగు స్థానము నాక్రమించగలరని నిరూపించినారు ఇందుకు నిజాం రాష్ట్రీయులు నవాబ్‌గారికి కృతజ్ఞులై వారికి రాష్ట్ర పరిపాలనా కార్యనిర్వహణమందు తమ యావచ్ఛక్తిని వినియోగించుటకు యిప్పటికంటె ఎక్కువ అధికారస్వాతంత్ర్యమును కోరుట యుక్తముగనె యున్నది

ప్రభుత్వమువారు ప్రజల ద్రవ్యమును వ్యయపరుచుటయందు సాధ్యమైనంత యెక్కువ మందికి సాధ్యమైనంత యెక్కువ లాభము గల్గునట్లు చూచుట విధి ఈ విధినిజాంసాగర్ ప్రాజక్టు నిర్మాణములో గూడ తప్పకుండుటకై చీఫ్ ఇంజనీర్ అగు నవాబ్‌గారు, యంత్ర సాధనములను సాధ్యమగునంత తగ్గించి పనినంతయు విశేషముగా కూలీ మనుషులద్వారానే చేయించుకొనినారు ఇందువల్ల చాలామంది రాష్ట్రీయులగు కూలి పనివారలకు సంపాద్యము లభించినది ఇది కూడ నవాబ్ అలీనవాజ్ జంగ్‌గారు పరిపాలనయందలి బాధ్యతను చక్కగా గుర్తించినట్లు సూచించు చున్నది.

ఇంత గొప్పవ్యయముతో 275000 యెకరములకు నీటిపాఱుదల గావింపగల గొప్ప ప్రాజక్టు నిర్మాణము గావించినందుకు, తగినంత లాభము వ్యవసాయాభివృద్ధి ప్రజలు పొందునపుడు ప్రాజక్టుకారకులు తాము పూర్తిగా చరితార్థులైతిమని తృప్తిజెంద వచ్చును ఈ ప్రాజక్టు ప్రాంతములో చెఱకును విస్తారముగా పైరుచేసి, ఆ చెఱకు నంతటిని ఈ రాష్ట్రములోనే బెల్లము చక్కెర చేసి అమ్ముటకు సౌకర్యములున్నచో యీ ప్రాజక్టువల్ల గొప్ప లాభముండును అని ఆలీనవాజ్ జంగ్‌గారు తలచుచున్నారు ఎట్లయినను యీ ప్రాజక్టుకు కారకులగు వారికి దానివలన రాష్ట్రము యొక్క ద్రవ్యోత్పత్తి స్పష్టముగా యెక్కువగునంతవరకు, ప్రాజక్టుపని పూర్తి అయినదని తలచకుండ ఆయా విషయములన్నింటియందు నిపుణులగు వారి సలహాలతో పనిచేయునట్టి బాధ్యతాధికారములను యిచ్చి చూచుట మంచిదని మాతలంపు.

---

# ఆయుర్వేదము - మనము

**2-5-1935**

మనము అనగా నిజాం రాష్ట్ర వాసులము ఆయుర్వేదమన నేమో యెరుగము. అనేకులు యూనాని పేరు విన్నారు కాని ఆయుర్వేదము పేరు కూడా విన్నవారుకారు. కాని వైద్యము మాత్రము పల్లెలలో విశేషభాగము ఆయుర్వేద వైద్యమే. ఈ పల్లెలలోని వైద్యుల మూలమున మన ఆయుర్వేదము కొంత వరకపకీర్తి పొందియున్నది. కారణ మేమన మంచి వైద్యులు పల్లెలలో లేరు. ఏ బసవరాజీయమో, ఏ వస్తుగుణ దీపికనో, యే చికిత్సాసారమునో, ఏ అనుభవ వైద్యమునో నాలుగు పుస్తకములు చదివి, నాలుగు గోలీలు వద్ద నుంచుకొని వైద్యముచేయువారు చాలామంది గలరు ఇందుచేత తెలియనివారు ఆయుర్వేద వైద్యము మంచిది కాదనుచుందురు

వైద్యుల లోపము వైద్యలోపము కానేరదు మన రాష్ట్రములో యూనాని వైద్యులుగూడ చాలామందిగలరు వారును తిబ్బె అక్బరి, ఇలాజుల్గుర్బాలవంటి యొండు రెండు గ్రంధములు చూచికొని వృత్తిని సాగించుచున్నారు అట్టి హాకీములను జూచి యూనాని వైద్యము చెడ్డదనవచ్చునా ?

అస్సలు విషయము ఆలోచించి చూచిన ఆయుర్వేదమునకును, యూనానీకిని, అవినాభావ సంబంధము కలదు ఆయుర్వేదము ముద్దు బిడ్డయే యూనాని అనచెల్లును ప్రాచీనములో అరబ్బులు పార్సీలు, తుర్కీలు హిందూవులవద్ద వైద్యమును నేర్చినట్లు నిదర్శనములు చాల కలవు కితాబుల్ ఫెమీరిస్తు గ్రంధకర్త హాజిఖలీఫా (క్రీ శ 10 వ శతాబ్దమువారు) వ్రాసినదేమనగా - ఖలీఫా హరూన్, ఖలీఫా మన్సూర్‌గార్ల ఆజ్ఞచే అనేక హిందూ వైద్య గ్రంధములు (Materia medica therapeutics) అరబీ భాషలోనికి తర్జుమా చేయబడెను.

మంఖుడు అను బ్రాహ్మణునిచే సుశ్రుతము అరబ్బీలోనికి తర్జుమా చేయ బడెను హరూనుల్రషీదు ఖలీఫా కొకపర్యాయము చాలయపాయకరమగు జాడ్యము సంభవింపగా ఈ మంఖుడే ఎవరి చేతను కానట్టి యీ రోగ చికిత్సను చేసి అతనికి బాగుచేసెను ఆపై ఈ మంఖుని మీద ఖలీఫాకు అత్యంతాభిమానము కలిగెను. వెంటనే మంఖుడు దవాఖాన సర్కారే అలీ పైన డైరక్టరుగా నేర్పాటు చేయబడెను. హిందూ నక్షత్ర శాస్త్రము, అల్జిబ్రా, వైద్యము చాలా శ్రద్ధతో అరబ్బులు ఈ ఖలీఫా కాలములో నేర్చుకొనిరి మరియు అనేక హిందూ పండితు లను ప్రార్థించి వారిని తమ దేశములో నిలిపికొని ఖలీఫాలు తమ బోధకులనుగా ఏర్పాటు చేసుకొనిరి ముసాల్మాను విద్యార్థులును హిందూ స్థానములోని వైద్యా లయములలో హిందూవులవద్ద చాలా శ్రద్ధతో భక్తితో వైద్యశాస్త్రమునభ్యసించు టకు పుట్టలు పుట్టలుగా నేటేట వచ్చుచుండిరని సర్-ప్రఫుల్ల చంద్రరాయ్ గారు తమ గ్రంథములో వ్రాసినారు ఈనాడు మన తెలివి తక్కువ తనముచే యూరోపులో నాలుగేండ్లుండి నాలుగు ముక్కలు చదువుకొని వచ్చిన విద్య పరిశుద్ధమైనదని మనమనుకొన్నట్లుగాక ఆనాడు అరబీ పారశీక దేశములందలి ముసాల్మానులు చాల భక్తితో శ్రద్ధతో ఆతురతతో హిందువుల వద్దకు వచ్చి నేర్చికొని పోవుచుండిరి

సులేమాన్ అను యాత్రికుడు విజయనగర సామ్రాజ్యమును జూచి విజయనగర పట్టణ రాజములో అనేకులగు అరబ్బులు వైద్యాలయములో పని నేర్చుటనుచూచి వర్ణించియుండెను ఇట్లు ఆయుర్వేదమునకును యూనానికిని చాల సన్నిహిత సంబంధముండెడిది కాని కొందరు దుష్టరాజుల మూలమున క్రమేణ ఈ సంబంధము దూరమయ్యెను అన్యోన్య ప్రేమలు మాసిపోయెను. హిందూముసాల్మానులలో ద్వేషములు ప్రబలెను సుమారు 300 సంవత్సరముల నుండి ఈ రెండును వేరువేరు మార్గముల బడెను

ఆయుర్వేద వైద్యము చాల చౌకయైనట్టిది పాశ్చాత్య వైద్యము మనకు తగనిది. అది మనకు సరిపడనిది చలి దేశముల వారికి పనికివచ్చినది ఉష్ణ దేశముల వారికంతగా పనికిరాదు. పై విదేశముల నుండి దిగుమతి అయిన మందులు చాలఖరీదు అవే మనదేశములో సిద్ధమైన చౌకగా నుండును. అయినను

ఫలితము తక్కువ పాశ్చాత్య వైద్యులు బాగుచేయని [illegible] ఆయుర్వేద వైద్యులు బాగుచేసినట్లు ఏ నగరములో విచారించినను [illegible] ఒప్పుకొనగలరు జర్మను డాక్టరు ఆయుర్వేదమును చూచి ఆశ్చర్యపడినారు ఏమి ఇంతచౌక, ఇంత గుణము ఇంత శ్రేష్ఠత దీనికెట్లబ్బెనని [illegible] అభిప్రాయపడినారు

అట్టి వైద్యమునకు, వైద్యశాలలు లేవు, వైద్యాలయములు లేవు ఉన్న వానికి ప్రభుత్వాదరణము సున్న. మన రాష్ట్రములో యూనానికి గత సంవత్సరము 20 లక్షలు ప్రభుత్వము వారిచ్చినారని హిందూయి ముసాల్మాను లభినందించి సభలో తీర్మానములు చేసిన వార్త ప్రకటించి యుంటిమి. కాని ఆయుర్వేద వైద్యమట్టి నోమునోచుకొనలేదు. అనేక తాలూకాలలో యూనాని వైద్యాలయములు కలవు - హాకిములకు మందిసాయము కలదు నగరములో యూనాని వైద్యశాల కలదు కాని అనేక సంవత్సరముల నుండి ఆయుర్వేద వైద్యమునకు కనిష్ఠ మొక్క శాఖా అయిన యుండవలెనని ప్రజలు ప్రార్థించుచున్నారు. కాని యింతవరకు రూపము దాల్చలేదు. ఆ ఆయుర్వేదమును ఉర్దులో సంగ్రహించి వ్రాయించి యునానీ వైద్యాలయములోనే ఒక భాగముగా నేర్పాటు చేయనెంచుచున్నారని ఒక వార్త వినియుంటిమి. అదే నిజమైన అట్లు చేయుటకన్న ఊరకుండుట మేలు. చరక సుశ్రుతములను ధన్వంతరి వాగ్భటాది ప్రచండ గ్రంథములను సుమారు ఒక వేయివరకు వైద్య గ్రంథరాజములు సంస్కృతములో తెలుగులో నుండగా వాటిసారము ఉర్దూలో వ్రాయుట బ్రహ్మదేవుని తరమా! అతని పుట్టించిన వాని తరమా! ఆయుర్వేద గ్రంథములను సంస్కృతములో దేశ భాషల ద్వారానే నేర్పవలసి యుండును

ఇప్పుడు చెప్పబోవున దేమన సుల్తాను బజారులో శ్రీ యువరాజు గారి సిద్ధహస్తముచే ప్రారంభింపబడి నెలకు సుమారు 4000 మందికి విశేషముగా - నుచితముగా మందిచ్చి జాతిమత వివక్షత లేక సేవ జేయుచుండిన వైద్యమండలి వారిని ఎంత ప్రశంసించినను అతిశయోక్తి కానేరదు. వారు చేయుచున్న కృషి ప్రభుత్వ దృష్టి నాకర్షింపవలసి యున్నది యూనాని కన్న ఆయుర్వేదమునకే

గ్రామములం దంతటను విశ్వాసము హెచ్చు ఈ వైద్యమునకు యూనానికిచ్చి నట్టి సహాయమైన ఇచ్చుట చాలా అవసరము. బ్రిటిషిండియాలో సహిత మిప్పుడీ వైద్యమునకు చాల ఆదరణము కలుగుచున్నది. అనేక మునిసిపాలిటీలు చాల సాయపడుచున్నవి.

మన రాష్ట్రములో ముఖ్యముగా విద్యాధికులైన వారు ఈ సుల్తాను బజారు వైద్యాలయమును చూచి తీరవలెను. అచటి వైద్యులకు మంచి ప్రోత్సాహమీయ వలెను వారి చేతనే అవసరమైన తావులందు చికిత్సలు చేయించవలెను ప్రభుత్వ సహాయమిప్పించుటకును గట్టి ప్రయత్నము చేయవలెను.

---

# స్వ విషయము

**9-5-1935**

సర్వ కారణుడగు భగవంతుని యొక్క అపార కృపా విశేషమువలనను ఆంధ్ర సోదరుల అభిమాన మూలమునను నిజాం రాష్ట్రములోని యాంధ్ర దేశమున నొక్కటేయగు నీ యాంధ్ర వార్తా పత్రిక తొమ్మిదవ వత్సరము దాటి పదవ వత్సరమున ప్రవేశముగాంచినది

గత సంవత్సరములందు మా పత్రిక శక్తి కొలది ఆంధ్రుల పురోవృద్ధికి పాటుపడుటయందు వెనుదీయలేదు. ముందును సామర్థ్యము మేరకు, నిజాం రాష్ట్రము నందలి ప్రత్యేక పరిస్థితులు అవకాశ మొసగునంత వరకు సేవ చేయ సంసిద్ధమైయున్నది

దుర దృష్ట వశమున మన రాష్ట్రములోని యాంధ్ర సోదరులందు మాతృ భాషాభిమానము తగిన విధమున వ్యాపించియుండనందునకు చింతిల్ల వలసి యున్నది ఈ విషయమున తొమ్మిది వత్సరముల సేవకు యోగ్యమగునంత ప్రతి ఫలము లభింపకుండుట నిరుత్సాహకరమే యైనను, విద్యా విషయములందు సామాన్యముగను, ఆంధ్ర భాషా విషయమున ముఖ్యముగను, వెనుకబడియున్న మన రాష్ట్రము నందలి వివిధ పరిస్థితులను గ్రహించియున్న వారెవరును తమ కర్తవ్యము విడనాడదలంపరు. మొత్తము మీద నాలోచించి చూడగా, నిజాం రాష్ట్రాంధ్ర దేశమునందును నవ్య భాషోదయ మగుచున్నందులకు నిదర్శనములు లేకపోలేదు కనుక ప్రవృద్ధి మందముగ నుండినను, ఫలితములు స్థిరములుగానే యుండుననుట నిస్సంశయము మూడు సంవత్సరముల కాలము వరకు ప్రభుత్వాంగీకారము లభింపనందున 'ఆగిపోయి యుండిన తృతీయాంధ్ర మహాసభ ఖమ్మముమెట్టు నందు జరుగుటయు, నిజాం రాష్ట్ర ఆదిమాంధ్ర మహాసభ కందూరునందు జయప్రదముగా సమావేశమగుటయు యువజనాంధ్ర

సంఘమను సంస్థ యేర్పడి కార్యారంభమునకు గడంగుటయు, బ్రిటిషు ఆంధ్ర దేశమున వెలువడుచున్న ఆంధ్ర వాఙ్మయము యొక్క వ్యాప్తి క్రమక్రమముగా హెచ్చుగుచుండుటయు ప్రజలయందు కలుగుచున్న నూతన ప్రబోధమును విశదము చేయుచున్నవి

మా రాష్ట్రములో ప్రజాహిత కార్యాసక్తిని పెంపొందించుటకును, ఆధునికములగు వివిధోద్యమములను గూర్చిన విజ్ఞానమును రాష్ట్రమునందెల్లెడల వ్యాపింపజేయుటకును మన రాష్ట్రము యొక్క ప్రజా సమస్యలను గూర్చిన యదార్థ జ్ఞానమును గ్రామస్థుల ద్వారముల కడకు గొనిపోవుటయు ఎంతయో యవసరమని మానిశ్చితాభిప్రాయము ఈ యంశములను దృష్టియందుంచియే గోలకొండ పత్రికను దిన పత్రికగా మార్చుటకై ప్రభుత్వము వారి యాజ్ఞ కోరబడియుండెను. కానియది లభించియుండలేదు నిజాం రాష్ట్రాంధ్రుల సంఖ్య డెబ్బది లక్షలు. మొత్తము రాష్ట్ర జన సంఖ్యలో వీరివంతు నూటికి 45 గొప్పున నగుచున్నది. ఇంత గొప్ప సంఖ్య ఈ రాష్ట్రమునందలి మరి యే భాష వారికిని లేదు మహాఘనత వహించిన నిజాం ప్రభుత్వము వారు రాష్ట్రములోని ప్రజలలో ఆంధ్రులకు గల సంఖ్యా ప్రాధాన్యతను వారి యోగ్యతా విశేషములను బాగుగ నెరుగుదురు. కనుక యిట్టి ముఖ్య ప్రజా భాగమునకు ఒక దిన పత్రిక యత్యవసరమని ప్రభుత్వము వారు విశ్వసించియేయున్నారు. కావున కొంది కాలములోనే యాంధ్ర దిన పత్రిక మన రాష్ట్రమునకు లభించగలదని మనము ఆశించవచ్చును అట్టి సుదినము త్వరలో చూడగల్గుదుము గాక!

"గోలకొండ పత్రిక" మన రాష్ట్రమున నొకటే యగు తెనుగు వార్తా పత్రిక యని పైన సూచించి యున్నాము ఈ కారణమువలన ఆంధ్ర సోదర సోదరీమణు లందరికిని యిది ముద్దు బిడ్డ వివిధ శాఖల వారికిని వివిధ భావముల వారికిని సనాతనులకును, నవీనులకును, స్త్రీలకును, పురుషులకును, వేయేల, యందరికిని తమ న్యాయ్యాభిప్రాయముల ప్రకటించుటకు ఈ పత్రిక యందు తావుండక తప్పదు కొన్ని హృదయములలో నీ విషయమున సందియము బాధించుచున్నట్లు తెలియుచున్నందున మేము విస్పష్టముగా చెప్పదలచిన విషయ మేమన, మా పత్రిక యొక్క విధానము సంకుచితము కాదు. వ్యక్తుల యభి

ప్రాయములు కొన్ని వేళల పరస్పర విరుద్ధములై యుండవచ్చును కాని పత్రిక యొక్క విధానము మాత్రము విశాలమైన దనియు, దేశీయులందు మత, సాంఘిక ఆర్థిక రాజకీయాది వివిధ విషయకాభివృద్ధిని పరిశీలించుచు, దానిని పెంపొందింపుటయే మా మనోరథ మనియు మేము ఘంటాపథముగ చాటుచున్నాము. నిజాం రాష్ట్రాంధ్ర సోదరులు ఈ పత్రికను ఉదార హృదయములతో పోషించి ఈ రాష్ట్రమున వాడిపోయియున్న ఆంధ్రాభిమానాంకురముల చిగుర్పజేసి, ఆంధ్రులందు నూతనజీవనమును ప్రతిష్ఠింతురుగాక! ఆరంభమైన పదవవత్సరము కాంతివంతమగు భవిష్యత్తును చేకూర్చునట్లను గ్రహించుగాక యని దేవుని ప్రార్థించుచున్నాము.

# ఆర్య సమాజోత్సవములు

**16-5-1935**

పది పంద్రెండు రోజులనుండి నగరములో ఆర్య సమాజోత్సవముల తోను, కన్యా గురుకుల వార్షికోత్సవములోను కళకళలాడుచు నగర వాసులలో వేలకొలది మందికి ఉత్సాహ సమయమై యుండెను దయామయులగు ప్రభుత్వము వారు యీ సభలకు అనుమతించి తమ నిష్పక్షపాత దృష్టిని కాపాడుకొనినారు

ఈ ఉత్సవములలో కడపటి రోజున జరిగిన ఒక విశేషము మాత్రము జనుల దృష్టిని కొంచెము అధికముగ నాకర్షించియుండ వచ్చును అది యేదనగా, ఆర్య సమాజీయులకు ఒక బెదరింపు లేఖ ఆ లేఖ ఆర్య సమాజ కార్యదర్శియగు బన్సీలాల్ వకీలుగారిచే సభలో చదివి వినిపించబడినది ఈ సంస్థాన ముసల్మానులు ఆర్య సమాజ ప్రచారమును సహింపజాల రనియు, ఆ ప్రచారమును అంతమొందించుటకు యత్నముచేయబడుచున్నదనియు, ఆ జాబులో వ్రాయబడియున్నట్లు చదువబడినది

ఈ జాబు వ్రాసిన దెవరు? నిజముగా ఆర్య సమాజ వ్యాప్తిని ద్వేషించు వారేనా యీ జాబుకు కారకులు? వారు ఆర్య సమాజము ప్రచారము తమకు యిష్టము కానిచో ఆ మాట బహిరంగముగా చెప్పరాదా? ఇట్టి ఊరు పేరులేని జాబులేల? ఈ జాబులో ఈ రాష్ట్ర ముసల్మానుల కెవరికి గాని ఆర్య సమాజ ప్రచారము యిష్టముకా దనుటయు అందువల్ల ఆ ప్రచారము నంతమొందించు టకు యత్నము చేయబడుచున్నదనుటయు ఆశ్చర్యమును గొల్పుచున్నది ఏలనన, ఈ రాష్ట్ర ముసల్మానులలో అట్టి అసహన భావమున్నట్లు యిదివరకు వినియుండలేదు హైద్రాబాదు రాష్ట్రము మత సఖ్యతకు ప్రసిద్ధి జెందినదని పేరుగాంచి యున్నది ఆర్య సమాజ ప్రచారము యీనాడు పుట్టినది కాదు అట్టి సందర్భములో ఇపుడు క్రొత్తగా యీ రాష్ట్ర ముసల్మానులకు ఆర్య మత

ప్రచారమనిన గిట్టదని యెవరు చెప్పినను ఆశ్చర్యమే కదా! అట్టి మాటను యెంత మాత్రము నమ్ముటకు వీలులేదు.

ఇక యిది ఆర్యమత మనిన సహింపజాలని యే బుద్ధిగల భీరువుచేతనో వ్రాయబడియుండ వలెను అందుచేత ఆర్య సమాజీయులు నిది భయపెట్టజాలదు

ఈ లేఖ జనులలో కొంత విస్మయమును కలిగించియుండుటచే దాని వాస్తవమును తత్సంబంధాధికారులు పరిశోధన చేసి వెల్లడిచేయుట యుక్తమని మా యభిప్రాయము

ఇదంతయు నెట్లున్నను ప్రభువునకు సర్వ మతములును సమానమేయను ఆదర్శముగల మ॥ ఘ॥ వ॥ నిజాం ప్రభువుగారి రాష్ట్రమున యితర మతములను దూషించక తమ మతముయొక్క ప్రాశస్త్యమును గూర్చి ప్రచారము చేయుచున్నంత కాలము ఆర్య సమాజీయులు భయపడ నక్కరలేదనియే మా విశ్వాసము

——

# ప్రభువుగారి రజతోత్సవ నిధి

**24-6-1935**

ఇంతకు పూర్వము మ॥ ఘ॥ వ॥ నిజాం ప్రభువుగారి రజతోత్సవ నిధి వసూలు సందర్భమున నెలకు ముప్పది రూపాయలకు పైబడిన ప్రభుత్వోద్యోగుల నుండి ఒకనెల జీతములో పదవ వంతు మాత్రము వసూలు చేయదగుననియు, ఇది అంతకంటె తక్కువ జీతము కలవారి నుండి వసూలుచేయ రాదనియు ఒక సలహా రాజకీయ శాఖా కార్యాలయము నుండి వివిధ ప్రభుత్వ కార్యాలయములకు పంపబడియుండెను ప్రభువరేణ్యుని రజతోత్సవ నిధికి ఈ పదవ వంతు జీతము వసూలు నిర్బంధమా అను సంశయము మరల యిపుడు రాజకీయ శాఖా కార్యాలయము నుండి వివిధ ప్రభుత్వ శాఖల కార్యదర్శులకు పంపబడిన ఒకలేఖ తీర్చుచున్నందుకు సంతోషించెదము

ఈ లేఖయందు ప్రభుత్వోద్యోగుల నుండిగాని, తదితరుల నుండిగాని, మ. ఘ. వ. ప్రభువుగారి జూబిలీ నిధికై యివ్వబడు ద్రవ్యము యిచ్చు వారి సంతోషము పైననే ఆధారపడి యుండుననియు, అందు నిర్బంధము యెంత మాత్రము లేదనియు, ప్రభువుగారి యెడ భక్తి విశ్వాసములుకల యెవరుగాని తమకెంత తోచిన అంత విరాళము నొసగవచ్చుననియు ఈ లేఖ స్పష్టముగా తెలియబరచుచున్నది

బలవంతముగా కొందరు ప్రభుత్వోద్యోగులను మీ జీవితములలో యింత భాగము నీయవలసినది అని ఆజ్ఞాపించినప్పటికంటె మీ శక్తికొలది యీ నిధికి విరాళముల నీయుడు అని కోరినప్పుడు వసూలగునది యెక్కువ మొత్తముగ నుండుననియు, యెక్కువ మొత్తము కాకున్నను, దానితో ప్రభువుగారి మనస్సుకు ఆనందము కలిగినట్లు యింకొక విధముగ కలుగజాలదనియు మా విశ్వాసము గొప్పవారు భక్తి పూర్వకముగ నిచ్చిన చిన్న యుపహారముతో సంతోషించు

నట్లు, ఎమిరా తప్పించుకొనుటకు మార్గమే కనబడదు దేవుడా ! అని చింతతో నిచ్చు నిలువగల యుపహారముతో సంతోషించరు.

అయితే ఒక సంవత్సరముదాకా నిర్బంధము అంత దూషించదగినది కాకపోవచ్చును. ప్రభువరేణ్యుని రజతోత్సవ స్మారకముగా ఒక మంచి విద్యాలయము గాని లేక పేదలకు యెక్కువగ ఉపకరించు వైద్యశాలనుగాని లేక పనిచేయలేని కుంటి గ్రుడ్డి మొదలగు వికలాంగుల శరణాలయమును గాని స్థాపించుటకై నిధి ద్రవ్యము వెచ్చింపదలచినప్పుడు, అందుకు చాలినంత ద్రవ్యమును సమకూర్చుటకై నెలకు 100కి పైబడిన జీతము గల ప్రతి ప్రభుత్వోద్యోగి నుండి నిర్బంధముగా కొంత వసూలు చేసిన అంత బాధకము కాకపోవును. ఇక్కడనైనను పూర్తిగా నిర్బంధముకన్న, హృదయావర్జనమే మంచిది కాని నెలకు నూటికంటె తక్కువ జీతము గల వారి నుండి ఒక నెల జీతములో పదవ వంతుకై ప్రార్థన యైనను పలుమారు చేయకుండుటయే మంచిదని తలంచెదము. ప్రార్థనలో నేమి తప్పువున్న దని అడుగవచ్చును కానీ పదేపదే ప్రార్థించుట యన ఒక విధముగా మోమోటమి రూపమయిన నిర్బంధమునకు అవకాశమిచ్చినట్లే యగును. తక్కువ జీతము గలవారు ప్రభువుగారి రజతోత్సవ నిధికి విరాళమును ఈయలేక పోయినందువల్ల వారికి ప్రభు భక్తి లేదనరాదు ఒక్కొక్కరి విషయములో యెక్కువ జీతము గలవానికంటే తక్కువ జీతము గలవానికే ప్రభు భక్తి యెక్కువ యుండవచ్చును కుచేలుడు నిత్య దరిద్రుడు. అతని చిన్ని ఉపహారం శ్రీకృష్ణునికి అపూర్వానందము నిచ్చినదని విందుము ఇదే రీతి యుండును గొప్ప మనస్సు గలవారలకు ధనిక దరిద్రతత్వ భేదము యెడ ప్రవృత్తి

ప్రతి మానవుడు మొట్టమొదట స్వార్థపరుడే స్వార్థమయిన తరువాతనే గురువు, దేవుడు మొదలగు భక్తిమార్గముల వైపు మరలును పేదలన్నవారికెన్ని కష్టములుండునో, తనకు వచ్చు నెల జీతములో తన్నే ఆశ్రయించుకొనియున్న కుటుంబ పోషణమును చేసికొనజాలక తీరిక సమయములో సుఖమును కూడ పోగొట్టుకొని ఉప వృత్తులను కల్పించుకొని కష్టపడవలసినవారు, వారు ఇంత కష్టపడినను, సామాన్యమయిన అవసర ఖర్చు కంటె యెక్కువ వేయవలసివచ్చినను,

నెల ఆఖరున దుగ్గాణియైనను మిగిలించుకొనలేనివారు వారు మొదటి నుంచి తమ భవిష్యత్తు విషయమై తక్కువ ఖర్చుతో కొంచెము కూడబెట్టుకొను చుండినసేగాని అంత్య దినములలో అప్పులపాలు కాకుండా జీవించలేరు ఇన్ని కష్టముల మధ్య భక్తి ద్రవ్యరూపముననే వెల్లడి జేయుటయన వారికెంత కష్టమో యెవరికిని తెలియనిది కాదు. అట్టివారికి పైజెప్పబడిన రాజకీయ కార్యాలయ లేఖ ఉపశాంతికరముగా - సంతోషకరముగా అని చెప్పుట లేదు - వుండ గలదు.

కాబట్టి మొత్తము మీద ప్రభుత్వోద్యోగులు, ఉద్యోగులు కాని వారు అనక ప్రతి నిజాం ప్రభు భక్తుడును తమ తమ శక్తి కొలది సంతోషముతో ప్రభు వరేణ్యుని రజతోత్సవ నిధికి విరాళముల నీయవలసినదని కోరు యిట్టి లేఖను వెల్లడి చేసినందుకు రాజకీయ శాఖవారును ప్రభుత్వ ప్రకటనశాఖ వారును ప్రశంసనీయులనక తప్పదు

---

# భావ కవిత్వము

**25-7-1935**

కొద్ది రోజుల క్రిందట కృష్ణదేవరాయల ఆంధ్ర భాషా నిలయంలో ఉస్మానియా విశ్వవిద్యా పీఠమువారు కళాశాలలో ఆంధ్ర సాహిత్యాధ్యాపకులగు శ్రీయుత రాయప్రోలు సుబ్బారావు గారి అధ్యక్షత్వమున జరిగిన సభాకార్యక్రమము సాహిత్యాభిమానులకు అధికమగ రుచించి యుండును కార్యక్రమమందు ప్రధానాంశము "ఆధునిక కవిత్వము" అనుదానిని గూర్చి శ్రీయుత ఖండవల్లి లక్ష్మీరంజనము గారి యుపన్యాసమైనను, సంబంధవశమున ఆధునిక కవిత్వము, భావ కవిత్వము అని వ్యవహరింపబడు కవిత్వ పథమునకు ప్రతికూల పక్షమున చేరిన వానికిని వారి అభిప్రాయములను సభలో వెల్లడి చేయుటకు అవకాశమీయబడుటయు, అట్లు పైకి తేబడిన ఆక్షేపణలకు 'భావ కవులే' యగు శ్రీయుత సుబ్బారావు గారు సమాధానములు జెప్పుటకు అవకాశము కల్పింపబడుటయు సభలో రక్తి కట్టించుటకు కారణములు

లక్ష్మీరంజనముగారి యుపన్యాసమును దాని తర్వాత భావ కవిత్వమును ఆక్షేపించు డాక్టరు శర్మానంద గారి యుపన్యాసమును, రాయప్రోలు సుబ్బారావు గారి ప్రత్యుత్తరోపన్యాసమును క్రమముగా చేరి నేడు భావ కవిత్వోపాసకుల మనుకొనువారికిని ప్రాచీన కవిత్వోపాసకులమనుకొను వారికిని దృష్టి వైఖరులలో తీవ్రవైరమెందువలన కలుగుచున్నదో సుస్పష్టము జేసినవి మనలో ఆచారముల విషయమునందు వలెనే సాహిత్య సేవా విషయమునందును, ప్రాచీన మతము అని చెప్పదగు మతము నందు అభిమానము యింకను గట్టిగ నున్నది ప్రాచీనమైన ప్రతిదాని యందును గౌరవమును జూపుమన తత్వ మింకను యెక్కువ మారలేదు అందువలన భావకవిత్వమును ఉపాసించువారు కొందరు ప్రాచీన కవిత్వమునందు లోపమునుచూపి, ఆ లోపమును ఈ నూతన మార్గము ద్రొక్కు భావ కవిత్వము తీర్చుచున్నదనుసరికి ప్రాచీనాభిమానులకు కోపము కలుగును.

కొందరు భావ కవిత్వ పక్ష ప్రతినిధులు తమ నూతన పద్ధతి లక్షణమును చెప్పుచు ప్రాచీన కవులు లేనిపోని ఛందోవ్యాకరణాది నియమములచే కవిత్వమును బంధించినారనియు తమను అట్టి నియమములు బంధించజాలదనియు-ఒక గొప్ప లక్షణముగ చెప్పుటచే ప్రాచీనాభిమానులకు ఉద్రేకము లేచుట ఆశ్చర్యము కాదు

ఉభయ పక్షముల మధ్య ప్రాతికూల్యము కనబడుటకు యింకొక కారణము భావ కవిత్వపక్ష వాదులు కొందరు తమ నూతన ప్రయత్న మార్గమందలి ముఖ్య లక్షణమును స్పష్టముగ జెప్పక అప్రధానములగు అంశములను గొప్ప లక్షణముల వలె పేర్కొనుటయే. ఉదాహరణార్థము చూడుడు కవులు నిరంకుశులు అనునది భావ కవిత్వము యొక్క ఒక ముఖ్య లక్షణముగ కొందరిచే జెప్పుకొనబడుచున్నది. కవులు నిరంకుశులనునది ప్రధాన లక్షణముగ గల కవిత్వమేదియు నుండజాలదు సహృదయ హృదయాహ్లాదకరమగు భావములను రంజకమగు రీతిని కావ్య నిబద్ధము జేయునపుడు ఛందస్సు, వ్యాకరణము మొదలగు నియమములు కవికి ఆటంకములగు సందర్భములు యెప్పుడేని సంభవించుచో, అప్పుడు ఆ నియమోల్లంఘనము ఆ కవిత్వమునందు దోషము కాజాలదని చెప్పుట న్యాయమగును కాని కవులు నిరంకుశులు నేను కూడ ఒక కవినే, కాబట్టి నా యిష్టమే న్యాయమను మొండి యభిప్రాయముతో యేవో రెండు తారు పాకపు గీతముల వ్రాసినవాడు మొదలు కవియేకాడు యిక భావకవి యెట్లగును? అట్టి కవిత్వములను నూతన మార్గము యెడ సానుభూతిగలవారే ఆనందించజాలనపుడు, అవి ప్రాచీనాభిమానుల నుండి ఆక్షేపించు వైఖరిని గాక మరి దేనిని పురికొల్పును?

ఇట్లే నేటి కవిత్వ రచనలో అనేకములు రసగ్రహణ తత్పరులకు రసము నిచ్చుట లేదు ఎక్కువగా అట్టి కవిత్వ రచనలను చూచినవారికి యిదే భావ కవిత్వమైనచో యిదే ప్రాచీనమైన దానికి ప్రతికూలముగ పుట్టినదైనచో - యిది నిరసింపదగినదే యను భావము కలుగకుండునా? కావున కొంతవరకు రసహీనములైన కొన్ని కవిత్వ రచనలు భావ కవిత్వమునకు ఉదాహరణముగ పేర్కొనబడుటయు భావ కవిత్వమును నూతన మార్గము యొక్క ముఖ్య లక్షణము సుస్పష్టముగ తెల్పబడకుండుటయు జతయగుటయే చాల వరకు కవిత్వ విషయమున ప్రాచీనాధునిక తీవ్ర వైరమునకు ముఖ్య కారణము భావ

కవులచే, ఇంతియేల రచయితచేతనే భావకవిత్వమునకు సమ్మానము హృదయాహ్లాదకరమగు నొక కావ్యమును ప్రాచీనాభిమానులు చూచి అది ప్రాచీన పద్ధతియే అని చెప్పుకొనుట యిందుకొక తార్కాణము

రాయప్రోలు సుబ్బారావు గారు తమ ఉపసంహారోపన్యాసములో భావ కవిత్వము యొక్క ముఖ్య లక్షణమేమి యను సంశయను మొట్టమొదట తీర్చి తమ మార్గమునకు అడ్డముగ నుండు పెద్ద ముళ్లకంపను తీసివేసినవారైనారు భావ కవుల మనుకొను పలువురు రచించు కావ్యముల రసహీనతను పట్టుకొని- అవె భావ కవిత్వమనుడు, లేదా ఆధునిక కవిత్వమనుడు, లేదా మరియొక క్రొత్త పేరు పెట్టుడు- దాని ముఖ్య లక్షణమగు ఒక నూతన పద్ధతి యొక్క విలువనె తక్కువగ జూచుట యుక్తము కాదు, అని సుబ్బారావు గారు స్పష్టము జేసినారు భావ కవులమని తమకు తాము తలచుకొను వారందరును నిజముగ ఆ పద్ధతిని గ్రహించి అవలంబించుచున్నారో లేదో కాని సుబ్బారావు గారిచే స్పష్టముగ లక్షితమైన ఆ పద్ధతి మనము ఆదరించి స్వీకరించదగినదని చెప్పక తప్పదు ఈ పద్ధతి మన ప్రాచీన కవిత్వమునందు గూడ గలదు. కాని, ప్రాముఖ్యముతో ప్రత్యేకముగ గుర్తించబడి యుండలేదు వర్డ్స్‌వర్తు కాలము నుండి ఆంగ్లేయుల కవితా ప్రపంచమందు ఆ పద్ధతి ప్రత్యేకముగ నొక పద్ధతిగ పోషింపబడినది ఇపుడు ఆంగ్ల వాఙ్మయ సంబంధము చేత మన దృష్టిని ఆ పద్ధతి యెక్కువగ నాకర్షించినది కానీ అనేకులు ఆ పద్ధతి యొక్క లక్షణమును సరిగా గ్రహించి ప్రయత్నించనందునను, వారలలో కవిత్వ బీజము లేకున్నందునను, వున్నను మంచి సంస్కారము పొందనందునను, వారి కవిత్వ రచనలు చిన్నబుచ్చబడు చున్నవి అంతే. ఆ పద్ధతి యందలి ముఖ్య లక్షణము యేమన, దాని ననుసరించి రచించబడిన కవిత్వము నందు కవి యొక్క భావముల విలాసములో యే వస్తువుచే ఆ భావములు కలుగుచున్నవో ఆ వస్తువు అంతర్హితమగుచున్నది. అనగా కవికి ఆ వస్తువు యెట్లు అగుపడునో అట్లే మనకును అగుపడును షెల్లీకి స్కైలార్కు అను విహంగము అకళంక స్వాతంత్ర్య పుంజముగ గనిపించినచో మనకును అది విహంగముగ గాక స్వాతంత్ర్య పుంజముగ గనిపించును వస్తువును గూర్చి కవి యొక్క ఆ భావమును ఏ కవిత్వము మన హృదయములలో ప్రేరించి ఆహ్లాద మొసంగునో ఆ కవిత్వము అది యొక పద్ధతిగ గ్రహించదగినదే. మన ప్రాచీన కావ్యములందు ఉత్ప్రేక్షాలంకారము, రూపకాలంకారము

గల భాగములు యిట్టి ఫక్కీనే సూచించును కాని ఆ కావ్యములలో అవి ప్రధానములుగ నెంచబడిక ప్రధానమైన ఒక ఆత్మయుక్తమగు శరీరమునకు అలంకారములుగ నెంచబడినవి ఇదియే భేదము. ప్రాచీన ఫక్కిలో యేది అలంకారమాత్రముగ నుండెనో అది పైన లక్షితమైన నూతన ఫక్కిలో శరీరమే యైనది. ఇట్టి లక్షణమును అనుసరించి రసవంతమగు కావ్యమును రచించుచు పోవుటలో ప్రాచీన సంప్రదాయ సిద్ధములగు నియమములు అడ్డము తగిలినప్పుడు ఆ నియమోల్లంఘనము తప్పదు.

నేడు భావ కవిత్వములు అనుబడునవి అనేకములు నూతన ఫక్కిని అవలంబించి యుండవచ్చును గాని అంత మాత్రముననే అవి గొప్ప కావ్యములని అందరు చెప్పవలెనని తాము అనుట లేదని సుబ్బారావుగారు అంగీకరించినారు రచయితలు తాము ఇది మంచి, యిది మంచిది అనుకొని రచించినారు నిజముగా మంచిదా కాదా యను నిర్ణయము సహృదయుల వంతు సహృదయులకు పెక్కురకు నేటి రచనలలో అనేకములు యింత కాలము వరకును రసహీనములుగనే కన్పడుచున్నవి అది వాస్తవమే కాని నిజముగా కవులైన వారు దేనికి వెదరుకొని పోరాదు శాకుంతలము కాళిదాసుయొక్క మొదటి యత్నము కాదు ఉత్తర రామ చరితము భవభూతి యొక్క ప్రథమ రచన కాదు కొందరు కుకవుల రచనలు సహృదయుల శ్లాఘను బడయక పోవుట మంచి కవుల దోషము కాదు కాబట్టి క్రొత్త 'కవి భూషణుడు' చెప్పినట్లు నిజమైన కవి "కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వి' అని తలచి ఋజు బుద్ధితో ఆత్మవంచన లేక తమ బుద్ధికి యుక్తమగు రచనల జేయుచుండవలసినదే!

---

# చారిత్రక బోధ

**22-8-1935**

"To teach biased propagandist history is to damage everything that should be cherished.

"ఒక పక్షమును అవమానము పాలుచేయు కుత్సిత ప్రచారము గల చరిత్రను బోధించుట యనఁ చిరకాలము స్మరింపవగెనది ఏదీ యుండునో దానిని నాశనము చేయుటే యగును."

"It is a very bad thing for any child to be brought up on a history which does not appeal to his sense of the heroic and romance "

—Mac Donald

"ధీర చరితములును, అద్భుత చరితములును బాలురచే మెచ్చుకొన బడును. అట్టిది యేదియు కాని చరిత్రను వారికి బోధించుట యెంతమాత్రము యుక్తము కాదు".

—మెక్డొనల్డు

"ప్రకృతము హిందూముసల్మానుల ద్వేషములకు కారణము ఇప్పుడుండు చరిత్రలే. అవే రెండు తరములనుండి ద్వేషములను పెంచినవి."

—మౌలానా మహమ్మదలీ.

సరియైన చరిత్రను, ఏ మాత్రమును పక్షపాతము చూపకుండు వ్రాయు చరిత్రకారుడు ఉత్తమ వర్గములో చేరినవాడు కాని సాధారణముగ మనము చూచు చరిత్రలలో చరిత్రకారుడు తనకు అభిమానమైన విషయములను కొండంత చేసి తనకు నచ్చని సంగతులను హీనము చేసి లేక హేళనము చేసి

వ్రాయుచుండుదు తాళ్ళపాక వారి కవిత్వము కొంత మా పైత్యము కొంత అన్నట్లు ఏలనో కొందరు చరిత్రకారులు తమ రాగ ద్వేషములను దాచుకొనలేక గ్రంథస్థము చేసి ప్రకటించుకొనుచుందురు మన సర్ హైదర్ నవాజ్ జంగ్ బహద్దరు గారు ఇట్టి చరిత్రకారులను దృష్టియందుంచుకొనియే కాబోలు రెండు మూడు మారులు హెచ్చరించి యుండిరి. నవాబుగారు మన పాఠశాలలలో చెప్పబడు చరిత్రలు సరియైనవి కావనియు, హిందూ ముసల్మానుల ఐకమత్యమునకు అనుకూలించునవిగా వ్రాయు చరిత్రలే యుత్తమమైనవనియు నభిప్రాయమిచ్చు ఉపన్యాసములు ఇచ్చియుండిరి చరిత్రకారుడు తన యిష్టము వచ్చినట్లు గత గోష్ఠిని గురించి యభిప్రాయ మిచ్చుటకు స్వతంత్రుడే. కానీ ఆ అభిప్రాయములు పక్షపాతముతో కూడినవై యుండినవి యెవ్వరికి పనికివచ్చినను విద్యార్థులకు మాత్రమే పనికిరావని మా యభిప్రాయము

మెక్ డొనాల్డుగారు, విదేశములో ఇంగ్లీషు, చరిత్రను గురించి యొకటి రెండే తప్పుడు వాక్యముల వ్రాసి బోధించుచుండినందున, ఆ ప్రభుత్వమునకు వ్రాయగా వెంటనే వారు ఆ ఆక్షేపణీయమగు వార్తలను తీసివేసి ముద్రించిరట ఇక్కార్యము ఉభయ దేశముల గౌరవమును హెచ్చింపవలెను

మన దేశములో నిప్పుడు విద్యార్థులకు బోధించు చరిత్రలు కొన్ని బాగుగా పరిశీలించి వ్రాయించవలసి యుండును నిజమైన విషయములు వ్రాయుటకు ఆటంకము లేదు కానీ అనవసరముగా హేళనము చేయుట, ఒక మతము వారికి ఉద్రేకము కలిగించుట, ఒక మతము వారికి అవమానము కలిగించుట, ఒక మతమును గురించి అనవసర విమర్శనము చేయుట, ఆ మత సిద్ధాంతములను వెక్కిరించుట, ఇట్టివి గల చరిత్రలు ఎంత కాలము మన యువకులకు నేర్పబడుచుండునో అంతవరకు దేశమందు ద్వేషములు, మనస్పర్థలు ప్రబలుచుండును

మన రాష్ట్రములో "తారీఖెహింద్" అను ఉర్దూ గ్రంథములోని కొన్ని భాగములను ఇటీవల వైదికాదర్శలో ఎత్తి ప్రకటించినారు ఆ భాగములు కొందరికి గాని బహుళ జనులకు గాని ఆక్షేపణీయములు కావని తలంచినను, "వైదికాదర్శ" వంటి వారికి కొంత మందికి మనస్తాపము కలిగించినట్లు కనబడు

చున్నది ప్రభుత్వము వారీ విషయములో శ్రద్ధ కలిగించుకొని విచారించి అందు నిజముగా ఆక్షేపణీయాంశములు వున్నవని నిశ్చయించిన, వెంటనే తగిన చర్య పుచ్చుకొందురని తలచుచున్నాము మరియు ఈ "తారేఖెహింద్" గ్రంధము మన రాష్ట్రంలోనన్ని పాఠశాలలందును ప్రైమరీ మొదలుకొని బి ఏ వరకును, అదే గ్రంధకర్తచే వ్రాయబడినదై, విద్యార్థులకు చదివింపబడుచున్నదని విను చున్నాము. ఈ గ్రంధములలో ఏవేని ఆక్షేపణీయములో, ఏవేవి చరిత్ర విరుద్ధాంశములో, యేవేవి అనవసర ప్రసంగములో అట్టివన్నియు సమకూర్చుటకై యొక కమిటీని నిర్ణయించి బ్రిటిషిండియా, ఇంగ్లాండులలోని సుప్రసిద్ధ చరిత్ర కారుల యభిప్రాయములను గైకొనవలెననియు సూచించుచున్నాము.

---

# హైద్రాబాదు పరిపాలనా నివేదిక

## 4-11-1935

## హైద్రాబాదు పురపాలక సంఘము

ఇదియు స్థానిక స్వపరిపాలనలోనిదేయైనను దీని వివరములు ప్రత్యేకముగా నివేదికలో గలవు దీని ఆదాయము 11 లక్షలపై చిల్లర. దానిలో 7 లక్షలపై చిల్లర (అనగా సగము కంటె హెచ్చు) ప్రభుత్వము వారిచ్చుచున్నారు ఈ స్థితి హిందూ దేశములోని నాల్గవదగు మన నగరము యొక్క ఘనతకు తగినట్టులేదని మా తలంపు. 1344 ఫ.లో మన పురపాలక సంఘము విశాలపరుపబడినది. పన్నులును, సభాసదులును, హెచ్చింపబడినారు, కనుక ముందు అభివృద్ధి కనపడగలదని ఆశించెదము

## వ్యవసాయ శాఖ

ఈ శాఖపైన వ్యయము 8 లక్షల 55 వేలపై చిల్లర ఈ శాఖ క్రమాభివృద్ధి చెందుచున్నది. ప్రజలకు దీని యుపయోగము ఎక్కువగా కానవచ్చునట్లు ఈ శాఖవారు ప్రయత్నము చేయుచునేయున్నారు.

ఈ శాఖవారు చేయుపని నాల్గు భాగములు 1. పరిశోధనము. 2 ప్రయోగము (Experiments), 3 ప్రదర్శనములు, ప్రచారము (Demonstration and Propaganda), 4 రైతులకు సహాయము.

## సహకార శాఖ

దీనిపైన మనకు ఖర్చు 3 లక్షల 74 వేలపై చిల్లర కొంత పని జరుగుచున్న మాట వాస్తవమే కాని జన సామాన్యమునకు ముఖ్యముగా రైతులకు ఈ శాఖ గట్టి విశ్వాసమును కలిగింపలేదని గ్రామ సంబంధము గలవారు అనుచున్నారు. శాఖాధికారుల సత్ప్రయత్నములవలన క్రమముగా లోపములు తొలగిపోవచ్చును

## వాణిజ్య పారిశ్రామిక శాఖ

ఈ శాఖ పక్షమున నివేదిసనుబట్టి చాల పని జరుగుచున్నది. నివేదిక వత్సరములో "దక్కన్ గ్లాస్ వర్క్స్" కర్మాగారము అమ్మివేయబడినది. ఈ కంపెనీకి మన ప్రభుత్వమువారు గొప్ప మొత్తమును సహాయ మొసగియుండిరని మాకు జ్ఞాపకము కలదు దివాలాలోనికి పోవనుండగా అది అమ్మివేయబడినదని నివేదికలోనున్నది ఉదారాశయులగు మన ప్రభుత్వమువారు ఇట్టి ముఖ్య కార్మాగారమును పూర్తిగా తమ యాజమాన్యమున వుంచకొనినచో ఎట్లుండెడిదో!

దయామయులగు మన ప్రభువుగారు పరిశ్రమల కోసము 1339 ఫసలీలో ప్రత్యేకముగా కోటి రూపాయలు అనుగ్రహించియుంచిరి దానిలోనుండి నివేదిక సంవత్సరము వరకు 72 లక్షలపై చిల్లర ఇయ్యబడినది ఈ నిధిని వ్యయము చేయుటకు ముగ్గురు మంత్రుల ఉప సంఘము ఏర్పడి యున్నది.

పరిశ్రమల కొరకు అప్పులిచ్చుట, కొన్ని కార్ఖానాలను ప్రభుత్వమువారు నడుపుచుండుట, పారిశ్రామిక పాఠశాలల స్థాపనము మొదలగు పద్ధతులు అవలంబించబడుచున్నవి

## తామిరాతు శాఖ

దీనిపైన వ్యయము ఒక కోటి 61 లక్షలపై చిల్లర, ఆప్పాషి కూడ దీనిలోనే చేరియున్నది

## టప్పా శాఖా

రాష్ట్రమున టప్పాఖానాల సంఖ్య 794 అనగా 104 చదరపు మైళ్ళకు ఒక టప్పాఖాన కలదు ఇవి చాల తక్కువ యని మా అభిప్రాయము. వీని సంఖ్య హెచ్చుటకు గట్టి ప్రయత్నములు చేసి లాభము పొందింపవలయును. ఆదాయము 9 లక్షల 87 వేలపై చిల్లర వ్యయము 9 లక్షల 20 వేల పైన కలదు ఇది తృప్తికరముగనే యున్నది.

## వైద్య శాఖ

ఈ శాఖపైన నివేదిక వత్సరమున 19 లక్షలకు మించి వ్యయమైనది. ఇంగ్లీషు వైద్యశాలలు కాక నగరమున 29 యూనానీ ఆయుర్వేద వైద్యశాలలు వుండెననియు వానిలో 10 ప్రభుత్వము వనియు, 19 ప్రభుత్వ సహాయము పొందునవి అనియు నివేదికలో కలదు. ఈ 29 లో ఆయుర్వేద వైద్యశాలలు ఎన్నో, యునానీ వెన్నో వివరములుండిన బాగుండెను "యూనానీ వైద్యశాఖ" పైన 1 లక్ష 53 వేలు ఖర్చయినవి వివరములు ఇట్లియ్యబడినవి

| | | |
|---|---|---|
| ఆరోగ్య శాఖ . | రూ | 4,43,142 |
| వైద్య శాఖ | రూ | 19 36,191 |
| యూనానీ శాఖ | రూ | 1,53,541 |
| మొత్తము | రూ | 25,32,874 |

ఇది సరియేయైనచో ఆయుర్వేద శాఖపైన ఖర్చైనదేదో కాన్పించుట లేదు.

## విద్యాశాఖ

నివేదిక వత్సరమున 10 కాలేజీలు 52 హైస్కూళ్ళు, 132 మిడిలు స్కూళ్ళు, 4290 ప్రైమరీ పాఠశాలలు, 58 ప్రత్యేక పాఠశాలలు వుండెను విద్యాశాఖ పైన మొత్తము వ్యయము 1 కోటి 6 లక్షలపై చిలుకు దీనిలో ప్రాథంభ విద్యపైన అయిన వ్యయము 24 లక్షల 28 వేలపై చిలుకు అనగా నూటికి 22 చొప్పున మాత్రమే. ప్రారంభ విద్య చాలా ముఖ్యమైనది జన సామాన్యమున కందునది ఈవిద్యయే కనుక దీనికి ఎక్కువగా వ్యయమగుట అవసరము, అని (1931 మర్దుంషుమారిలో చదువుకొనిన వారి సంఖ్య నూటిలో 5 కంటే తక్కువగా నున్న దేశము విషయమున) చెప్పవలసిన పనిలేదు. మహోదారులును, విద్యా ప్రియులును నగు మనప్రభుత్వము వారికీ విషయమున యెక్కువగా సూచించవలసిన పనిలేదు.

## స్త్రీ విద్య

బాలికా పాఠశాలలు ప్రభుత్వము వారివి (స్వంతముగా వారివి లేక ఇందాదు పొందునవి అన్నియు కలిసి) 718 యుండెను. ఇవి కాక ప్రయివేట్ పాఠశాలలు 9 ఉండెననియు, వానిలో చదువు బాలికల సంఖ్య 70 అనియు రిపోర్టులో కలదు (పుట 105-111) ఈ ఏడింటిలో 1 హైస్కూలు, 1 మిడిలు స్కూలు వుండెనట ఈ రెండు పెద్ద పాఠశాలలు ఎచ్చట నుండెనో తెలియదు ఈ 9 పాఠశాలలు ఎట్టివో కానరాదు ఏలయన ఇవి సహాయము పొందునవి (Aided) కాని, సహాయము పొందక పోయినను అంగీకరింపబడినవి (Unaided, Recognized) గాని కావు ఈ హైస్కూలు బాలికల ఉన్నతపాఠశాల (సుల్తాను బజారు) కాదుగదా? ఏల యన ప్రభుత్వ సహాయముపొందని బాలికల హైస్కూలు మాకు తెలిసినంతవరకు రాజధాని యందలి ఈ ఒక హైస్కూలే కనబడుచున్నది

## వాఙ్మయము

నివేదిక వత్సరమున వెలువడిన 560 పుస్తకములలో 369 ఉర్దూవి. (పుట 116). అనగా నూటిలో 66 అన్నమాట దీనిని గూర్చి నివేదికలో "దీని వలన ఈ భాషకుగల జన ప్రియత్వము వెల్లడి యగుచున్నది (Which indicated the popularity of that language as a literary medium) అని వ్రాయబడియున్నది (పుట 13 ఉపోద్ఘాతము.)

కానీ పూర్తిగా జనప్రియత్వమని చెప్పుట బ్రిటిషు ఇండియాలో ఇంగ్లీషులో వెలువడిన పుస్తకముల సంఖ్యను జూచి ఇంగ్లీషు జన ప్రియమని చెప్పుట యెట్లుండునో అంత మాత్రమే.

## మత శాఖ

వ్యయము 12 లక్షల 18 వేల పై చిల్లర. 12 మత సంబంధమగు కొత్త మందిరములు (3 మహమ్మదీయులవి, 3 మహమ్మదీయేతరులవి) కట్టబడినవి

78 ప్రాతవి (39 మసీదులు, 39 మహమ్మదీయేతరులవి) బాగు చేయించబడినవి. ఈ పని యంతయు ప్రభుత్వ వ్యయములతో జరిగినది పై సంఖ్యలవలన మన ప్రభుత్వము వారి నిష్పాక్షికత్వము తెలియుచున్నది

## ముగింపు

మొత్తము మీద మేము పైన ఉల్లేఖించిన విధమున ప్రభుత్వము వారి నివేదిక బోధప్రదముగనున్నది విద్యావంతులగు దేశీయులు - ముఖ్యముగా ఇంగ్లీషు వచ్చినవారు - ఈ నివేదికను చదివి లాభము పొందవచ్చును ముందు నివేదికలు సకాలమునకు సత్వరముగా ప్రకటితములగునట్లు ఏర్పాటులు జరిపిన యీ నివేదికల విలువ యింకను హెచ్చగలదు.

——

# సిరిసిల్ల ఆంధ్ర మహాసభ

**9-1-1936**

ఈసారి సిరిసిల్లలో జరిగిన చతుర్థ నిజాం రాష్ట్రాంధ్ర మహాసభకు పోయిన యెవని నడిగినను, ఇటువంటి మహోత్సవము యిదివరకెన్నడు గాని యీ సభలు జరిగి యుండలేదనువారే ఈ మాటను విన్న ప్రతివాడును తన మిత్రుడు తనను పిలుచుకొని పోనందుకు తప్పుపట్టువాడే

1200 చదరపు గజాల విస్తీర్ణము గల సభా మండపములో జనము - టిక్కెట్లు కొని ప్రతినిధులైనవారును ప్రేక్షకులైన వారును మాత్రమే - మహాసభ సమావేశములోనున్న వేళల క్రిక్కిరిసి యుండుటయే గాక స్థలము లేని వారో లేక టిక్కెట్లు కొనలేనివారో అనేకులు సభా మండపమునకు వెలుపల జీవ రక్షా ప్రచారము మున్నగు ప్రచారములు చేయవచ్చిన వారికిని ప్రవర్శకులకు పని పెట్టుచుండిరట హైద్రాబాదు నగరము నుండి పోయిన 13 బస్సులతో సహా మొత్తము వివిధ ప్రాంతముల నుండి 30 బస్సులలో జనము వచ్చిరట. ఇదేమో గొప్ప సంబరముగానున్నది, చూతమని అనేకులు చుట్టు ప్రక్కల పల్లెల నుండి మొదటి రోజు వచ్చిరట ఇవంతయు మన ఆంధ్ర మహాసభను గూర్చి యెక్కువ ప్రచారము జరిగియుండుటను, అనేకులకు మన రాష్ట్రీయాంధ్రులకు తమ అభివృద్ధియే ఉద్దేశముగా గల యీ సభల యందు ఆదరమును సూచించును

అంతే కాదు మొదట మొదట యీ ఆంధ్ర మహాసభల వృత్తాంతములు ఈ ఒక్క పత్రికలో తెలిసికొనవలసి యుండు నట్లుండెడిది పిమ్మట హైద్రాబాదు బులెటిను పత్రిక సానుభూతి లభించెను అటు తర్వాత బ్రిటిషిండియాలో ఒక్కటే దిన పత్రికగా నుండిన ఆంధ్ర పత్రిక యందు వచ్చుట ప్రారంభమయ్యెను గత ఖమ్మం మహాసభ నుండి ఆ అదృష్టము పట్టెను ఈసారి స్థానిక

ఉర్దూ దినపత్రికలన్నియును ఆ వార్తలను ప్రకటించుటయేగాక ప్రశంసించను గూడ ప్రశంసించినవి ఇందుచే ఉర్దూ పత్రికలను మాత్రమే విశేషముగా చూచు అనేకులు పెద్దలు అధ్యక్షునికి తమ సంతోషమును తెలియబరచినట్లు విను చున్నాము. ఆఖరుకు 'టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రికలో గూడ కొద్దియో గొప్పయో యీ సభ వార్త వచ్చినది కాబట్టి ఆంధ్రోద్యమ అంకురము నానా దిక్కుల కొమ్మలను వేయనారంభించినదన్నమాట!

ఈ సభకు రామణీయకమును ఆపాదించిన మరికొన్ని విశేషములలో వ్యాయామపు పోటీలును, సాంఘిక నాటకములును, ఆర్యసమాజము వారి వైదిక ధర్మ ప్రచారమును చేరి యున్నవి ప్రభుత్వము వారి వ్యవసాయ పరిశ్రమల శాఖల నవీనాభివృద్ధి ప్రదర్శనములును జీవరక్షా ప్రచారక మండలి వారి మ్యాజిక్ లాంతరు ప్రదర్శనములును ఖమ్మంలో వలెనే ఈ సభలోను జరిగినవి

మేము యిదివరకే తెల్పియున్నట్లు యీ సిరిసిల్ల సభకు విశేషత్వమును ఒనగూర్చు రెండంశములు ఏవనగా - 1 స్వయముగా ఉత్సాహముతో ఏర్పడి శ్రద్ధతో పని చేసిన ఆహ్వాన సంఘము లభించుట, 2 మన ఆంధ్రోద్యమ పితామహుడు అధ్యక్షుడగుట

ఇపుడు పైన చెప్పబడిన విశేషములే గాక ముఖ్యాతి ముఖ్యమయిన మరి యొక అంశము పేర్కొన దగినది గలదు గత ఖమ్మం మహా సభలో యెవరో సనాతనులమని ప్రకటించుకొనుచు వివాహవయో నిర్ణయమునకు సంబంధించిన తీర్మానము మున్నగు రెండు మూడు సంఘ సంస్కరణపు తీర్మానములను తుదకు చర్చకైనను రానీయకుండ, పడగొట్టి యుండిరి వాటితో కూడ మహా సభకు సంబంధించిన నియమావళి (చిత్తు)కి కూడ దృష్టి దోషము తగిలెను ఈసారి సభలోనైనను యీ నియమావళి గతి యేమగునో యేమో యని అను కొనుచుండ, యే విధమయిన ఆటంకము లేకుండ అది ఆమోదించబడినది అది యెట్లున్నను నిరుడు సంఘ సంస్కరణ తీర్మానములు పడగొట్టబడినపుడు అనేకులు సంస్కరణ ఉత్సాహులు, ఎవరో తీర్మానములను పడగొట్టజూచుటయు, మీరు లొంగుటయునాయని నాయకులపై చాల కోపించి యుండిరి 1 ఇపుడా పక్షమువారు మొదటి విజయము పొందినారు బాలికలకు 15 ఏండ్ల వయస్సు

వచ్చు వరకు వివాహము చేయరాదని సంస్కరణోత్సాహుల వాదము దీనికి సనాతనుల పక్షము తీవ్రముగా ప్రతిఘటించి ఓడిపోయినను పిమ్మట మహాసభలో ఆ తీర్మానముపై చర్చ జరిగి సంస్కరణ ప్రతిఘటన ఏవో రెండు ఓట్లు సంపాదించుకొని ఓడునంతవరకు తృప్తి నొందలేదు

2 ఇంకొకటి సంస్కరణోత్సాహుల విజయము ఇంతకంటె ముఖ్యమైనది గలదు మహాసభ కార్యక్రమ మంతము తెలుగు భాషలోనే నుండవలసినదని వారు పట్టుబట్టిరి. అందుచే నియమావళిలో ఆ నియమము చేర్చక తప్పినది కాదు అంతేగాక ఈసారి సభా కార్యక్రమ మంతయు తెలుగు భాషలోనే జరిగినదని వినుచున్నాము ఎంత గొప్పవారి కయినను గూడ యీ విషయములో 'మాఫీ' యివ్వనేయివ్వరాదని పై సంస్కరణోత్సాహుల పట్టు. వారి యీ పట్టు దివ్యముగా నెగ్గినందుకు వారిని మిక్కిలి అభినందించుచున్నాము "వేములవాడ భీమ కవి నగరము" లో జరుగు మహాసభలో ప్రసంగములు ఆంధ్రేతర భాష లోనా? దాదాపు సగము మందిని తెలుగు మాతృ భాషగా గలవారిని కడుపులో పెట్టుకొనియున్న మన నిజాం రాష్ట్రములో ప్రభుత్వ విధాన మందు తెలుగు భాష ద్వారా విద్యనేర్పు పద్ధతికి నియమములలో "ప్రైమరీ" వరలోనే స్వస్తి చెప్పబడెను. ఆంధ్ర భాషా వ్యవహారమును ప్రోత్సహించుటకు అటు ప్రభుత్వము వారికి సాధ్యము కానేలేదు కదా! యిటు ప్రత్యేకము ఆంధ్రుల కొరకై ముఖ్యముగా సాంఘిక భాషాభివృద్ధి కొరకై పాటుపడుచున్నట్లు చెప్పకొను ఆంధ్ర మహాసభ కూడ యితర భాషా దాస్యమును (జ్ఞానమును అని మేము చెప్పుట లేదు, గమనించుడు) వహించుకొనజాలనిచో అది యెంత లోపమోయిప్పుడు మనస్సులకు తెక్కునట్లు చేయబడినది ఆంధ్రులకు ప్రత్యేకముగ నొక సంస్థ అవసరమైనచో అది ముఖ్యముగా ఆంధ్రులకును తదితరులకును భాషా భేదము ఉండుట వలననే యని తలచవలసియున్నది ఇతర సాంఘిక వ్యవహారములు మున్నగు వాటిలో పాశ్చాత్య నాగరికతా సంపర్కముచే అధికముగా మార్పు కలిగి యితర సంఘములకును అట్టి సమస్యలే యేర్పడియున్నవి కాని భాష భిన్నమగుటచే తెలుగు మాత్రమే తెలిసిన వారు ఆ సమస్యలను చర్చించుటకై యితరులతో చేర వీలు లేకుండెను మన ఆంధ్ర మహాసభ అట్టి లోపమును తీర్చుటకే అవసరమగుచున్నదని తలచెదము. అట్లైనచో తెలుగు మాత్రమే

తెలిసిన సభ్యులకు అర్థము కానట్లు యితర భాషలలో కార్యక్రమము సాగించుట యెంత మాత్రము గాని తగదు!

మొత్తము మీద విశేషము లన్నియు ఒకసారి సింహావలోకనము చేసిన తర్వాత సిరిసిల్ల మహాసభకు ఆంధ్రోద్యమ చరిత్ర యందు వాస్తవమయిన ప్రాముఖ్యము నిచ్చునది—"ఆంధ్ర భాషా విజయము"న్ను దానికి మూలమయిన సంస్కరణోత్సాహుల విజయమున్ను అని చెప్పక తప్పదు ముందు ముందు యీ పక్షము అంతకంతకు ప్రబలమై ఆంధ్రోద్యమపు నావను వశపరచుకొన గల రోజు మాకు దూరమున నైనను స్పష్టముగా గోచరించుచున్నది

———

# రామకృష్ణుని సందేశము

**16-3-1936**

మతము పేర ప్రాణములతో చెరలాటము జరుగుచున్న నేటి భారత దేశములో, శ్రీ రామకృష్ణుని వంటి మహాపురుషుల సందేశములను, వారల జన్మ దినోత్సవములను, శతాబ్ద్యుత్సవములను, వేటినైననుసరే సందర్భముగా జేసికొని పవిత్ర హృదయముతో మననము చేయుట ఎంతయో ముఖ్య కర్తవ్యము

శ్రీ రామకృష్ణ పరమహంసగారి మహా వాక్యములు శాస్త్ర పారంగతులు పూర్వపక్ష సిద్ధాంతములతో కాలక్షేపము చేయుటకైగాక, హృదయ పూర్వకముగా ఆచరించువారలకై చెప్పబడినవి శ్రీ రామకృష్ణుడు భగవంతుని పొందుటకై ఒక్క హిందూ మతములోనేగాక, ఇస్లాం మతము, క్రైస్తవ మతములలో కూడ ఆచరణీయములగు సాధన లన్నింటిని పరమ విశ్వాసముతో అభ్యాసము చేసి, తుదకు గ్రహించినదేమనగా, నానా మతములును భగవంతుని పొందుటకు వేర్వేరు మార్గములు, అందరికిని పొందదగిన దొక్కటె వస్తువు, భగవంతుడు, ఈ మత భేదములు దేశకాలాద్యవస్థా భేదములను బట్టి ఏర్పడినవి అగుటంజేసి ఒక మతము కంటె ఇంకొకటి గొప్ప అను మాటయే లేదు, ఇప్పుడుండు మతములలో నేవిగాని సంపూర్ణము గావు, అన్ని మతముల నుండి ప్రధాన సూత్రములను అన్నింటిని ఒకటిగా చేర్చినచో సంపూర్ణ మతము ఏర్పడవచ్చును; కాబట్టి తన మతమున కంటె ఇతర మతములు తక్కువయని యెవరును వాటిని చిన్న జేయవీలులేదు, అయ్యో దేశములో ఇన్ని మత భేదములున్నవే యని యెవరును విచారపడనక్కరలేదు, భిన్న దేశ కాలాది పరిస్థితులు ఉండునంత వరకు మత భేదములును ప్రకృతి సిద్ధములే యగును. మతము భిన్నమను కారణమున ఎచటెచట వైరములున్నవో, అచటచట యంతయు స్వామి రామకృష్ణ పరమహంసగారి సందేశము హృదయములను ఆవర్జించునట్లు సంతత యత్నము అవసరము.

రామకృష్ణుని సందేశములలో ఇంకొకటి ధైర్య గుణము భగవద్గీతలో ప్రారంభములోనే ఈ గుణము కృష్ణ భగవానునిచే అర్జునునికి బోధించబడినది ధైర్యమనగా నిర్మలమయిన మనస్సు కలుషమగుటకు ఎంతటి కారణములున్నను సరే, ఆ మనస్సును కలకబారనీయకుండ శాంతముగా కర్తవ్యము నెరవేర్చుట పిరికితనము, ఆత్మవిశ్వాసము లేకుండుట, దిగులు, విచారము అనిన శ్రీరామ కృష్ణునికి ఎంతమాత్రము ఇష్టపడునవి కావు ఈ అనిష్ట గుణములన్నియు తమో లక్షణములు కనుకనే రామకృష్ణుడు తమ శిష్యులందు అగ్రగణ్యుడగు వివేకానందుని ద్వారా భారతదేశమును సత్వ గుణమునకు తెచ్చుటకు ముందు రజో గుణములో అభ్యాసము చేయించవలెనని సందేశించిరి దేశములో బూటకపు సన్యాసులు ప్రబలి పనిలేక స్తబ్ధులై పిరికి హృదయములతో కూర్చుండుటజూచి, వివేకానందుడు సన్యాసమనునది అన్ని సుఖములను కల్గిన వానికేగాని దరిద్రులై అధీర లక్షణములతో తనుకులాడుచున్న వారలకు కాదు అని తప్పు త్రోవను బట్టిన వేదాంతమును సరియగు త్రోవకు దెచ్చెను వివేకానందుడు సూటిగా గుర్తించినదే నేడు భారత జాతి అవస్థలో గొప్ప దోషమను మాటను నేడు యెవరయినను కాదనగలరా?

---

# మహారాజా బహద్దరు వారి ముల్కీ భాషా ప్రేమ

**23-4-1936**

మన రాష్ట్రములో హిందూ ముసల్మానుల ఐకమత్య స్థాపనము-మాటల చేతనేగాక కార్యముల చేతను - పెదవులచేతనే గాక హృదయము చేతను - కావించువారు ఎవరైన కలరా యనిన ఒక్కరు మాత్రము నిస్సంశయముగా కలరని పూని పలుకుచున్నాము. ఎవ్వరన మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దరు గారు గొప్ప దాత ఉదారుడు, పండితుడు, కవి, నానాభాషలందు ప్రవీణుడు విశాల హృదయుడు పూర్వపు మొగలాయి దర్బారు సిలుకు సముద్రము వంటి విశాల హృదయుడు నిష్పాక్షికుడు ఇట్టివారి అభిప్రాయ - ములు చాల విలువ చేయునవి

మొన్న ఉస్మానియా ట్రైనింగు కాలేజీ సాంవత్సరికోత్సవములో అధ్యక్షతా పీఠము నుండి వారు సెలవిచ్చిన మాటలలో ఈ క్రింది మాటలు ముల్కీలకు చాలా విలువ గలవి.

"గ్రామముల పాఠశాలలను పరీక్షించగా నాకు తెలియవచ్చిన, నేను తెలిసికొనిన విషయములను బట్టి యింత మాత్రము సూచన మాత్రము చేయుట చాలునునుకొందును అది యేమన - కొన్ని సంవత్సరములకు పూర్వము దేశ భాషల విషయమై యుండిన నియమముల పరిపాలనలో విశేషముగా మార్పు కావింపబడుటచే విద్యా బోధకులకు (ముల్కీ) దేశ భాషలందు ప్రావీణ్యత తక్కువయి పోయినది దీని ఫలితముగా గ్రామ పాఠశాలలలోని విద్యార్థులకు నష్టము కలిగినది. ."

ఈ వాక్యములు అక్షర మక్షరము సత్యమని మేము చెప్పవలసిన పని లేదు నవ్వాబ్ మెహదీయార్ జంగు బహదరు గారే మహారాజాగారికి అదే సభలో జవాబు నిచ్చుచు నిట్లు సెలవిచ్చిరి

"విద్యాశాఖ యొక్క వైశాల్యమును బట్టి ఏకదమ్మున మార్పులు చేయవలెనని ఆశ పెట్టుకొనుట తప్ప క్రమక్రమముగా ప్రతి విషయముపై దృష్టిని సారించి సంస్కరించవలసి యుండును... ... దేశ భాషలను గురించి నాకు పూర్తిగా శ్రద్ధ కలదు క్రమశః దానిని గురించిన సంస్కారములు చేయబడును........."

ఉన్నతాధికారులలో మన నవాబు మెహదేయార్‌జంగు గారును చాల ఉత్తములు రాష్ట్రమునకుగాని రాజుకుగాని కించిత్తు కూడ వ్యతిరేకముగా తలపు చేయువారు కారు వారు రాష్ట్రములో నెప్పటికిని శాంతి యుండవలెననియు ప్రజలకు ఏలాటి యిబ్బందులు వుండకూడదనియు, అశాంతి నిర్మూలము కావలెననియు సదా హిత చింత చేయువారు

పై యిరువురి అభిప్రాయములను వినిన తర్వాత దేశభాషలకు సరియైన స్థానము వెంటనే కాకున్న క్రమశః యైన దొరకునని ఆశ హెచ్చుచున్నది

అన్నియు సరేకాని క్రమశః అనుపదమే కొంచెము తట్టుకొనుచున్నది దీని యర్థము రబ్బరు వంటిది ఎంత దూరము లాగిన అంత దూరము సాగును. అట్టి రబ్బరుకు కూడ తెగిపోవు సమయము రానేవచ్చును కావున క్రమశః అనగా యెంతకాలము' విద్యా విషయములో క్రమశః వుండవచ్చునా? నూటికి 85 పాళ్ళ జనుల ముల్కీ భాషలకు ఇంతవరకే సరియైన స్థానము లేక వారి సభ్యత వారి విజ్ఞానము, కావలసిన రీతిగా అభివృద్ధి యగుట లేదు

బ్రిటిషిండియాలో పరభాషయగు ఇంగ్లీషులో విద్యా వ్యాపకము చేసిన 63 ఏండ్లకు "అరరే' ఇంతవరకు చేసిన వ్యయము, యత్నము శ్రమ, అంతయు వ్యర్థమే" అని ప్రభుత్వమువారును, ప్రజలును గుర్తించిరి ఆ పద్ధతి అస్వాభావికమనియు హానికరమనియు గుర్తించిరి

మేము పలుమారులు ఈ ముల్కీ భాషా సమస్యను గూర్చి వ్రాసినచో మేము ఉర్దూ ద్వేషులమని భావించువారు మాయెడ చాల అన్యాయము చేసినవారగుదురు. మన విద్యా విధానములో ఉర్దూకుండిన ప్రాముఖ్యతయైన దేశ

భాషలకు లేకుండెను గదా యనుట సంకుచిత దృష్టి మూలమో ఇంకెవ్వరికైనయో మాయెడ దురభిప్రాయపడువారు ఎదమీద చేయి పెట్టుకొని దైవమును సాక్షిగ నుంచుకొని తమ అభిప్రాయమును పునర్విమర్శనము చేసికొందురు గాక.

రాజకీయ వ్యవహారములలో ఉర్దూను వుంచుకొనుడు. అధికారములకై, నౌకరీలకై ఉర్దూ నియమము ఉంచుడు. కచ్చేరీల తీర్పులు ఉర్దూలోనే చేయుడు. సర్కారీ నివేదికలు ఉర్దూలోనే ప్రచురింపుడు. కాలేజీలలో ఉర్దూనే ప్రధానముగ నుంచుడు. మాకు ఏమియు నాక్షేపణము లేదు. కాని ప్రాథమిక, మాధ్యమికాది పాఠశాలలలో జనుల మాతృభాష మూలముననే విద్య చెప్పించవలెననుట ముఖ్యము. ఆ విషయములో మేము ఎన్నటికిని మాతృద్రోహము చేయజాలము.

కావున ఈ సందర్భమును మరల పునస్మరించుకొని మహారాజా గారిని ఈ విషయమును లేవనెత్తినందులకు, నవాబు గారిని ఈ విషయములో శ్రద్ధ బూనినందుకు, ప్రశంసించుచు ఆ క్రమశః అను పదమునకు నిర్వచనము కాల పరిమితితో చేసిన బాగుండునని తలంచుచున్నాము

---

# విజయనగర షష్ఠి శతాబ్దోత్సవము

**23-4-1936**

విజయనగర సామ్రాజ్యము (Empire) అసామాన్యమైనదై యుండెను. వింధ్యాద్రి నుండి కన్యాకుమారి వరకు వ్యాపించి యుండినట్టిది అట్లుండినను మన రాష్ట్రి చరిత్రకారులగు సయ్యద్ హాషమీ గారు దీనిని "రెజ్వాడ" సంస్థానముగా పేర్కొనినారు ఆ చర్చ యిప్పుడెందుకు లెండు ఇప్పుడు చెప్పబోయిన దేమన ఇంతలో అనగా డిసెంబరు మాసములో కర్ణాటకులు విజయనగర సామ్రాజ్య స్థాపన కాలము ఈ సంవత్సరములో ఆరు శతాబ్దములు ముగియుచుండుటచేత గొప్ప యుత్సవము హంపీలో చేయనున్నారు

కాని ఆంధ్రులు మాత్రము ఏమియు ఆ విషయమై ఆలోచించునట్లు లేదు. కర్ణాటకులీ పనికయి రెండు సంవత్సరముల నుండి ప్రయత్నములు చేయుచున్నారు కర్ణాటకుల కన్న హెచ్చుగా ఆంధ్రులకీ విషయమున శ్రద్ధాభక్తులు ఉండవలసి యుండెను ఆంధ్ర చారిత్రక పరిశోధన సంఘము వారీ విషయమున శ్రద్ధ చూపవలెను. కాకతీయ సంచికలో అలసి సొలసి నిద్రపోవుట హాస్యాస్పద మగును

ఇప్పటికయినను మించినది లేదు ఇంకను ఏడెనిమిది నెలల అవకాశమున్నది తగిన సన్నాహములు చేసిన చాల గొప్ప పని చేసినవారు కానుందురని హెచ్చరించుచున్నాము.

---

# తిరువాన్కూరులో వైవాహిక శాసనములు

**27-4-1936**

తిరువాన్కూరు సంస్థానములో నుండునట్టి విచిత్ర ఆచారములు మరే భాగమందును లేకుండెను అచ్చటి నంబూద్రీ బ్రాహ్మణులు సంపూర్ణముగా తక్కిన బ్రాహ్మణుల నుండి భేదించియున్నారు అక్కడి నాయర్ల ఆచారములు ఇతరత్ర మృగ్యము. అక్కడ వుండునట్టి ఘోరమయిన అస్పృశ్యత - అంతే కాదు, అదృశ్యత, అశ్రావ్యత - ఇంకెందును లేవు అది ఆడు మండల మలయాళము అనగా స్త్రీలకే వారసత్వపు హక్కు మలయాళిలో దానిని "మరుమక్కత్తాయం" అందురు

అట్టి తిరువాన్కూరులో కూడ హిందూ ధర్మశాస్త్రములో అనేకములగు మార్పులు కలిగినవి, కలుగుచున్నవి, కలుగగలవు అని సంపూర్ణముగా నమ్మ వచ్చును మలబారు వివాహ శాసనము చాల యేండ్ల క్రిందట కావింపబడెను ఆ శాసనమైన తర్వాత నాయర్లలో నుండిన ఒక విధమగు చీరకట్టులోను పెండ్లింద్ల లోను వారసత్వములోను గొప్ప మార్పు జరిగెను మొన్నటి శాసనసభలో 2 క్రొత్త శాసనములు ప్రథమాంగీకారము (First Reading) పొంది ప్రత్యేక కమిటీ దీనిని చర్చించుటకై ఏర్పాటయ్యెను

అందొక శాసనము బాల్య వివాహ నిరోధక శాసనము, అనగా శారదా ఆక్టు యొక్క అపరరూపము శారదా శాసనము బాలికలకు 14 ఏండ్ల లోపుగా వివాహములను నిషేధించును కాని తిరువాన్కూరు శాసనము 15 ఏండ్లు నిర్ణ యించి ఒక మెట్టు పైకే పోయినది అనగా మొన్నటి చతుర్థ నిజాం రాష్ట్రాంధ్ర మహాసభ వారు తీర్మానించిన ప్రకారమే అచ్చట శాసనమగుచున్నదన్న మాట. దీనిని జూచిన సిరిసిల్ల సభవారు కావించిన తీర్మానము అసంభవము, అనవ సరము కానట్టిదని సనాతనులకు గూడ వెలడి కాగలదు.

ఇంకొక్క విశేషము ఈ శాసనమును ప్రవేశ పెట్టినది శ్రీమతి టి. నారాయణమ్మ అను స్త్రీ శాసన సభ్యురాలు ఈ పేరు విన్నంతనే రెండు విషయములు స్ఫురించును తిరువాన్కూరు సంస్థాన మెంత ధన్యమైనదో కదా స్త్రీలను కూడ శాసన సభలకు ఎన్నుకొనుటకు, మరియు స్త్రీల కష్ట సుఖములను గురించి నిర్ణయింపవారు ప్రాచీనము నుండియు పురుషులైన పురుషులే అది సరియైన పద్ధతి కాదు స్త్రీలను గురించి అభిప్రాయముల నిచ్చుటకు స్త్రీలే ఎక్కువగా అర్హులు

ఆ విషయ మట్లుండనీ ఇప్పుడు చెప్పబోయినది యేమన తిరువాన్కూరు శాసన సభలో గావింపబడిన పై తీర్మానము చాల ప్రశంసనీయము. ఇక రెండవ శాసనమేమన, "స్పెషల్ మ్యారేజి మరియు విరాసతు శాసనము" అనునది అనగా హిందూశాస్త్ర ప్రకారము సవర్ణ వివాహములే చెల్లును కాని అంతర్వర్ణ వివాహములు చెల్లవు అంతర్వర్ణ వివాహములకు అనులోమ, ప్రతిలోమ వివాహములని శాస్త్రకారులు పేరు పెట్టిరి అనులోమ మనగా పై జాతి పురుషులు క్రింది జాతి స్త్రీలను వివాహమాడుట ప్రతిలోమము తద్విరుద్ధము దీనివలన ప్రాచీనము నుండియు పై జాతులవారి దౌర్జన్యము వ్యక్తమగుచున్నది తమ స్త్రీలను బాగుగ కాపాడుకొని ఇతర స్త్రీలను బాగుగా వాడుకొను హక్కుంచుకొనిరి ఇదొక విధముగ "నాజీ"తత్వము, హిట్లరు సిద్ధాంతము బ్రిటిషు కోర్టులును అదే ప్రకారము శాసించెను ఎందుకనగా బ్రిటిషు వారు హిందూ ధర్మ శాస్త్రములో హిందూ మత విశ్వాసములకు విరుద్ధముగా ఆచరింప మని బద్ధకంకణులైరి కదా కాని అప్పుడప్పుడు స్వకీయావకశములను బట్టియు మరి యితర కారణముల చేతను మత కష్ట నివారణ శాసనము (Removal of Religious Disabilities Act) వంటి శాసనములు కావించిరి లెండి

ఇట్లు బ్రిటిషు కోర్టులొక విధముగా "సనాతను"లను నూతన నామకరణము చేసికొనిన పూర్వాచార పరాయణులకు సహాయము చేయుచుండగా కాలము కొలది మార్పులు మానవ నైసర్గిక రూపముగా చేసికొనుచుండు హిందూమత బహుళ సంఖ్యాకులకు చాల యిబ్బంది కలిగెను ఏలన వివాహము ఒక సవర్ణము లోనే చేసికొనవలెనను నిర్బంధము మూర్ఖవిలసితము. ప్రేమకు సంకెళ్ళుండవు,

హద్దులుండవు బ్రాహ్మణ స్త్రీయు శూద్రుడు పరస్పరము ప్రేమించవచ్చును. హిందూ ముసల్మాను స్త్రీ పురుషులే ప్రేమించి వివాహమాడుచున్నారు. వైశ్యులును, శూద్రులును యిట్లే చేయవచ్చును అట్టిచో వివిధ శాఖలవారి వివాహములను రద్దుచేయుటకు సంఘము హక్కు సంపాదించుకొని దౌర్జన్యము చేయుట చాల మొరటు పని

అదేమి చిత్రమో ప్రపంచములో జనులకు తమ యింటి సంగతి చూచుకొనుటలో తృప్తి నొందక యితరుల వ్యవహారములలో వ్రేలుపెట్టు నాచారము ఎక్కువైపోయినది అన్నిటికన్న హెచ్చుగా వివాహ విషయములలో సంఘ మెక్కువగా జోక్యము కల్గించుకొనుచున్నది

జాన్ సెల్డన్ అను ఆంగ్ల పండితుడొక సందర్భములో నిట్లు సెలవిచ్చెను.

"Of all actions of a man's life his marriage does least concern other people, yet of all actions of our life it is the most meddled with by other people".

"ఒక మనుష్యుని చర్యలలో వారి వివాహ కార్యము మాత్రము ఇతరులకు బొత్తిగా సంబంధము లేనట్టిది కాని మన జీవితములలోని అన్ని కార్యములలో నిదియే ఇతరులచే అత్యంతముగా లొడబెట్టబడినది"

ఈ పండితుని వాక్యములు అక్షరశః సత్యము హిందువులలో నాడును నేడును అంతశ్శాఖా వివాహములు జరుగుచున్నవి అవి యశాస్త్రీయమని నిర్ణయించి వారసత్వమందిబ్బందులు కల్పింతురు ఇప్పుడు తిరువాన్కూరు శాసనము వలన అట్టి యిబ్బందులు తొలగింపబడుచున్నవి

తిరువాన్కూరు సంస్థానము హిందూ ధర్మశాస్త్రమందు కాలనుగుణ్యముగా మార్పులు గావించుట మంచి శుభసూచకమైన విషయము. మన రాష్ట్రములో బాల్య వివాహ నిరోధక శాసనము కీ॥ శే॥ పండిత కేశవరావుగారిచే

స్థానిక శాసన సభలో ప్రవేశ పెట్టబడెను కాని హిందువుల దురదృష్టవశమున అది గూటిలో పారవేయబడెను వితంతూద్వాహ శాసనము ప్రవేశపెట్టబడెను కాని సనాతనుల చమత్కారమునకు వశమై అది పంటుబడి యున్నది ఇవి రెండే యీ శతాబ్దములో నిజాం రాష్ట్రములో కావింపబడవలె నని కోరబడిన హిందూ శాసనములు, వీటి గతి యిట్లయ్యెను మనకు లేకున్నను ప్రక్కయింటి వారి వైభవము నయిన చూచి యానందించి యూరడిల్లుడని సోదర సంస్కారులకు ఓదార్పు నిచ్చుచున్నాము

---